The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

వెల : రూ. 10

పేజీలు 76

16-31
డిసెంబరు
2003



GOVERNMENT OF ANDHRA PRADESH

सत्यमेव जयते





# ప్రతి నీటి బొట్టును వినియోగిద్దాం
# సమృద్ధిగా దిగుబడులు సాధిద్దాం

**మైక్రో ఇరిగేషన్ ప్రాజెక్టు క్రింద రూ. 1120 కోట్లతో 2.5 లక్షల హెక్టార్లలో డ్రిప్ ఇరిగేషన్ మరియు ఇతర సేద్యపు సౌకర్యాలు**

జారీచేయువారు: సమాచార పౌరసంబంధాల శాఖ

హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు





ముఖచిత్రం
'నాని' లో
మహేష్‌బాబు

## హాస్యం

**సీరియల్స్:**
ఎలుక వచ్చే ఇల్లు భద్రం
-ఇలపావులూరి మురళీమోహనరావు 31
తాతా ధిత్తై తధిగిణతోం...
-జీడిగుంట రామచంద్రమూర్తి 46
**కథలు:**
గంగోత్రి -గుండు సుబ్రహ్మణ్యదీక్షితులు 06
కరెంటు మీటర్ -బచ్చు వీర్రాజు 54
**బాపూరమణీయం:**
మిస్టర్‌పెళ్ళాం (వెండితెర నవల)
-ఇలపావులూరి మురళీమోహనరావు 14
**హ్యూమరథం:**
కాంతం కథ-సత్యంవ్యథ
-రావి కొండలరావు 18
**శీర్షికలు:**
హ్యూమర్ బాక్స్ 12
చౌ చౌ చౌరస్తా 58
**స్పెషల్స్:**
**'క' రాజు కథలు:**
తుంబురశాస్త్రి - సింగీతం శ్రీనివాసరావు 20
పింగళి పాటల్లో వెటకారాలూ
చమత్కారాలూ -రావి కొండలరావు 23
డిసెంబరు 31 కార్టూన్స్ స్పెషల్ 57
ఇడియట్ల పెట్టె అను సరదా పద్యాలు
-డా॥ పి.వి.రామకుమార్ 24

'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల పుస్తకం













## సంగీతం

**సీరియల్:**
సప్తస్వరసుందరి లతా మంగేష్కర్
- పి.బి.శ్రీనివాస్ 60
**లలితం:**
ఆకాశవీణ పై ఉదయరాగం
- చిత్తరంజన్ 10
**పాప్‌కార్నర్:**
మెహనాజ్ - వి.అరుణ సత్యవతి 41
**సినిమా:**
**ఆపాత(ట) మధురం**
శ్రీ వేంకటేశ్వర మహత్మ్యం - రాజా 64
**అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం**
కల్ హో నా హో
-పి.వి. సత్యనారాయణ రాజు 43
మాయాబజార్ (తమిళం)
- పి.ఎస్.గోపాలకృష్ణ 26
**శీర్షికలు:**
ఆడియోరివ్యూ 42
సరిగపదమని - 9 29
సరిగపదమని - 7 ఫలితాలు 30
సరిగపదమని - 5 విజేతలు 68
హిందీ సినీ సంగీతంలో
మలుపులూ మజిలీలూ 52
**స్పెషల్స్:**
'హాయ్‌రబ్బా' స్మిత తో ఇంటర్వ్యూ 34
నౌషాద్ - మృణాళిని 50
నౌషాద్ హిట్స్ 53

పాటల ప్రత్యేకం
69,70,71,
72,73,74
పేజీల్లో






1-15 డిసెంబర్ సంచికలో సంపాదకీయం చదివాను. మీరెందుకంత బాధపడి పోయారో అర్థం కాలేదు. ఇప్పుడలా నివ్వెరపోవడం, పరువుపోయిందనుకోవడం హాస్యాస్పదం. రోజూ ప్రతి తెలుగు ఛానల్లోనూ ఆడపిల్లలు, పాలపళ్ళూడి కూడా - పొంటు కూడా కట్టుకోడం రాని పిల్లలు - గిలగిల్లాడి పోతూ పోటీ డ్రస్సులు చూస్తూ కూడా మీరు బాధ పడటంలో అర్థం లేదు.

ఆ ఆడపిల్లల తల్లితండ్రులు బతికి వున్న వాళ్ళు. ఇలా ఆడించడానికి ప్రోత్సహించి - తీసుకువస్తున్నారంటే-పిల్లల్ని కాదు- ఆ పెద్దలను చూసి మనం జాలిపడాలి. ఇదే గొప్ప సాధన అని - ప్రేక్షకులు ఆవేశం పట్టలేక గంతులు వేయడం వారిని మనకి చూపించడం చూసి బాధపడాలి.

ఒక స్వాతంత్ర్యదినం నాడు సామూహికంగా జాతీయ గీతం కూడా పాడటం నేర్పని స్కూళ్లని చూసి బాధపడాలి. బృందగానానికి వందలూవేలూ పిల్లలను తయారుచేసి- అందరినీ- అపశృతులు లేకుండా పాడించిన ఎమ్.బి.శ్రీనివాస్ వంటి వారు లేరని బాధపడాలి. ఇలా చితికిపోయిన మన సాంస్కృతిక జీవనం చూసి మరీ మరీ బాధపడాలి....

**-కె.రామలక్ష్మి ఆరుద్ర, చెన్నై**

'నభూతో నభవిష్యతి'గా తన సంగీత జలనిధిలో ఓలలాడించిన పుంభావ సరస్వతీ మూర్తి 'ఎం.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ'గారి సన్మాన, సత్కారాలను కళ్ళారా చూసి, ఆయన చరణారవిందాలను తాకి పునీతుడనైన నేను నవంబరు 16-30 'హాసం' సంచికలో ప్రచురించబడిన విజయలక్ష్మిగారు శర్మగారిపై రాసిన వ్యాసం చదివి మరోసారి పులకించి పోయాను. ఆయన కచేరి చేస్తున్నప్పుడు తాళం వేస్తున్న వేగాన్ని, పూనకం వచ్చిన వారిలా ఊగిపోయే ఆయన శరీరాన్ని ఆశ్చర్యంగా తిలకించిన నేను, ఫలానా కీర్తన పాడండి అని చీటి వ్రాసి పంపిన వారిపై ఆయన తెచ్చుకునే కోపం నేనిప్పటికీ మరువలేను. కాలగమనంలో మహానుభావులైన శర్మగారి స్వరసార్వభౌములను సంగీత చరిత్ర మరిచిపోకుండా అవిరకృషి సల్పుతున్న 'హాసం'కి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు!

**- నారాయణ డి.వి.వి.ఎస్, వనపర్తి.**

'హాసం' హాస్య సంగీత పత్రిక నిజంగా మాలాంటి వారి కోసమే వచ్చిందా అనిపిస్తుంది. పత్రికలు చదవడం మానేసిన నేను 'హాసం' పత్రికతో తిరిగి ప్రారంభించాను. నేను వృత్తిరీత్యా సంగీత ఉపాధ్యాయుడిని. 'హాసం' పత్రిక రాగానే ప్రక్కనున్న పట్టణం 'భీమవరం' వెళ్ళి కొని ఎంత రాత్రి అయినా చదివే వరకూ మనశ్శాంతి ఉండదు. సినీ సంగీతం గురించి తెలుసుకోవాలనే నాలాంటి వారికి మన 'హాసం' పత్రిక ఒక వరం లాంటిది. నాతో పాటు ఇప్పటికి పదిమందికి పరిచయం చేశాను. వారు క్రమం తప్పక చదువుకుంటున్నారు. ఏదైనా ప్రయాణం ఉంటే నాతో రెండు మూడు పత్రికలు కూడా ఉంచుకుని ప్రక్కవారికి కూడా పరిచయం చేస్తుంటాను. ఒక సంగీత ఉపాధ్యాయునిగా నా వద్దకు వచ్చే కళాకారులకు, తెలుగు పండితులకు ముఖ్యంగా గాయకులకు 'హాసం' పత్రిక గురించి వివరించి పత్రికను చూపిస్తుంటాను. ఒక మంచి పత్రికను పదిమందికి పరిచయం చేసామనే తృప్తి నాకు ఉంటుంది.

**-ఎన్.ఎస్.రాజు, శృంగవృక్షం,ప॥గో॥జిల్లా**

హాస్య సంగీతాలను జత చేర్చి ఒక పత్రికను రూపొందించడం నిజంగా ఒక వినూత్న ప్రయోగం. అన్ని అంశాలు బాగుంటున్నాయి. ముఖ్యంగా పలుభాషల సినిమా పాటలకు సంబంధించి అనేక విషయాలను వివరంగా తెలుసుకోగలుగుతున్నందుకు ఆనందంగా ఉంది.

**-ఎం. అంజిరెడ్డి, ఒంగోలు**

'హాసం' హాస్య సంగీత పత్రికను కొన్ని మాసాల నుండి చదువుచున్నాను. పోగొట్టుకున్న పెన్నిధి దొరికినట్లనిపించింది. గతంలో విజయచిత్ర, సినిమారంగం, సినీ హెరాల్డ్, వెండితెరలాంటి పత్రికలు సినీ సాహితీ ప్రియులను చక్కటి విశేషాలతో అలరించేవి. ఆ తర్వాత సినీ రంగానికి సంబంధించిన వేరే పత్రికలొచ్చినా, సాహిత్యాభిలాషులకు సరియైన సమాచారం దొరకటం లేదని భావిస్తున్న తరుణంలో 'నేనున్నాను నేస్తమా' అంటూ అన్ని వర్గాలవారికి అతి చేరువగా 'హాసం' దరహాసం చేయసాగింది. ఎంత చదివినా ఇంకా విశేషాలు మిగిలిపోతున్నాయి. అసలు హాస్యాన్ని, సంగీతాన్ని ఒకే పత్రికగా తీసుకురావాలనుకోవడం అద్భుతం. ప్రతి పక్షం ఏ మాత్రం బోరు లేకుండా ముందుకు తీసుకువెళ్లడం నాకు బాగా నచ్చింది. పాత, కొత్త పాటలు అచ్చు తప్పులు లేకుండా తనివి తీరా పాడుకోవడానికి అనువైన మార్గాన్ని సుగమం చేసిందీ పత్రిక.

**-జీడిగుంట నరసింహమూర్తి, సిర్పూర్ కాగజ్‌నగర్**

నేను 'హాసం' మొదలు పెట్టినప్పటి నుండి కొని చదువుతున్నాను. మీరు చేస్తున్న ప్రయోగాలు అద్భుతం, అపూర్వం. మీరు అందిస్తున్న నిక్షిప్త చిత్రాలు నాలాంటి వారికి ఒక వరం లాంటివి. ఏవంకా పెట్టలేని పత్రిక మన 'హాసం'.

**-ఎస్.కేశవ అయ్యంగార్, నరసాపురం**

నేను 'హాసం' అభిమానిని. ముఖ్యంగా 'హాసం'లో వచ్చే పాత, కొత్త పాటల కోసం 'హాసం' తప్పకుండా చదువుతాను. కామెడీ కథలు కూడా నాకు ఇష్టం. అభిమానులు కోరుకున్నట్లు 'హాసా'న్ని అందిస్తున్నందుకు సంతోషం.

**-సూర్య, కొమరిపాలెం.**

మా అభిమాన దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు గారి క రాజు కథలు చాలా బాగుంటున్నాయి. 'హాసం' పత్రికపై నా అభిప్రాయం..

H : హ్యూమర్ బాక్స్
A : అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం
A : ఆ పాత(ట) మధురం
S : సరిగపదమని క్విజ్
A : ఆడియో రివ్యూస్
M : మిస్టర్ పెళ్లాం సినీ నవల

**-పడాల రాము, పాతపట్నం**

1-15 డిసెంబరు సంచిక చూసిన తర్వాత నా అవ్యక్త అభిమానాన్ని వ్యక్తం చేయాలని అనుకుంటున్నాను. మీరు వ్రాసిన సంపాదకీయం ఎంతో సందేశాత్మకంగా ఉంది. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులూ, ముఖ్యంగా యువత ఈ అంశంపై కళ్లు తెరిచి సన్మార్గం వైపు పయనించాలని ఆశిద్దాం. ఇకపోతే డా॥ బాలాంత్రపు రజనీకాంతారావు గారిని ఆకస్మికంగా సాక్షాత్కరించారు. ఆయన నిజంగా కురువృద్ధులు భీష్మాచార్యుల వంటివారు. ఆయన ఆకాశవాణిలో ఉన్నంతకాలం అది స్వర్ణయుగమే.

**-మురళి,ప్రొద్దుటూరు**

'హాసం' అందించే నిండు హాసంలో మునుగుతున్న చాలా మందిలో ఒకడిని. 1-15 డిసెంబరు2003 సంచిక చదివాక మనస్సు ఆగక వ్రాస్తున్న అక్షరాలివి. గీతలో గాథలని అక్షరంలో విచిత్ర గతులని చూప సమర్థులైన బాపు రమణల గూర్చి బాలు గారు వ్రాస్తున్న పదాలు ఆర్తితో స్ఫూర్తితో నిండి చదువుతున్న ప్రతిక్షణం కళ్లని తడి చేస్తున్నవి. తాను పొందిన వాత్సల్యాన్ని, అనుభూతిని- ఋణం తీర్చుకోవాలనే తపనతో- తన తరంలో వచ్చే వాళ్లకి వారసత్వంగా చూపాలనుకునే భావన ఎంత ఉదాత్తమైంది? ఎవరూ ఇవ్వలేని మనోజ్ఞ జ్ఞాపికను వారికి బాలు ఇచ్చారు.

**-డా॥ఐ.రామకృష్ణ, విజయవాడ**

సరిగపదమని-4 పోటీలో ప్రథమ బహుమతి విజేతగా నాకు మీరు పంపిన 'హృదయగానం' సి.డి.లు అందినవి. సుమధురగాయని సుశీల గారి గళం నుండి వారిన వైమరపించే ఆణిముత్యాల్లాంటి గీతాలు మమ్మల్ని ఆనంద పారవశ్యంలో ముంచెత్తాయి. హాస(స్య)పు సినీ సంగీత పరిమళాలు ఇటులనే ఇంటింటా గుబాళించాలని అభిలషిస్తూ....

**-నందిరాజు శ్రీవాణి, హైదరాబాద్**

సంపుటి: 3 సంచిక: 6

**16-31 డిసెంబరు 2003**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

54

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

**సాం**కేతిక విప్లవం తెచ్చిపెట్టిన అనర్థాలలో ఒకటి - బంధుమిత్రుల మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు బొత్తిగా తగ్గిపోవడం! ఫోన్ చేయడంలో ఉన్న హుషారు కలంపట్టి కాగితంపై భావాలు వెలువరించడంలో ఉండటం లేదు. కథాకారులు, చిత్రకారులు, వ్యాసకర్తలు పత్రికలలో ప్రచురించబడిన తమ రచనలకు స్పందనగా ఉత్తరాలేమైనా వచ్చాయాని అడుగుతున్నప్పుడు ఈ విషయం మరింతగా స్పష్టమవుతూంటుంది. బాగుందని ఫోన్ చేసి చెప్పేవారు కోకొల్లలుంటారు. వారందరికీ 'థాంక్స్' చెబుతూనే 'ఈ విషయం లేఖారూపంగా రాసి పంపితే వారూ మేమూ సంతోషిస్తాం కదా' అంటే 'అమ్మా, నాన్నలకే ఉత్తరాలు రాయటం లేదు. ఇక ఇవన్నీనా..?' అంటూ నాన్చేస్తారు.

ఫోన్ చేయడం వల్ల పర్సనల్ టచ్ ఉంటుందని భావించేవారు ఒక విషయం గుర్తించాలి - ఏదైనా భావానికి అక్షరరూపం కల్గించినప్పుడు దానికి ఒక గౌరవం కలుగుతుంది. చిరకాలం భద్రపరచుకో బుద్ధేస్తుంది. మాటల్లా గాలిలో తేలిపోకుండా, గుర్తుకు వచ్చినప్పుడల్లా దాచుకున్న ఉత్తరాన్ని తీసి చూసుకుని మురిసిపోవడం జరుగుతుంది. భావప్రకటీకరణలో కూడా వాగ్రూపానికి, అక్షరరూపానికి తేడా ఉంటుంది. అక్షరాలుగా రాసేటప్పుడు ఒక పొందిక ఉంటుంది, స్పష్టీకరణ ఉంటుంది, పొల్లుపదాలు లేని సొగసు ఉంటుంది.

కానీ క్రమంగా ఈ ఉత్తరాలు రాసే కళ అంతరించిపోతోంది. ఇది ఎస్.ఎమ్.ఎస్.ల యుగం. విషయాన్ని సూటిగా చెప్పడానికి ఇచ్చే ప్రాధాన్యం అందంగా చెప్పడానికి ఇవ్వటం లేదు. పొడిపొడి అక్షరాలలో అత్యంత కటువుగా, పచ్చిగా భావవ్యక్తీకరణ సాగుతోంది. ఈ విధంగానే కొనసాగితే టెలిఫోన్స్ డిపార్టుమెంటు మాత్రమే వర్ధిల్లి, పోస్టల్ డిపార్టుమెంటు మూతపడే ప్రమాదం వచ్చేసేదే, ఏడాదికో సారి గ్రీటింగ్స్ పంపే అలవాటంటూ లేకపోతే!

కొత్తసంవత్సరం సందర్భంగా గ్రీటింగ్స్ పోస్టులో పంపే ఆనవాయితీ కొనసాగుతూండడం హర్షణీయం. అప్పటికీ టెలిఫోన్ వినియోగదారులదే పై చేయని ఒప్పుకోకతప్పదు. డిసెంబరు 31 రాత్రి, జనవరి1 వ తారీకు ఉదయం ఫోన్ లైన్లన్నీ మహా బిజీ. శుభాకాంక్షలు చెబుదామనుకున్న వారందరి నెంబర్లూ ఎదుట పెట్టుకుని డయల్ చేస్తూనే పోతూ, నెంబరు తగిలినవారికి తగిలినట్టుగా 'హేపీ న్యూ ఇయర్' చెబుతూ పోవాలి. ఎవరికి చెప్పామో, ఎవరిచేత చెప్పించుకున్నామో, ఇంకా ఎంతమంది మిగిలిపోయారో తెలియని గందరగోళ పరిస్థితి.

ఇంత కష్టపడి గ్రీటింగు చెప్పినా అందులో అందం అంతగా కానరాదు. అందరూ, అందరికీ చెప్పేది ఒకటే మాట - 'హేపీ న్యూ ఇయర్'. దీనిలో మనదైన ముద్ర ఉండదు. అవతలివారి అభిరుచి తెలిసి, వారికి మాత్రమే అనుగుణమైన రీతిలో చెప్పిన తృప్తి ఉండదు. కంప్యూటర్ భాషలో చెప్పాలంటే అంతా 'స్టాండర్డ్' మాత్రమే! 'కస్టమైజ్‌డ్' అస్సలు ఉండదు. అందుకే ఎవరు గ్రీట్ చేశారో, ఎవరు చేయలేదో గుర్తుంచుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది.

గ్రీటింగ్స్ అయితే, వివిధరకాలైన దృశ్యాలతో, వ్యాఖ్యలతో అనేకం కనబడతాయి. వాటిలో మనకు నచ్చినది, అందుకునే వారికి అన్వయించేది ఉన్నదానిని ఎంపిక చేసి మరీ పంపవచ్చు. ఎదుటివారు కూడా దానిని భద్రపరుచుకుని, పుస్తకాలలో బుక్‌మార్క్స్‌గానో మరోలాగానో ఉపయోగించుకుంటూ అనేక సంవత్సరాలపాటు మనను గుర్తుంచుకోవచ్చు. ఈ విషయాన్ని గ్రహించడం వల్లనే చాలామంది కనీసం కొత్త సంవత్సరం సందర్భంగానైనా పాత పరిచయాలను తిరగదోడడానికి గ్రీటింగ్స్ సహాయం తీసుకుంటారు.

రాబోయే 2004 సంవత్సరానికై ఈ పక్షంలో గ్రీటింగ్స్ పంపేందుకు సన్నాహాలు చేస్తున్న పాఠకులకు 'హాసం' ఒక విజ్ఞప్తి చేస్తున్నది - ఈ సారి గ్రీటింగ్స్‌కు బదులు మీ బంధుమిత్రులకు ఆడియో కాసెట్స్, సిడిలు పంపి చూడండి. ప్రస్తుతం మార్కెట్లో లభిస్తున్న ఓ పాటి గ్రీటింగ్స్ 20, 25 రూపాయలకు తక్కువగా లభించటం లేదు. ఆ ధరలోపున దొరికే ఆడియో కాసెట్సు కూడా ఉన్నాయి. పంపే ఖర్చులు ఎటూ తప్పవు.

కొన్ని బ్యాంకులవారు తమ ఖాతాదారులకు ఆడియో కాసెట్సు పంపి వారు తమను కలకాలం గుర్తుంచుకునేలా చేస్తున్నారు. కానీ అక్కడ పైన చెప్పినట్టు 'కస్టమైజ్‌డ్' సెలక్షన్ కాదు. ఖాతాదారుకు ఆ సదరు పాటలు నచ్చకపోవచ్చు. కానీ మీ విషయంలో నైతే మీ అభిరుచిని, ఎదుటివారి అభిరుచిని దృష్టిలో పెట్టుకునే కాసెట్టును ఎంపిక చేస్తారు కాబట్టి దాన్ని అందుకున్నందుకు వారు ఆనందిస్తారు. విన్న ప్రతీసారీ మిమ్మల్ని తలుచుకుంటారు.

గ్రీటింగు ఓ సారి పరికించి ఊరుకోవచ్చు. కానీ ఆడియో కాసెట్సు వినడానికి అవకాశాలు పదేపదే కలుగుతాయి. ఇంట్లోనే కాదు, బయటకు వెళ్లిన సందర్భాలలో కూడా కారు స్టీరియో ద్వారా, వాక్‌మన్ ద్వారా మీ జ్ఞాపకాలను వారు తమ వెంట తీసుకు వెళతారు. ఆ పాటలను వేరెక్కడ విన్నా వారికి మీరే గుర్తుకువస్తారు. పాటలద్వారా మీ స్నేహబంధం మరింత పటిష్టం కావడమే 'హాసం' కోరుకునేది!



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# గంగోత్రి

-గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు




రాత్రి తొమ్మిది గంటల వేళ. భోజనం చేసి కూర్చుని తదేక దీక్షతో నాటకం రాసుకుంటున్నాను.

మెల్లిగా వచ్చి నా పక్కన కూర్చుంది నా శ్రీమతి. గొంతు సవరించుకుని ముందు "ఊ" అంది, తర్వాత "ఉహూఁహూఁ" అంది, ఇహ లాభం లేదనట్టు "అఖ్ఖఖ్ఖ" అని దగ్గింది. చివరికి "ఎన్ని చేస్తేనేం, నా ప్రారబ్దానికి వినబడితేగా!" అంది.

అప్పటికి నా ఏకాగ్రత సడలింది. "ఏంటోయ్ సంగతి... అబ్బాయిగానీ, అమ్మాయి గానీ పుష్కరాలకి వస్తున్నారా?... నీకు మిగిలి పోయిన వ్రతాలు నోములు ఏమయినా మొదలు పెడుతున్నావా? నా నుంచి నువ్వు గతంలో సాధించుకున్న వరం, అదే అర్ధమాసం పాటు వంట నేను చెయ్యటమనేది, రేపటి నుంచి నాకు మొదలా?..చెప్పెయ్, నిర్భయంగా చెప్పెయ్.... ఏ భార్య ఏకాలంలో మాత్రం తన మొగుడికి భయపడింది కనుక?" అన్నాను.

నా శ్రీమతి మొహం చిట్లించింది. వంకర్లు తిప్పింది. "మీ కెప్పుడూ వేళాకోళమే" అంటూ ముందుకు వంగి గోముగా "యమునోత్రికి వెళదామండీ!" అంది.

నేను తికమకపడ్డాను. "యమునోత్రా, ఏదీ, హిమాలయాల్లో యమునా నది పుట్టిన చోటా.... ఇప్పుడా!" అన్నాను. కానీ వెంటనే తేరుకున్నాను.

"కానీ, నీ ముచ్చటెందుక్కాదనాలి!...మరి ఇప్పటికిప్పుడంటే ఎల్లా...సరే, ఏదయినా పాసింజరుందేమో చూడు హిమాలయాలకి..." అన్నాను.

"మళ్లీ వేళాకోళమా! పాసింజరేమిటి, ఆటో ఎక్కాలిగాని!"

నేను మళ్లీ తెల్లబోయాను! "ఆటోనా..మరీ మంచిది..వచ్చే ఏటికి వెడతాం... అయినా సరే, పుణ్యమే గదా! ఆటోలో వెళ్లడం కాబట్టి పిల్లలకి చెప్పెయ్, బహుశా ఇదే మన అంతిమ యాత్ర అని."

"ఏడ్చినట్టుంది! సినిమాకెళ్లటం యాత్రా! మరీ చోద్యంగా ఉందే మీ పని!"

నేనీసారి నిజంగా తికమక పడ్డాను "ఏమిటీ సినిమానా... ఇప్పుడు- తొమ్మిదిం బావుకా!....ఏ సినిమా?"

"ఇప్పుడు చెప్పాను గదండీ, గంగోత్రి!" ఇట్లా అంటూ శ్రీమతి ఉత్సాహంగా, "కొత్త అబ్బాయి, కొత్త అమ్మాయి హీరో, హీరోయిన్‌లట! దృశ్యాలు చాలా బాగుంటాయిట!" అంది.

"గంగోత్రి సినిమానా!... మరింతకు ముందు యమునోత్రి అన్నావు!"

శ్రీమతి తన నొసలు ముడిచింది. "ఏంటీ, ఇంకా వేళాకోళమా! నేను గంగోత్రి అనే అన్నాను. మీరు ఏ మూడ్‌లో ఉండి యమునోత్రి అనుకున్నారేమో!... లేవండి, బట్టలేసుకోండి, పదండి!..." అంటూ ఆమె హడావిడిగా ఇంట్లోకెళ్ళిపోయింది.

'హతోస్మి' అనుకుంటూ నా రచనాకలాపం కట్టిపెట్టి లేచాను.

* * * *

"సీట్ల సంఖ్యను బట్టి హాలుకు పన్ను' అనే ప్రభుత్వం వారి సంస్కరణకి సినిమాహాళ్ళ వాళ్ళు అద్భుతంగా స్పందించారు. ఒక్కో హాలునే మూడేసి నాలుగేసి చిన్నహాళ్ళుగా తెగ్గొట్టేశారు! మేమిద్దరం ఇప్పుడు వెళ్ళింది ఈ బాపతు, ఆ చీకటి- మూడో హాలుకే. అక్కడ జనం ఎవ్వరూలేరు. స్కూటర్ల స్టాండునిండా మాత్రం స్కూటర్లున్నాయి.

ఆ స్టాండు వారు అక్కడ వరసగా ఉన్న మూడు టిక్కెట్ల కిటికీలవైపు చూపించి. "అదుగో అక్కడే గంగోత్రి బుకింగ్" అన్నాడు. వెనకనించి నా శ్రీమతి పిలుస్తున్నా నేను వినిపించుకోలేదు. ఆదరాబాదరాగా 'ఆ' కిటికి దగ్గరకెళ్ళాను. "గంగోత్రికి రెండు" అన్నాను. ఆ బుకింగ్ గుమస్తా "వెళ్ళండి, వెళ్ళండి, ఆట మొదలైంది" అన్నాడు. మేమిద్దరం ఇంకా ఆదరాబాదరాగా మెట్లెక్కాం. వెనకనుంచి ఆ బుకింగ్ గుమాస్తా ఏదో కేకేస్తున్నట్టు అనిపించింది. కాని దాన్నికూడా నేను పట్టించుకోలేదు. మేడమీది హాల్లోకెళ్ళాం. హాల్లో కూర్చున్నాం. హాలు బాగానే నిండి ఉన్నట్లు గమనించాం.

తెరమీద కాలేజి కుర్రాళ్ళు బృందనాట్యం చేస్తున్నారు. పాట మధ్యలో, క్రమంగా సముద్రం వచ్చింది. కొండలూ, బండలూ కనిపించాయి. నా శ్రీమతి నాచెవిలో "గంగోత్రి సినిమాకదా, గంగ కనిపించాలిగాని, సముద్రం ఏంటండీ!" అంది.

నేను, "మనం ఆలస్యంగా వచ్చాంగదా గంగ ప్రవహించి వెళ్ళిపోయిందేమో - మళ్ళీ వస్తుందిలే, కంగారుపడకకు!" అన్నాను.




మాకు ముందు వరసలో సరిగ్గా నా ముందు కూర్చునున్న కుర్రాడు వెనక్కి తిరిగి మా ఇద్దర్ని చూసి తల తిప్పేసుకున్నాడు.

రైలుపెట్టె సీనొచ్చింది. హీరోహీరోయిన్లు ఒకళ్ళతో ఒకళ్లు సల్లాపం సాగించుకుంటున్నారు. నా శ్రీమతి, "గంగోత్రి స్టేషనుందట, అక్కడి వెళ్ళే రైలొస్తుందటండీ" అంది.

నేను, "అవిగో ఆకుపచ్చ పెట్టెలు, ఈ హీరో హీరోయిన్లు ఈ రైల్లో వెళ్ళేది గంగోత్రికేనేమో, చూద్దాం!" అన్నాను.

హఠాత్తుగా కరెంటు పోయింది. మా ముందుకూర్చున్న కుర్రాడు వెనకొక్క మాటు చూసి చటుక్కున్న లేచి ఆదరాబాదరా బయటకెళ్ళిపోయాడు. నేను హాలులో పరిశీలించి చూస్తే నా శ్రీమతి పక్కన ఇంకో నలుగురెవరో ఆడవాళ్ళే ఉన్నారు. ఆకుర్రాడు బహుశా వాళ్ళని చూసాడేమో ననిపించింది.

రెండు నిముషాల తర్వాత జనరేటర్ కరెంటుతో తెరమీద స్లయిడు పడింది. 'మహిళలకు దానశీలా ఎక్చేంజి షాపు వారిచ్చే ఆఫర్!... చీరెకి చీరె మార్పిడి అమ్మకాలు!... అంతేగాక మీ ఇంట్లో ఉంచుకోటానికి వీల్లేని వస్తువుల్ని కూడా ఎక్చేంజి చేసుకునేందుకు సువర్ణావకాశం!!... మీ వస్తువుల్ని తీసుకురండి... భర్తల్ని మర్చిపోకండి!!!'

హాల్లోనుంచి నవ్వులు పైకిలేచినయ్.

నేనన్నాను, "నన్ను కానీ ఎక్చేంజి చేస్తావా!"

మా ఆవిడ "ఛస్తే చెయ్యను! అడగ్గానే సినిమాకు తీసుకొచ్చే పాడి గోవులాంటి మొగుణ్ణి ఏ ఆడది మాత్రం వదులుకొంటుంది!" అంది నెమ్మదిగా.

ఇద్దరం నవ్వుకున్నాం.

తెరమీద స్లయిడు నడుస్తూనే ఉండగా ఒక ఆసామి మా వరసలో కొస్తూ నా దగ్గరకొచ్చి ఆగాడు. నావైపు తీక్షణంగా చూట్టం మొదలెట్టాడు. నేనూ, శ్రీమతి మా కాళ్ళు పైకి ముడుచుకున్నాం. కానీ అతగాడు ముందుకెళ్ళ లేదు. నేను చూసిచూసి "వెళ్ళండి" అన్నాను.

అతగాడన్నాడు, "వెళ్ళను, ఇందాకన సినిమా



జరుగుతుండగా వచ్చాను, వెళ్ళేనా?... వెళ్ళలేదు, ఇప్పుడింతకుముందు కూడా వచ్చాను, వెళ్ళేనా?... వెళ్ళలేదు, ఇప్పుడొచ్చాను వెళ్తానా... వెళ్ళను! మీ విషయం తేల్చుకోవాలి!"

తికమకగా అన్నాను, "ఏం తేలుస్తారు?"

"ఇందాకన హడావిడిగా ఆఖరుగా వచ్చి రెండు టిక్కెట్లు తీసుకుంది మీరేగా!"

వేమిద్దరం కాళ్ళుదింపేసాం, నేనన్నాను, "హడావిడిగా వచ్చినమాట వాస్తవం, ఆఖరో కాదో మాకెట్లా తెలుస్తుంది. అసలేమిటి విషయం?"

"మీరిచ్చిన వందనోటు చెల్లదు. వేరే వందరూపాయలు ఇవ్వండి"

"చెల్లదనే మాట ఇప్పుడు చెబితే ఎలా?"

"ఇందాకనే నేను మిమ్మల్నికేకేసాను. మీరు వినిపించుకోలేదు"

"ఆ నోటు నేనిచ్చిందేనని గ్యారంటీ ఏమిటి?"

"మీరు తప్ప ఎవ్వరూ వందనోటు ఇవ్వలేదు. కనక మీరు వేరే డబ్బివ్వక తప్పదు"

"ఇవ్వకపోతే"

అతను తగ్గిపోయాడు. గొంతు గద్గదికమవ్వగా అన్నాడు, "మీరు వందా ఇవ్వకపోతే, సార్..... ఈసినిమాలోఅలీలాగా... రేపు నేను కూడా.. ఆ వందకోసం గుడ్డివాడి వేషంవేసి.... రైలు పెట్టె ఎక్కాల్సొస్తుంది... ఇవ్వండి, ప్లీజ్!"

నా శ్రీమతి, "అంతా ఇటే చూస్తున్నారు. ఇంకాస్సేపటికి దొంగనోట్ల కేసంటూ పోలీసులొస్తారో ఏంపాడో, ఇచ్చేయండి బాబూ" అంది నాతో.

నేను లోగొంతుకతో "నా దగ్గర తంతే రూపాయి కూడా లేదు, ఒట్టు!" అన్నాను.

"బాగానే ఉంది సంబడం!... నేనిస్తాలెండి!" - అంటూ ఆమె తన పర్సులోంచి వందనోటు తీసి అతనికిచ్చి అతని చేతిలోనున్న వంద నోటుని తీసుకుని నాజేబులో కుక్కి "ఆల్బమ్‌లో పెట్టుకోండి!" అంది.

ఆ గుమస్తా "థాంక్స్‌సార్" అంటూ వెళ్ళిపోయాడు. ఉన్నట్టుండి శ్రీమతి అంది "అవునండీ, ఆరైలు గంగోత్రి వెళ్ళదన్నారు గదా, అందులో ఆలీ ఉండటమేంటి, అడుక్కోవట మేంటి?"

నేనూ మాట్లాడలేదు.

కరెంటొచ్చింది, ఆటమొదలైంది. నా ముందున్న కుర్రాడొచ్చి ఆ గుడ్డి వెలుతుర్లోనే




మమ్మల్ని ఎగాదిగా చూస్తూ తన సీట్లో కూర్చుండిపోయాడు.

మళ్ళీ పాటొచ్చింది, మళ్ళీ కొండలు. హీరో హీరోయిన్లు గెంతుతున్నారు, అక్కడొక మోటారు సైకిలుంది.

శ్రీమతి అంది, "గంగోత్రి, హిమలయాల్లో చాలా ఎత్తయిన ప్రాంతంగదా, అక్కడికి మోటారు సైకిలు ఎట్లా వెడుతుందండీ!"

"అవతలి వైపు నించి నాలుగులైన్ల సిమెంటు రోడ్డు ఉంది. దాని మీంచి వచ్చి ఉంటుంది!... కాకపోతే ఏంటి, కాస్త ఓపికపట్టమంటూంటేను"

అన్నాను.

రెండు నిమిషాలాగి మళ్ళీ ఆమె అంది, "గంగాజలం తీర్థం ఇవ్వటం చూపిస్తాట్ట. గంగ శివుడికి శిరస్సుమీద నుండి హిమలయాల్లోకి దిగిన ప్రాంతం ఉందే, అదే గోముఖం - దాన్ని చూపిస్తాట్ట! ఇంకా హృషికేశ్‌లో ఉన్న లక్ష్మణఝూలా వంతెనా, హరిద్వార్‌లో జరిగే గంగహారతి - కూడా చూపిస్తాట్ట, మన పక్కింటావిడ చెప్పింది.... ఒక్కటీ రాదేంటి!" అంది.

నాకూ కొంచెం అనుమానం వచ్చినమాట నిజం! అయినా, రాజేంద్ర ప్రసాద్ టైపులో డబాయించేసాను, "గోముఖంలో గంగ సముద్రం అంత వెడల్పుగా ఉండదు అనీ, ఈ హీరో హీరోయిన్లిద్దరూ కిందా మీదా పడటానికి అక్కడ చోటుండదని కూడా మనపక్కావిడ చెప్పిందా?" అన్నాను.

అనుమానంగా అంది శ్రీమతి "తాను పుట్టిన చోట గంగ, సముద్రమంత వెడల్పుంటుందంటారా!... అయినా భగీరథుడు తపస్సుచేసిన పవిత్రమైన ప్రదేశంలో అయన చేసినట్లుగానే పిండప్రదానాలు చేస్తారుగాని సంసారం చేస్తారటండీ!"

నేనింక మాట్లాడలేదు.

క్రమంగా నాశ్రీమతి నాభుజం మీద తలపెట్టి నిద్రలోకి జారుకుంది.

ఇంటర్వెల్ వచ్చింది. నాముందు కూర్చున్న కుర్రాడు చటుక్కున లేచెళ్ళిపోయాడు. శ్రీమతిని కదపటం ఇష్టంలేక నేను కదల్లేదు.

మళ్ళీ ఆటమొదలైంది, కథ నడిచింది. జలపాతం దృశ్యం వచ్చింది. అది ఒక పాటలో భాగం. నేను శ్రీమతిని కదిపాను,



''వచ్చింది వచ్చింది లే..లే...''అన్నాను.

శ్రీమతి లేచి చూచింది. చూసి చూసి "ఇది గంగోత్రేమిటి నామొహం!... ఇది దక్షిణ కర్నాటకలో మనం చూసిన జలపాతం కాదుటండి!..... ఆ హౌస్ బోట్లన్నీ కాసర్‌గోడ్‌లో చంద్రగిరి నదిమీద మనం ఎక్కి తిరిగినవి కావూ! ఆ కాలవలు కావూ!... అప్పుడే మర్చిపోయారా!... ప్చ్, అంతా అయోమయం!" అంది.

నేనేం మాట్లాడలేదు. అయినా శ్రీమతి అప్పుడప్పుడు ఏదేదో సణుగుతూనే ఉంది. ఇంకాస్సేపటికి, 'బాయ్, బాయ్' పాట వచ్చింది. చాలాసేపట్నించి కదలక పోవటంచేత ఇప్పుడు కొంచెం నేను నా సీట్లో కదిలాను. చటుక్కున శ్రీమతి అంది "ఇంకేం, వచ్చిందిగా సొగసుకత్తె.... ఇక వంచేంద్రియాలూ అప్పజెప్పేయండి తెరకి!"

"ఛ, ఛ. అదెవత్తో సొగసుకత్తె అయితే నాకెందుకు సైకిలుతిత్తి అయితే నాకెందుకు!... అయినా శ్రీమతి.. మనమధ్య.. సంసారం ... కొంచెం... ఇంకొంచెం... తుష్టిగా, పుష్టిగా.... ఉంటూ ఉండాలంటే... ఇట్లాంటివి.... మధ్య మధ్య... కొంచెం .... అవసరం... కాదంటావా?" అన్నాను.

''ఇంక ఈవయసన్నులో తుష్టేమిటి, పుష్టేమిటి!.... గోముఖమూ, గంగతీర్థమూ కావాలిగానీ!..... ఎంతకీ అవ్విరాకపాయే!... ప్చ్. ప్చ్!" అంది.




సినిమా అయిపోయింది.

మేమిద్దరం బయటికి నడుస్తున్నాం. మా ముందరి కుర్రాడు నాశ్రీమతిని, నన్నూ పరీక్షగా చూసాడు. సంబాళించుకున్నాడు, మాముందు తాపీగా నడుస్తున్నాడు.

అతని భజం మీద చెయ్యేసి నేనడిగాను "బాబూ, ఏమిటి, ఇందాకట్నించి ఏదో కంగారు పడుతున్నట్టున్నావు!"

అతనన్నాడు, "మీరిద్దరూ మాపక్కింటి దంపతులేమో, నేనిట్టా సినిమాకొచ్చినట్లు మా ఇంట్లోగాని తెలిస్తే రేపట్నించి నాకు పుడ్డుండదు!"

ఇంతలో ఇంకొతను వచ్చి వాణ్ణి కలిశాడు. వాళ్లిద్దరూ కబుర్లతో నడుస్తున్నారు.

మెట్లు దిగుతూ వాడితోనే నేనన్నాను. 'అబ్బాయ్, ఈసినిమా పేరేమిటి?"

వారు వెనక్కి తిరిగి నావైపు వెర్రివాణ్ణి చూసినట్టు చూసారు.

నా భార్య చటుక్కున "గంగోత్రి కాదా?" అంది.

ఇంక ఆఇద్దరూ "అంకుల్ - ఆంటీ గంగోత్రి..., గంగోత్రి - ఆంటీ - అంకుల్, ఆంటీ - అంకుల్ - గంగోత్రి...." అనుకుంటూ నవ్వుకుంటూ వేగంగా దిగిపోయారు!

మేమిద్దరమూ ఇందాకిటి మా టికెట్ల కిటికీ దగ్గర కొచ్చాం. ఆ కిటికీ మీద, 'నిన్నే ఇష్టపడ్డాను' తారాగణం - తరుణ్, అనిత, శ్రీదేవి' అన్న బోర్డుంది.

నా శ్రీమతి ఆగింది. నావైపు చూసింది. కళ్ళు చికిలించింది. ముక్కుపుటాలెగరేసి, దీర్ఘంగా నిట్టూర్చింది!

ఆ భాష నాకర్థమైపోయింది! "ఇంటికెళ్ళాక నీ పుట మారకపోతే చూడు!" అని దానర్థం.

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## ఆకాశ వీణపై ఉదయరాగం



ప॥ ఆకాశవీణపై ఉదయరాగం - హృద
యాకాశవీణపై ప్రణయ రాగం
కనగలిగే కనులుంటే
వినగిలిగే మనసుంటే ॥ఆకాశ॥

1చ: ఉదయానికి హృదయానికి రాగం ప్రాణం - అది
లేకుంటే జగతికేది జీవాధారం ॥ఆకాశ॥

2చ: తరులు గిరులు ఝురులు
కసుమ వల్లరులు ఏవీ
కలలు వెన్నెలలు మన
వలపుల వాకిళ్ళు ఏవీ ॥ఆకాశ॥

3చ: ప్రకృతి పురుషులొకటైతే
రాగం భావం - ఆ
రాగానికి భావానికి
రంగభూమి మధుమాసం ॥ఆకాశ॥

| | |
|---|---|
| **రచన** | : ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| **గానం** | : శ్రీమతి విజయలక్ష్మి దేశికన్ |
| **సంగీతం** | : చిత్తరంజన్ |
| **రాగం** | : సరసాంగి 27వ మేళకర్త<br>రాగ్‌నట్ బైరవ్ (హిందుస్తాని సం॥) |
| **తాళం** | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥)<br>దాద్రా (హిందుస్తాని సం॥) |
| **ఆరోహణ** | : స రి గ మ ప ద ని స |
| **అవరోహణ** | : స ని ద ప మ గ రి స |

షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధధైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ఈ పాటకు అన్యస్వరమైన కైశికి నిషాదాన్ని కూడా చేర్చి బాణీని కూర్చాను. సరసాంగి రాగం కర్ణాటక సంగీతంలో ఎక్కువగా ప్రాచుర్యాన్ని పొందిన రాగం కాదు. విద్వాంసులు యీ రాగాన్ని కచేరీలలో పాడడం కూడా చాలా అరుదుగానే కనిపిస్తుంది. హిందుస్తాని సంగీతంలో యీ రాగం నట్‌బైరవ్ అని పిలువ బడుతుంది. హిందుస్తానిలో కూడా యీ రాగం పెద్దగా వాడుకలో లేనిదే అని చెప్పవచ్చు. అలాగే లలిత సంగీతంలో కూడా సాధారణంగా యీ రాగాన్ని ఎవరూ ఉపయోగించరు. అయితే యీ సరసాంగి రాగం భక్తికి, విరహ విషాదాలకు అనువైనది. ఈ రాగానికి ముందుదైన మేళకర్త (26వది) చారుకేశి బాగా వాడుకలో వున్న రాగం. ఈ రెండు రాగాలు కూడా మధ్యప్రాచ్య సంగీత (అరబిక్ సంగీతం) రీతులు పలికించడానికి ఎంతో అనుకూలంగా వుంటాయి.

అయితే సరసాంగి రాగంలో కూర్చబడిన కొన్ని లలిత గీతాలు ఆకాశవాణిలో ప్రసారమై ప్రాచుర్యాన్ని పొందినవి. వాటిలో పాలగుమ్మి విశ్వనాథంగారు స్వరపరచిన "అనవేరా అనవేరా భారతవీరా అనవేరా" (రచన: కృష్ణశాస్త్రి), నా సంగీతంలోని "వేయి తీయని భావనలు యీ రేయి విరిసినవే చెలి" (రచన: పి.వి.రోహిణీ కుమార్), "నిదురలేని యీ రేయి ఎటులగడచెనో" (రచన: డా॥పద్మినీ దేవి). "మనమంతా ఒక్కటనే మంచి మనసుతో పెరగాలి" (రచన: డా॥ వడ్డెపల్లి కృష్ణ). (సుమారు పది పాటలకు యీ రాగంలో నేను స్వరరచన చేశాను) మొదలైనవి పాప్యులర్ అయినాయి.

కనగలిగే కనులూ వినగలిగే మనసూ ఉన్నట్లయితే ఆకాశవీణపై ఉదయరాగాన్ని, హృదయాకాశాన ప్రణయరాగాన్ని వీక్షించవచ్చును, వినవచ్చును, ఉదయానికి, హృదయానికి కూడా రాగమే ప్రాణమని అది లేకపోతే జగతికి జీవాధారమెక్కడిది అంటూ హృద్యంగా యీ గీతాన్ని కవి ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు రూపొందించగా నా సంగీత సారథ్యంలో శ్రీమతి విజయలక్ష్మీదేశికన్ భావయుక్తంగా ఆకాశవాణిలో గానం చేసింది.

### ఇంద్రగంటి శ్రీకాంతశర్మ



ఆధునికాంధ్ర సాహిత్య రంగంలో ప్రముఖులైన శ్రీకాంతశర్మ గారు మంచి గేయకవి, రచయిత. వీరి తండ్రిగారు కీ॥శే॥ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు వెనుకటి తరం ఉద్ధండ కవులలో ఒకరుగా సుప్రసిద్ధులు. నవంబరు 1-15, 2002 'హాసం' సంచికలో హనుమచ్ఛాస్త్రి గారు రచించిన 'ఓ తెనుగుదేశమా' అన్న పాట గురించి వ్రాయడం జరిగింది. శ్రీకాంత శర్మగారు 1944వ నంవత్సరంలో తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురంలో జన్మించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఎ. పట్టాను, 'భాషాప్రవీణ'ను పొందారు. 1969 నుండి 1976 వరకు ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదక వర్గంలో విజయవాడలో పనిచేశారు. ఆ తరువాత విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో స్క్రిప్టురైటర్‌గాను, అటు పిమ్మట ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గాను 1976 నుండి 1995 వరకు సేవలందించి వాలంటరీ రిటైర్‌మెంటు తీసుకున్నారు. తరువాత ఒక 4 సంవత్సరాల పాటు ఆంధ్రప్రభ వారపత్రికకు సంపాదకునిగా వ్యవహరించారు. ఆకాశవాణిలో వారు చాలా గణనీయమైన సాహిత్య సేవలందించారు. ఎన్నో లలిత గీతాలు, సంగీత రూపకాలు,నాటికలు రచించి ఆకాశవాణి వార్షిక అవార్డులకు పలు కార్యక్రమాలను రూపొందించారు. శిలామురళి (కావ్యం), అనుభూతి గీతాలు, ఆలాపన (లలితగీత సంపుటి), తూర్పున వాలిన సూర్యుడు (నవల),






సాహిత్య పరిచయం (విమర్శనా గ్రంథం), ఆలోచన (వ్యాససంపుటి), హాలుని గాథాసప్తశతికి తెలుగు అనువాదం - గాథావాహిని మొదలైనవి వీరి ప్రచురితమైన గ్రంథాలు. ఆకాశవాణిలో ప్రసారార్థమైన నాటికలు - శిలామురళి, స్నేహదానం, వెలుగు రేకలు, నిరుద్యోగి ధర్మయుద్ధం, ఆకువచ్చని కోరికలు (జాతీయనాటక కార్యక్రమంలో పలు భారతీయ భాషలలోకి అనువదించబడి ప్రసారమైనది) మొదలైనవి. ఇవే గాక జీవనవసంతం, వర్షానందిని, వసంతహేల, మాట-మౌనం మొ॥ సంగీత రూపకాలు, అమరారామం, తాంబూలం మొదలైన డాక్యుమెంటరీలు, ఆపెరాలు, రేడియో ప్రసంగాలు, ఇరుగు పొరుగు అనే 52 ఎపిసోడ్‌ల రేడియో ఫ్యామిలీ సీరియల్ మొదలైనవి ఎన్నో ఎన్నెన్నో శర్మగారి లేఖిని నుండి జాలువారిన సాహితీ సౌరభ సుమహారాలు.

వీరు ఆకాశవాణికై వ్రాసిన ఎన్నో లలిత గీతాలకు, సంగీత రూపకాలకు శ్రీయుతులు ఓలేటి వెంకటేశ్వర్లు, మల్లిక్, పి.వి.పి.రాజారాం, నూరి కుమారస్వామి, కలగా కృష్ణమోహన్, ఎన్.సి.వి. జగన్నాథచార్యులు, మల్లాది సూరిబాబు, ఎమ్.ఎస్.శ్రీరాం మొదలగు స్వరకర్తలు సంగీతాన్ని సమకూర్చారు. శ్రీరంగం గోపాలరత్నం, వి.లక్ష్మి, చదలవాడ కుసుమకుమారి, పెమ్మరాజు సూర్యారావు, ఎమ్.ఎల్.నరసింహం, జానకీబాల మొదలగు వారు గానం చేసిన ఆ పాటలు విజయవాడ కేంద్రం నుండి ప్రసారమై శ్రోతల మన్ననలు పొందినవి. శ్రీకాంతశర్మగారు బాపు-ముళ్ళపూడి రమణల "కృష్ణావతారం" చిత్రానికి పాట వ్రాశారు. తరువాత శ్రీ జంధ్యాల దర్శకత్వం వహించిన 'నెలవంక' మున్నగు చిత్రాలకు, శ్రీ ధవళ సత్యం దర్శకత్వం చేసిన "చైతన్యరథం" చిత్రానికి పాటలు వ్రాశారు.

శర్మగారిని ఎన్నో రాష్ట్రీయ, జాతీయ పురస్కారాలు వరించాయి.

1978లో ప్రాంతీయ అవార్డు - ఫీవర్స్ ఫ్రంట్ అవార్డు బెస్టు పొయెట్రీకి

1979 లో ప్రాంతీయ అవార్డు - గంగాధరం లిటరరీ అవార్డు బెస్టు పొయెట్రీకి

ఆకాశవాణి జాతీయ వార్షిక అవార్డులు-

అమరారామం - (1981), వర్షానందిని (1986),నేను కాని నేను(1986), మాట-మౌనం (1988) మొదలగునవి.

ఇవేగాక

ఏటుకూరి బలరామమూర్తి పురస్కారం (1999), కృష్ణశాస్త్రి పురస్కారం (2000) - (దక్షిణమధ్య రైల్వే కళాసమితి), జవ్వాది పురస్కారం (2002 - జవ్వాది ట్రస్టు), ప్రతిభా పురస్కారం (2000)- (పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం)

శ్రీకాంత శర్మగారి సతీమణి శ్రీమతి జానకీబాలగారు ప్రముఖ గాయనిగా ఆకాశవాణి ద్వారా శ్రోతలకు సుపరిచితులు. వారి కొన్ని పాటలు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో కూడా నేను సర్వీసులో వుండగా రికార్డు చేశాను. ఆమె మంచి గాయని మాత్రమే కాదు మంచి రచయిత్రి కూడా. శర్మగారు, వారి సతీమణి శ్రీమతి జానకీబాల గారు నాకత్యంత ఆప్తులు.

బహుముఖీనమైన శ్రీకాంతశర్మగారి నిరంతర సాహిత్యసేవ ఆంధ్ర సారస్వత లోకాన్ని సుసంపన్నం గావిస్తున్నది. ●



"ఆలస్యం అమృతం విషమంటే?
"త్వరగా ప్రేమించు అని"
"మరి... నిధానమే ప్రధానమంటే"
"కాస్త ఆలోచించి పెళ్ళి చేస్కో అని"

సిటీకి చివర్లో ఓ యిద్దరు నర మాంస భక్షకులకి, ఓ బ్యూటిఫుల్ అమ్మాయి ఒంటరిగా నడిచివస్తూ కన్పించింది.



"గురూ... భోంచేద్దామా!" అన్నాడు ఓ నరభక్షకుడు ఆశగా చూస్తూ.

"వద్దు... శిష్యా... ఈవిడ గ్లామర్ కోసం డైటింగ్ చేస్తోంది... బాడీలో విటమిన్స్ వుండవ్... వేరే బాడీ బిల్డర్ని చూడు హెల్దీ ఫుడ్ కోసం" తన నిరాసక్తతను వెల్లడించాడు రెండో నరభక్షకుడు.

"నేను పరాయి స్త్రీని తల్లిలా భావిస్తాను" గొప్ప చెప్పుకున్నాడు రాజేష్ తన లవర్‌తో.

"ఏం... మీనాన్న నీకు ఏ అమ్మాయిని ప్రేమించడానికి ఛాన్స్ యివ్వడా... తనే ముందు ఎంటరవుతాడా!!" అంటూ అనుమానంగా అడిగిందా హైటెక్ లవర్.





"మీరేం వర్రీ కాకండి... ఈరోజే మిమ్మల్ని హాస్పిటల్నుంచి డిస్చార్జ్ చేస్తున్నాం" అన్నాడు డాక్టర్ మార్కండేయులు...

"ఎందుకు వదిలి పెట్టరండి... నిన్ననే నా యావదాస్తిని ఫీజుగా రాసిచ్చేసానుగా తమకి" అన్నాడా పేషెంట్ దగ్గుతూ.





తనని రోజూ టీజింగ్ చేస్తున్న విజయ్‌ని ఎలాగైనా నరే వదిలించుకోవాలని అనుకుంది దమయంతి. వెంటనే ప్రిన్స్‌పాల్ దగ్గరకెళ్ళింది...

"చెప్పు దమయంతి.. విజయ్ ఏమన్నాడు నిన్ను?" అడిగింది ప్రిన్సిపాల్ మేడమ్ సంధ్యారాణి.

"నేను మీకంటే అందంగా వుంటానని అంటున్నాడు" అంది దమయంతి.

వెంటనే సంధ్యారాణి కోపం ఆపుకోలేక విజయ్‌ని డిబార్ చేసేసింది కాలేజ్ నుంచి.

**ఈ జోకులను పంపినవారు : లకనం మూర్తి, కాకినాడ**

ఎప్పుడూ అబద్ధాలు చెప్పే సుబ్బారావు వారం రోజుల క్రితం చనిపోయాడని వెంకట్రావు రామారావుకు చెప్పాడు. ఒకరోజు అనుకోకుండా బజార్లో రామారావుకు సుబ్బారావు కలిశాడు.

"అదేంటోయ్, నువ్వు చనిపోయావని వెంకట్రావు చెప్పాడే!" అన్నాడు రామారావు ఆశ్చర్యంగా.

"వాడు అబద్ధం చెప్పాడు. నేను లక్షణంగా బతికే వున్నాను గదా" అన్నాడు సుబ్బారావు.

"షటప్ ! వెంకట్రావు ఎప్పుడూ అబద్ధం చెప్పడు. నీ సంగతి ఎవడికి తెలియదు.... నువ్వెప్పుడు నిజం చెప్పి చచ్చావు గనక!? నీవు చావలేదంటే నేన్నమ్మను గాక నమ్మను" అన్నాడు రామారావు నిశ్చయంగా.





డెబ్బయి ఏండ్లున్న ఒకాయన పాతికేళ్ల పడుచుతో ప్రేమలో పడ్డాడు. ఆ విషయం ఆమెతో చెప్పడానికి ధైర్యం చాల్లేదు. తన స్నేహితుడితో అన్నాడు.

"ఒరే, పెండ్లీ పెటాకులు లేకుండా ఇన్నేళ్లూ గడిపాను. వ్యాపారంలో దాదాపు మూడుకోట్లు వెనకేశాను. అనుభవించడానికెవరూ లేరు. ఆ పిల్ల మీద మనసు పడ్డాను. నాకు ఏబై ఏళ్లని చెబితే ఆ పిల్ల పెళ్లికి ఒప్పుకుంటుందంటావా?"

"ఎనబై అయిదేండ్లని చెప్పు. గ్యారంటీగా ఒప్పుకుంటుంది." అన్నాడా స్నేహితుడు.



"పురుషుడి కష్టనష్టాలను మరపింపజేసేది భార్యే కదండీ!" అందో ఇల్లాలు భర్తతో గోముగా.

"పెళ్లి కాకముందు పురుషుడికి కష్టనష్టాలేముంటాయ్ అంటూ ఆశ్చర్యపోయాడా భర్త.

ఒక వివాహితుడు తన భార్య తన బెస్ట్ ఫ్రెండ్‌తో లేచిపోయిందని పోలీసులకు రిపోర్టు చేశాడు.

"స్వంత పెళ్లాన్ని లేవదీసుకుపోయిన వాణ్ణి బెస్ట్ ఫ్రెండ్ అని ఎలా అంటున్నావయ్యా... ఇంతకీ ఎవరతను" అడిగాడు ఎస్సై.

"అతనెవరో నాకూ తెలీదు. ఎవరైతేనేం - నా శ్రేయస్సు కోరే వాడిని బెస్ట్ ఫ్రెండ్ అనకపోతే ఇంకేం అనగలను" అన్నాడా పెద్ద మనిషి.






"నువ్వు పెళ్లి చేసుకోవాలోయ్! అప్పుడే నీ కష్టసుఖాలు షేర్ చేసుకోవడానికి ఒకరుంటారు" అంటూ తన బ్రహ్మచారి ఫ్రెండుకు సలహాయిస్తున్నాడో పెళ్లయినతను.

"నిజమే స్వామీ! కానీ ఆ షేర్ హోల్డర్, మేనేజింగ్ డైరెక్టర్ అయ్యే ప్రమాదం సంగతేమిటి?" అడిగాడు బ్రహ్మచారి.

**ఈ జోకులను పంపినవారు : సి.హెచ్.వి.బృందావనరావు, విజయవాడ.**

"ఏమండీ... పక్కింట్లో ఉన్న స్టూడెంట్ కుర్రాడు మన అమ్మాయికి కన్నుగొడు తున్నాడండీ" అంటూ కంప్లైంట్ చేసింది కాంతం, తన లాయర్ భర్తకు.

"ఫీజు ఇవ్వందే ఎవరి తరఫునా వకాల్తా పుచ్చుకోనని నీకు తెలుసుగా కాంతం" అన్నాడా భర్తగారు 'లా' బుక్స్ తిరగేస్తూ, పరధ్యానంగా.



పెళ్లిచూపులు జరుగుతున్నాయి.

"మా అమ్మాయి సంగతి నేను చెప్పకూడదు గానీ, దానివి ఎక్స్-రే కళ్లనుకోండి బావగారూ!" గొప్పగా చెప్పాడు పెళ్లికూతురు తండ్రి, అబ్బాయి తండ్రితో.

"మరి యిహనేం? అబ్బాయి ఎలాగూ డాక్టరు కాబట్టి అమ్మాయి చేత ఓ ల్యాబ్ ఓపెన్ చేయిస్తే సరి" అన్నాడు మధ్యవర్తి, మధ్యలో ఆనందంగా కల్పించుకుంటూ.



**ఈ జోకులను పంపినవారు : రెడ్డి.ఎమ్మే, ఒంగోలు.**

"అదేంటండీ మీ ఆయన అలా పైపు ఎక్కి ఇంట్లోకి వెళుతున్నాడు?"

"మొన్నామధ్య ఆయన కాలు విరిగినప్పుడు - కట్లు విప్పే వరకు మెట్లు ఎక్కవద్దని డాక్టరు గారు అన్నారు. అందుకే అప్పట్నుంచి మేడమీదికి వెళ్లాలంటే పైపు పట్టుకుని వెళ్లమని నేనే చెప్పాను"



BLISS

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన లకనం మూర్తి (కాకినాడ), సి.హెచ్.వి.బృందావనరావు (విజయవాడ), రెడ్డి.ఎమ్మే(ఒంగోలు), జి.బి.లక్ష్మి (హైదరాబాద్) గార్లకు బ్లిస్ ఆడియో వారు 'గెలుపు', 'కాశి' సినిమా ఆడియో క్యాసెట్లని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ క్యాసెట్లను పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



"మీ ఆయన రోగానికి కారణం ఆ పాడు సారాయే!" అన్నారు డాక్టర్ గారు.

"థాంక్యూ డాక్టరు గారూ!" అని భార్య వైపు తిరిగి "చూశావటే... ఇప్పటి దాకా నువ్వు మీ వాళ్ళూ అనవసరంగా నన్ను ఆడిపోసుకున్నారు..." అంటూ దబ్‌మని పడిపోయాడా రోగి మైకంతో.






**ఈ జోకులను పంపినవారు : జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

10

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తాననంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికివెళతాననంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటాననంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీ ఉద్యోగంలో చేరుతుంది.

-(ఇక చదవండి)

స్కూలు వదిలారు. జైల్లోంచి తప్పించుకున్న ఖైదీల్లా బయటకు పరుగులు తీస్తున్నారు పిల్లలు. కొంతమంది రిక్షాల్లో వెళ్ళిపోయారు. బాలాజీ కూతురు ఒక్కతే గేటు బయట నిలుచుని తండ్రికోసం ఎదురు చూస్తున్నది. రోజూ స్కూల్ వదిలే సమయానికి అమ్మ రెడీగా ఎదురుచూస్తుండేది. ఇప్పుడు నాన్న పాలనలో ఉన్నారు కదా... అమ్మ ప్రేమకు నాన్న ప్రేమకు ఎంతో తేడా ఉంటుందని తెలియని పసి వయసు పాపం! కొంచెం సేపు నిలుచుని తండ్రికోసం ఎదరు చూసింది. ఇక రాడని నిర్ణయించుకుని నడిచి వెళ్ళసాగింది.



పాప అటువెళ్ళిందో లేదో కారులో వచ్చి స్కూల్ దగ్గర ఆగింది ఝాన్సీ. భర్త బాధ్యతగా స్కూల్‌కు వెళ్ళి పాపను ఇంటికి తీసుకొస్తాడన్న నమ్మకం పోయింది తనకు. అందుకే ఆఫీసును వదిలేసి కూతురుకోసం పరిగెత్తుకొచ్చింది. గేటుకీపర్నడిగింది.

"అంతా వెళ్ళిపోయారమ్మా" చెప్పాడు గేట్ కీపర్.

మళ్ళీ కారెక్కింది. రివ్వున వెళ్తున్న కారు సడన్‌గా కీచుమని శబ్దం చేస్తూ ఆగింది. ఒక్క క్షణం ఆలస్యమైతే.......?!"

* * *

బాలాజీ ఇంట్లో-

ఫోన్ మీద ఫోన్ చేస్తున్నాడు బాలాజీ. అందరూ తలా ఒక నెంబర్ చెబుతున్నారు. ఒక నెంబర్ డయల్ చేసి ఒకావిడకందించాడు.



"హలో... నేను శ్రీమతి సుబ్బలక్ష్మిని మాట్లాడుతున్నానండీ. ఇప్పుడు టైమెంతయిందో కరెక్టుగా చెప్పండి... అది కాదండీ... మా గడియారంలో ఇంకా అయిదు కొట్టనేలేదు. మీరేమో అయిదూ అయిదంటున్నారు. మాదే మంచి గడియారం. వినండి." అన్నది సుబ్బలక్ష్మి రిసీవర్‌ను గడియారం వైపు తిప్పి.

ఝాన్సీ కూతురును తీసుకుని ఇంటికొచ్చింది. వచ్చేసరికి కనిపించిన దృశ్యం హృదయాన్ని మండించింది.

వడిలో ఫోన్ పెట్టుకుని ఠీవిగా కూర్చున్న భర్త, చుట్టూ ఆడామగా పదిమంది, వారి ఇక ఇకలు పక పకలు, ఫోన్లో పోచికోలు కబుర్లు....! ఆ దృశ్యం చూసి భద్రకాళి అయింది ఝాన్సీ. కోపంతో ముఖం ఉబ్బిపోయింది.



ఝాన్సీ అక్కడ నిలుచున్నా ఎవరూ పట్టించుకోలేదు. బెడ్రూమ్‌లో బీరువా మీద కూర్చున్న పిల్లవాడు తల్లిని చూడగానే 'అమ్మా...అమ్మా....అమ్మా...' అని కేక పెట్టాడు. ఝాన్సీ బరస్ట్ అయింది.

"స్టాపిట్" అరిచింది. అందరూ ఉలిక్కిపడ్డారు.

"ఏమిటిది? సంత బజారా? ఇల్లా? ఎవరూ ఫోన్ మొఖం ఎరగరా?" అరిచింది పెద్దగా.

అందరూ గుటకలు మింగారు.

అందరి ముందూ భార్య అలా అరవడం బాలాజీకి కోపం తెప్పించింది. చుట్టూ పదిమంది ఉన్నారనే విచక్షణ కూడా లేకుండా "ఏమిటా వాగుడు? మంచీ మర్యాదా లేకుండా? వాళ్ళనంటే నన్నన్నట్లే ... జాగ్రత్త" అన్నాడు తీవ్రస్థాయిలో.



"వాళ్ళనెందుకు? మిమ్మల్నే అంటున్నాను. గంటనుంచీ ఫోన్ చేస్తున్నాను. లైన్ కలవడం లేదు" అన్నది దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

"ఎలా వస్తుంది? ఇక్కడ బిజీగా ఉంది." అన్నాడు బాలాజీ నిర్లక్ష్యంగా.

"ఇది ఆఫీసు ఫోన్. అన్ని ఫోన్లు చేస్తే నాలుగొందలు బిల్లయితే ఎవడి బాబు కడతాడు?" అరిచింది ఝాన్సీ.

"ఎవడు పెట్టించమన్నాడో వాడి బాబుగాడే కడతాడు. అంత తాహతులేని వాళ్ళకు ఫోన్లెందుకని?" తనూ అరిచాడు బాలాజీ.

భార్యాభర్తల మధ్య కురుక్షేత్రం మొదలు కాగానే ఉరుము ఉరిమి ఉరిమి మంగలం మీద పడుతుందేమో నన్న భయంతో ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా ఒక్కొక్కరే మెల్లగా జారుకున్నారు.

"బుద్ధి గడ్డి తిని... బుద్ధి సరిగ్గా ఉన్నవాళ్ళు మీరేం చేస్తున్నారని? పిల్లకోసం స్కూలుకెళ్ళలేదు. అది దిక్కులేక ఏడుస్తూ రోడ్డుకడ్డం పడిపోతోంది. కాస్తుంటే నా కారు కిందే పడి..." తరువాత చెప్పలేక ఏడ్చింది.

బాలాజీ ముఖం లిప్తకాలం వివర్ణమైంది. తనకా విషయమే గుర్తులేదు.

"మీరిక్కడ టింగురంగా అంటూ కొలువుదీరి ఠంగు ఠంగు అంటూ గంటలు లెక్కెడుతున్నారు. ఎందుకెళ్ళలేదు స్కూలుకు?" నిలదీసింది కోపంగా.



బాలాజీ ముఖం మాడింది. అహం దెబ్బతిన్నది. "నేను మొగుణ్ణి. మగాణ్ణి. ఆడదానికి నంజాయిషీ చెప్పను." అన్నాడు ముఖం పక్కకు తిప్పుకుని.

"ఛి ఛీ... మిమ్మల్ని నమ్ముకుని పిల్లల్ని వదిలి వెళ్ళడం నాది బుద్ధి తక్కువ." బీరువా దగ్గరకెళ్ళింది ఝాన్సీ.

బాలాజీకి మళ్ళీ తిక్కరేగింది. "బుద్ధి తక్కువ నీది కాదు. నాది... ఆ వెధవాఫీసుకు పంపడం నాదే తప్పు" అన్నాడు రోషంతో.

పిల్లాడిని బీరువా మీది నుంచి దింపి ఎత్తుకుంది ఝాన్సీ.



"మానేస్తానండీ. ఆ వెధవాఫీసే ఇన్నాళ్ళూ అన్నం పెడుతోందని మర్చిపోకండి. రేపే మానేస్తాను. నాకు పిల్లల కన్నా ఆఫీసు ముఖ్యం కాదు. తిండికి లేకపోతే మాడి ఛస్తాం" అన్నది ఏడుస్తూనే.

బాలాజీ కోపం హద్దులు దాటింది. "నీకా బెంగ అక్కర్లేదు. కట్టుకున్న దాన్ని, కన్న పిల్లలను మాడ్చి చంపేంత దౌర్భాగ్యుడిని కాను. తక్షణం మానెయ్. రేపట్నుంచీ నేనే బజారెక్కుతాను. బెగ్ బారో ఆర్ స్టీల్... చచ్చో చంపో నాలుగు డబ్బులు నేనే సంపాదిస్తాను. పో... లోపలకు పో... నీ ఏడుపేదో నువ్వేడు." ఛాలెంజింగా అన్నాడు లుంగీ పైకి ఎగ్గట్టి.

ఝాన్సీ విసురుగా తలుపేసుకుంది.

* * *

తెల్లవారింది. పక్షుల కిలకిల రావాలు బాలమురళి గొంతులా కర్ణపేయంగా వినిపిస్తున్నాయి. బాల భాస్కరుడు ప్రపంచాన్ని మేల్కొలుపుతున్నాడు. తొలి కోళ్ళు అదిరిపడి లేచాయి. అదే పనిగా కూస్తున్నాయి. దూరాన్నుంచి కోవెల గంటలు సప్తస్వరాల్లా మోగుతున్నాయి. ప్రభాత వాతావరణం రమణీయంగా ఉన్నది.

ఎన్నడూలేని అలవాటు! బాలాజీ స్నానం చేసి మడిగట్టుకుని దైవ పూజ చేస్తున్నాడు.



కౌసల్యా సుప్రజారామా - పూర్వా సంధ్యా ప్రవర్తతే ఉత్తిష్ఠ నరశార్దూలా - కర్తవ్యం దైవమాహ్నికం - శ్లోకాన్ని చదువుతూ గంటకొడుతూ బెడ్రూమ్ వైపు దొంగ చూపులు చూస్తున్నాడు.

తలుపులు తీసుకుని అటువైపు తిరిగి నిద్రపోతున్నది ఝాన్సీ. ఆమె తెల్లవారిన తరువాత అంతసేపు పడుకోవడం జీవితంలో మొదటిసారి అయ్యుండచ్చు.

బాలాజీకి అనుమానం కలిగింది. ఉద్యోగం మానెయ్యమని తాను కోపగించుకోవడం మానేస్తానని ఆమె అనడం, ఆమె చేస్తున్న ఉద్యోగాన్ని ఆఫ్ట్రాల్‌గా కొట్టేసి తానే ఉద్యోగం చేసి సంపాదిస్తానని ఛాలెంజ్ చెయ్యడం గుర్తుకొచ్చాయి. సవాలైతే చేశాడు కానీ ఉద్యోగం ఇచ్చేదెవడు? పోగొట్టుకున్నంత తేలికగా దొరుకుతుందా ఏదైనా?

కాలు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతున్నాడు. ఝాన్సీ అలాగే బిగదీసుకుని పడుకున్నది. బాలాజీ గుండెలు గుబగుబలాడాయి. అయినా పన్నెత్తి మాట్లాడలేని నిస్సహాయత! ఉద్యోగం చేస్తూ సంసారాన్ని పోషిస్తున్న భార్యను నిద్రలేపడానికి కూడా ధైర్య చాలని బేల స్థితి!! విధి వైపరీత్యం అంటే ఇదేనేమో!

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద
ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాంతా
త్రయలోక్యం మంగళం కురు... అని శ్లోకానికి మంగళం పాడి

సోఫాలో కూర్చుని పేపరందుకున్నాడు. గాలాడటం లేదు. పక్కనే పెడస్టల్ ఫ్యానుంది. ఇదివరకైతే ఆ ఫ్యాన్ ఆన్ చెయ్యడానికి కూడా బద్ధకమై ఎక్కడో పెరట్లో అంట్లు తోముతున్న భార్యను కేకేసి పిలిచేవాడు. నేడా ధైర్యం లేదు. 'ఫాన్' అందామనుకుని ఆగాడు. తన ఆజ్ఞకు విలువ ఉండదని గ్రహించాడేమో, తానే ఆన్ చేసుకుని తనవైపుకు తిప్పుకున్నాడు. సిగరెట్ నోట్లో పెట్టుకుని అగ్గిపుల్ల వెలిగించాడు. ఫాన్ గాలికి పుల్ల ఆరిపోయింది. గతంలో అయితే తను సిగరెట్ వెలిగించేంత వరకు ఫ్యాన్ ఆపడానికి భార్యను పిల్చేవాడు. మరి నేడు! తానే ఫ్యాన్‌ను జరిపి సిగరెట్ వెలిగించుకున్నాడు.



'సాగినంత కాలం నా అంతటి వారు లేరందురు - సాగకపోతే ఊరికె చతికిల పడిపోదురు' ఎంత అనుభవంతో రాశాడో కదా మహానుభావుడు కొసరాజు!

* * *

గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. బాలాజీ పేపర్ చదువుతూనే ఉన్నాడు. లేదా చదువుతున్నట్లు నటిస్తున్నాడు. తొమ్మిదింటికి ఆఫీసుకు పరిగెత్తవలసిన భార్య ఇంకా నిద్ర కూడా లేవకపోవడం కలవరం కలిగిస్తున్నది. కొంపదీసి నిజంగానే ఉద్యోగం మానేస్తే తనేం చెయ్యాలి? ఇల్లు గడిచే మార్గం ఏది?

బజారెక్కి నాలుగు డబ్బులు సంపాదిస్తానని ఆవేశంలో అన్నా అది కార్యరూపం దాల్చడం మాటలా? బెడ్రూమ్ వంక పదే పదే చూస్తున్నాడు బాలాజీ. ఝాన్సీలో చలనం లేదు. లేచి బయటకొచ్చాడు.

అరుగు మీద కూర్చుని హోం వర్క్ చేసుకుంటున్నది పాప.

"అమ్మా... లీలా" ప్రేమగా పిలిచాడు కూతురును.

పాప భయంగా లేచి నిలుచున్నది. 'అంతొద్దు' అన్నట్లు చెయ్యి చూపించి 'టైం తొమ్మిది కొట్టింది కదూ...." అని ఏదో చెబుతుండగా పిల్లాడు కంచాన్ని డప్పులాగా ఠంగుఠంగుమని వాయించు కుంటూ వచ్చాడు.



"ఒరే ఠంగూ ఇలా రారా" పిలిచాడు బాలాజీ. వాడు భయంతో పారిపోయాడు. బాలాజీ నవ్వుకున్నాడు.

"ఏం పాఠం చదువుతున్నావమ్మా?" అడిగాడు కూతురును ఎత్తుకుని ముద్దాడి.

పాప బదులు చెప్పలేదు.

"అమ్మ ఇంకా పడుకుందేమిటి?" మెల్లగా ఆరా తీశాడు.

"ఇందాకే లేచింది" చెప్పింది పాప.

బాలాజీ మనసు కొంచెం కుదుట పడింది. 'ఓ' అన్నాడు.

"మాకు పాలు పట్టి నీళ్ళు పోసుకుని పడుకుంది" చెప్పింది పాప.

"ఓ...పొద్దుటే లేచిందా... స్నానం చేసి మళ్ళీ పడుకుందా?" అని అటు ఇటూ చూసి "ఒంట్లో బాగా లేదా?" అడిగాడు.



ఝాన్సీ మేలుకునే ఉన్నది. భర్త మాటలు వింటున్నది.

"లేదా ఆఫీసు నిజంగానే మానేసినట్టా? ఒక వేళ నిన్న సరదాగా కోప్పడ్డా సరదాగానే కదా! నిజంగా మానేస్తే ఎలా? ఆఫీసు వాళ్ళు పాపం బాధ పడరూ? అసలు మానేస్తారా ఏంటీ? వాళ్ళందరూ వచ్చి నా కాళ్లమీద పడి ప్లీజండీ ప్లీజండీ బాలాజీగారూ.... పంపండీ... పంపండీ అని ప్లీజ్... అంటారు....." అభినయించి చెప్పసాగాడు.

ఝాన్సీ నవ్వుకుంటున్నది.

" నేను వద్దంటే కదా? నిన్న సరదాకి జోక్ చేశాను. ఆవిడ అలిగి పడుకున్నారు. మీరొచ్చి అలక తీర్చి తీసుకెళ్ళండీ అంటాను. హ్హ.... హ్హ...." నవ్వాడు బాలాజీ.

ఏడవలేక నవ్వడం అంటే అదే.... గతిలేని నవ్వన్నా అదే. పిల్లాడు కంచాన్ని కొట్టుకుంటూ మళ్ళీ వచ్చాడు.

"వెళ్ళమ్మా. వెళ్ళి... వాళ్ళంతా ఇంటికొస్తే బాగుండదు. ఆఫీసుకెళ్ళమ్మా. అని చెప్పు. డాడీ మమ్మల్ని బుద్ధిగా పెంచుతారు అని చెప్పు. వెళ్ళమ్మా చెప్పు....వెళ్లి చెప్పు" చివరి మాట కోపంగా అన్నాడు.

"అమ్మ ఆఫీసుకు వెళ్ళనంది. నేను కూడా స్కూలుకు వెళ్ళట్లే." అన్నది పాప.



బాలాజీ ముఖం మాడ్చిన దిబ్బరొట్టె అయింది. 'ఏం?' అన్నాడు ఉబికి వస్తున్న దుఃఖాన్ని గొంతులోనే ఆపుకుని. కంఠం జీరబోయింది.

భర్త సహనాన్ని ఇంకా పరీక్షించి అతని మనసు క్షోభ పెట్టడం ఇష్టంలేకేమో, "ఇవాళ ఆదివారం సెలవు." అన్నది ఝాన్సీ మంచం మీదనుంచే నవ్వుకుంటూ.

"ఆఁ..." దెబ్బతిని వెనక్కు పడిపోయాడు బాలాజీ. పాప, పిల్లాడు తాళం వేస్తూ డప్పుకొడుతూ బాలాజీ చుట్టూ నవ్వుతూ తిరుగుతున్నారు.

* * *

పిల్లలు స్కూలుకెళ్ళారు. ఝాన్సీ ఆఫీసుకు వెళ్ళింది. వంట పని పట్టుబడక, హోటల్నుంచి తీసుకురాలేక, భార్యతో ఎగతాళి చేయించుకోవడం ఇష్టంలేక నర్సయ్య సాయం కోరాడు బాలాజీ.

పెళ్ళయిన నాటినుంచీ అలవాటైన విద్య కావడంతో నర్సయ్య క్షణాల మీద వంట చేసేశాడు. గిన్నెల మీద మూతలు పెడుతున్నాడు.



ఒకసారి వీధిలోకెళ్ళి అటు ఇటు చూసి లోపలికొచ్చాడు. బాలాజీ. "ఎందాకావచ్చింది?" అడిగాడు నర్సయ్యను.

"అయిపోయిందయ్యా వంట.... పిల్లలకు భోజనాలు పెట్టి మా యింట్లో పడుకో పెట్టేశాను" అన్నాడు నర్సయ్య వెళ్ళబోతూ.

"థాంక్యూ నర్సయ్య గారూ థాంక్యూ. పక్క జన్మలో మీకు పెళ్ళాంగా పుట్టి ఋణం తీర్చుకుంటాను." కృతజ్ఞతగా అన్నాడు బాలాజీ.

"ఏడ్చినట్లే ఉంది. పక్క జన్మనుంచీ పెళ్ళాలదే రాజ్యమట. ఇక మగాళ్ళకి వంటిల్లే వైకుంఠం." నవ్వాడు నర్సయ్య.

గిన్నెల్లో కొంచెం ఉప్పు కలిపాడు బాలాజీ.

"అదేంటి ఉప్పు మళ్ళీ వేసేస్తున్నావ్?" కంగారుగా అడిగాడు నర్సయ్య.

"ద బాలాజీ టచ్... ఉప్పు కరెక్టుగా పడితే నా వంట కాదు అని అనిపిస్తుంది." చెప్పాడు బాలాజీ.



"బాగుంది నాయనా" వెళ్తున్నాడు నర్సయ్య.

వెళ్తున్న నర్సయ్యను ఆపి ఎగాదిగా చూసి "ఇదిగో నర్సయ్య గారూ... ఇంతకు ముందు మిమ్మల్నెక్కడో.... ఓ..ఓ.. చూసినట్లుంది." తలగోక్కుంటూ అన్నాడు బాలాజీ.

నర్సయ్య పెద్దగా నవ్వి "అంతా నీ భ్రమ. విష్ణుమాయ" అని వెళ్ళిపోయాడు.

బాలాజీ ఆనందంతో ఏదో పాప్ సాంగ్ హమ్ చేస్తూ డాన్స్ చేసుకుంటూ ఇస్త్రీ లుంగీ, లాల్చీ తీశాడు. వైట్ జాకెట్ తీసి తెల్ల చీరకోసం వెతకసాగాడు. అన్నీ సీతాకోక చిలుక చీరలే కనిపిస్తున్నాయి. "అన్నా....అన్నీ రౌడీ చీరలే. వేరీజ్ ద తెల్ల చీర?" అనుకుంటూ చీరెలన్నీ లాగి కింద పడేసాడు.

కిందపడ్డ చీరెల్లో ఒక చీర మడతలోంచి జారి పడ్డ రెండు ఫోటోలు, ఒక సీల్డ్ కవర్ బాలాజీ దృష్టి నాకర్షించాయి. గబగబ ఫోటోలు తీసుకుని చూశాడు. అవి తమ పెళ్ళి నాటివి. వాటిని అపురూపంగా చూశాడు కాసేపు. కవరు తెరిచాడు. ప్రేమికులుగా ఉన్న రోజుల్లో మోహావేశంలో తాను వ్రాసిన భావకవిత అది. కవరుపైన 'నీ సొగసు చూడ తరమా' అన్న టైటిల్ ఉన్నది.



'మై లవ్ లెటర్! మై ఫస్ట్ లవ్ లెటర్.... ఎంత భద్రంగా దాచిపెట్టింది.' పరశంతో అనుకుని దాన్ని ముద్దాడాడు. దాన్ని చదువుతూ గత స్మృతులలో కెళ్ళాడు.

తాను వ్రాసే ఉత్తరం తెస్తాడని ఝాన్సీ ప్రతిరోజూ పోస్ట్‌మేన్ కోసం ఆత్రంగా ఎదురు చేడటం, పోస్ట్‌మేన్ నుంచి ఉత్తరం లాక్కుని పదే పదే చదువుతూ మరిసిపోవడం లాంటి తీపి జ్ఞాపకాలు గుర్తుకు రాగా శృంగార భావనలు మదినిండా ముప్పిరిగొని ఆనాటి గీతాన్ని మళ్ళీ నెమరు వేసుకున్నాడు.

సొగసు చూడ తరమా ॥2॥
నీ సొగసు చూడతరమా ॥2॥
నీ ఆపసోపాలు నీ తీపి శాపాలు
ఎర్రన్ని కోపాలు ఎన్నెన్నో దీపాలు
అందమే సుమా ॥సొగసు॥
అరుగు మీద నిలబడి
నీ కురులను దువ్వే వేళ
చేజారిన దువ్వెనకు
బేజారుగ వంగినపుడు
చిరుకోపం చీరకట్టి
సిగ్గును చెంగున దాచి
ఫక్కుమన్న చక్కదనం
పరుగో పరుగెట్టినప్పుడు
ఆ సొగసు చూగతరమా
నీ సొగసు చూడతరమా
పెట్టీ పెట్టని ముద్దు
ఇట్టే విదిలించి కొట్టి
గుమ్మెత్తిన సోయగాలు
గుమ్మాలను దాటువేళ
చెంగుబట్టి రా రామ్మని
చెలగాటకు దిగుతుంటే
తడివారని కన్నులతో
విడు విడు మంటున్నపుడు
విడు విడు మంటున్నపుడు
ఆ సొగసు చూగతరమా
నీ సొగసు చూడతరమా
పసిపాపకు పాలిస్తూ
పరవశించి ఉన్నపుడు
పెదపాపడు పాకి వచ్చి
మరి నాకో అన్నపుడు
మొట్టికాయ వేసి
'ఛీ...పొండి అన్నపుడు
నా ఏడుపు నీ నవ్వులు
హరివిల్లై వెలసి నప్పుడు
ఆ సొగసు చూడతరమా







సిరి మల్లెలు అరి విరులకు
జడలో తురిమి
క్షణమే యుగమై వేచివేచి
చలిపొంగులు చెలికోక ముడిలో అదిమి
అలసి సొలసి కన్నులు వాల్చి
నిట్టూర్పులు నిశిరాత్రిలో
నిదరోవు అందాలతో
త్యాగరాజకృతిలో సీతాకృతిగల
ఇటువంటి
సొగసు చూడతరమా
నీ సొగసు చూడతరమా



రాత్రి బాగా పొద్దుపోయి ఝాన్సీ ఇంటికి వచ్చింది. పూర్తిగా అలిసిపోయి ఉంది. భార్య అలనాటి అంద చందాలను తలచు కుంటూ ఉక్కిరి బిక్కిరౌతున్న బాలాజీ ఝాన్సీ మత్తుగా మంచంపై వాలిపోయిందాకా గమనించలేదు. భార్య రాగానే తన బిగి కౌగిలిలో బంధించి ఆమెకు స్వర్గపుటంచులు చూపాలని కలల ప్రపంచంలో మునిగి తేలాడు. టేబుల్ అరేంజ్ చేసి భోజనం సిద్ధం చేశాడు. శుభ్రంగా ఉతికి ఇస్త్రీ చేసిన లుంగీ, లాల్చీ ధరించాడు. కానీ తీరా చూస్తే.... తన కోరక తీరని కోరికలా మిగిలిపోయేట్లుంది.



పూర్తి నిద్రమత్తులో ఉన్న ఝాన్సీని లేపాలని ప్రయత్నించాడు. "ఏమోయ్... లే.." అన్నాడు భుజాలు పట్టి ఊపి.

"వద్దండీ... ప్లీజ్... బాగా అలిసిపోయాను. వద్దండీ ప్లీజ్..." అన్నది అలసిన నయనాలతో.

బాలాజీకి జాలివేసింది. బలవంతం చెయ్యాలని ప్రయత్నించలేదు. ఆరాధనగా భార్యను చూశాడు. ప్రశాంతంగా నిద్రించమని మనసులోనే అనుకుని ఓ వేడి నిట్టూర్పు విడిచి వెళ్ళబోయాడు.



ఆ నిద్రమత్తులోనే "ఏమండీ. రేపు క్రిష్ణాష్టమి. గోపాల్ వాళ్ళ తోటలో ఉట్టి సంబరాలు జరుపుతారట. అందర్నీ రమ్మన్నాడు" చెప్పింది ఝాన్సీ.

గోపాల్ పేరు వినగానే బాలాజీ మూడ్ మారిపోయింది.

"ఎవడు? ఆ తుత్తిగాడా? నన్ను పిలిచాడా? నేను చచ్చినా రాను." అన్నాడు కోపంగా.

-(ఇంకావుంది)

డిసెంబరు 18 మాధవపెద్ది సత్యం, సూర్యాకాంతం వర్ధంతులను పురస్కరించుకుని...



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



నేను ఆంధ్రపత్రిక వీక్లీకి 'సినిమా' రాసేవాణ్ణి, అప్పటికింకా సినిమా వేషగాణ్ణి కాలేదు. ఆ సందర్భంగా సూర్యాకాంతం గార్ని షూటింగ్ సెట్లో కలిసేవాణ్ణి. ఇంటర్వ్యూ లాంటిది కావలసి వుంటే ఆవిడ ఇంటికి వెళ్లేవాణ్ణి. ఆ దశలో ఆవిడ చాలా బిజీగా వుండేవారు. చెప్పాపెట్టకుండా ఓరోజు ఉదయమే ఆవిడ ఇంటికి వెళ్లి సుప్రభాతం పాడితే, ఆవిడ నామీద జ్వరం తెచ్చుకున్న వాడిలా మొహం పెట్టి.

"ఏ స్టూడియోకి వస్తారు? పది గంటలకి సారధి స్టూడియోకి రండి"

జర్నలిస్టుకి 105 టెంపరేచర్ వచ్చింది! ఇది మెడ్రాసు, సారధి స్టూడియో హైద్రాబాదు!... వెర్రి మొహం వేసి, పిచ్చి చూపు చూశాడు.

"చూడండి. నేను హైద్రాబాదు వెళ్తున్నాను. ఇంకో గంటలో విమానం ఎక్కి, మరో గంటలో పలకరింపబడుతూ వుండేవాణ్ణి.

సినిమాల్లో సహాయ దర్శకత్వ శాఖలో వున్నా - ఖాళీ సమయాల్లోనే జర్నలిజం వెలగబెడుతున్న సంగతి సూర్యకాంతం గారికి తెలీదు. సిటాడెల్ స్టూడియో వారు "ప్రేమలో ప్రమాదం" అని తీశారు. దానికి పనిచేశాను. అందులో ఆవిడ వున్నారు. మొదటి రోజు సెట్టుకి రాగానే నన్ను చూసి, "మళ్లీ ఇంటర్వ్యూ కావాలా నాయనా..."



# కాంతం కథ - సత్యం వ్యథ



"భక్తిరంజని" కార్యక్రమం పాడేశారు! "నాయనా, ఇంత పొద్దున్నే కోడికూతతో పాటేవస్తే ఎలా - ముందుగా చెప్పాలా వద్దా? నేను రెడీ అయి అర్జెంటుగా స్టూడియోకి పారిపోవాలి. మర్యాదగా నిన్న ఫోన్ చేసి, "అమ్మా ఎప్పుడు రమ్మంటారు?" అని అడగాలా వద్దా?" అని గడగడా 'అష్టోత్తర శతనామావళి' జ(డి)పించేశారు - శపించేసినట్టు. ఈ జర్నలిస్టుకి తల బొంగరం తిరిగినట్టు తిరిగి బొప్పి కట్టేసింది. నోటినుంచి మాట పెగల్లేదు. మాట కోనం వెతుక్కుంటున్నాడు.

"ఏం అనుకోకండి నాయనా - సడెన్‌గా వచ్చి డిస్టర్బ్ చేస్తే ఇలాగే వుంటుంది. ఇంతకీ మీకేం కావాలి?" అన్నారావిడ పాతిక శాతం ప్రసన్నురాలై. "ఏంలేదండీ - ఏం వద్దండీ... అదీ,... స్టూడియోకి వచ్చి అక్కడ కలుస్తాను" అన్నాడు జర్నలిస్టు అక్కడ దిగి, ఇంకో గంటలో మేకప్‌తో సెట్లో వుండాలి. నాకంటె ముందుగా మీరు అక్కడికి చేరుకోలేరు గనక, నాలుగు రోజులు పోయాక, వాహినీ స్టూడియోకి రండి. ఏం కావాలో అడగండి - తెలుసు గదా, వాహినీ ఈ ఊళ్లోనే వుంది" గాత్రధోరణిలో కాస్త సర్దుబాటు కనిపించింది.

"అమ్మా - క్షమించండి. అలాగే వస్తాను" అని తిరగబోయాడు. "ఇదిగో - కూచోండి. నేను పనిలో వున్నా, కాఫీ తెచ్చి ఇస్తారు - తాగి వెళ్లండి. సూర్యకాంతం గారింటికి వెళ్తే కాఫీ చుక్కయినా పోసింది కాదని, పత్రికలో రాసినా రాసేస్తారు" అంటూ వెళ్లింది. కాఫీ తాగి, వెళ్లకపోతే మళ్లీ ఏం మంత్రాలతో ఎలాంటి అక్షింతలు పడతాయోనని భయపడుతూ కూచుని, కాఫీ తాగే బయల్దేరాడు జర్నలిస్టు. ఈ 'అనుభవం' అయిన తర్వాత, అప్పుడూ అప్పుడూ షూటింగుల్లో కలుస్తూ - అనబోతే, 'కాదమ్మా' అని విషయం చెప్పాను. "ఆహా! ఇదో అవతారం అన్నమాట. ఏదో ఒక దాంట్లో స్థిరంగా వుండకూడదూ!" అని అడిగితే, విషయం వివరించాను - రెండూ చేస్తున్నానని. ఆ సినిమాలో ఆవిడ భర్త పాత్రధారి చదలవాడ కుటుంబరావు. ఆయన మాట్లాడే డైలాగులు 'యాస'లో వుంటాయి. భార్య భాష మాత్రం స్వచ్ఛంగానే వుంది. "ఇదేమిటినాయనా! ఆయన మాట ఒక రకం, నా మాట ఇంకో రకంగా వుంటే ఏడిసినట్టుంటుంది. ఇద్దరం ఒకలాగే మాట్లాడితే బావుంటుందని మా డైరక్టర్‌తో (ఆయనకి తెలుగు తెలీదు) చెప్పండి" అన్నారు సూర్యకాంతం ఘాటూ, హాటూ కలిపి. ఈలోగా చదలవాడ - "నీ బాసకి నేరాలేనే! నేనిట్టాగే మాట్టాడతా. నువ్వే నా బాసకిరా." అన్నారు కిలకిలా నవ్వేస్తూ. "అవున్నాయనా! మనం ఒకేలా



మాట్లాడలేదనుకో. మనిద్దరిదీ సంకరపెళ్లి అనుకుంటారు." అని ఈ మాట కూడా డైరెక్టర్‌తో చెప్పడంతో ఆయన 'అలాగే కానీండి' అన్నారు ఆంగ్లంలో. డైలాగులన్నీ సూర్యకాంతం గారు "ఏడవ సచ్చినాడా, ఇదేం పోయీకాలంరా" అన్న ధోరణిలో మార్చేసుకుని, ఎడమ చెయ్యి మరింత స్పీడుగా తిప్పుతూ, ఒళ్లు ఊపేస్తూ నటించే సరికి - సెట్లో వున్న వాళ్లంతా గొల్లుగొల్లున నవ్వి - వినోదించారు. "ఈజ్ షీ ఎ టాలెంటెడ్ ఆర్టిస్ట్?" అన్నాడు డైరెక్టరు - ఆమె గురించి ఏమీ తెలియక - "ఇదీ జోక్" అన్నారు సూర్యకాంతం.

కొన్నాళ్లకి నేను మెల్లిగా ఆవిడ చెప్పినట్టు ఇంకో అవతారం ఎత్తాను. వేషం మారింది. వేషాలకొచ్చాను. 'దాగుడుమూతలు'లో డాక్టరు వేషం. నా భార్య రాధాకుమారికీ అదే మొదటి చిత్రం. అవాళ సెట్లో గుమ్మడిగారు, సూర్యకాంతం, పద్మనాభం, రామలింగయ్య గార్లున్నారు. మాకు మొదటిరోజు షూటింగన్న మాట. నా భార్య తనే వెళ్లి సూర్యకాంతం గారికి పరిచయం చేసుకుంది. నన్ను చూసి "ఇదో వేషం!" అన్నారామె తీవ్రంగా. "ఉదరనిమిత్తం" అన్నాన్నేను. "ఏదో ఒక వృత్తిని నమ్ముకోండి బాబూ. ఆ పని, ఈ పనీ ఇదీ అదీ అంటే ఎందులోనూ రాణించలేరు, పైకీ రాలేరు. పుస్తకాలు అమ్మినవాడు కోడిగుడ్లు అమ్మినట్టుం టుంది" అని ఏదో అని, నవ్వించారు.

మధ్యాహ్నం లంచ్ - సెట్లోనే ఏర్పాటు చేశారు. పెద్దవాళ్లంతా ఓ పక్క కూచున్నారు. నాకూ నా భార్యకీ ఇంకోచోట చిన్న టేబుల్ వేసి భోజనం పెట్టారు. సూర్యకాంతం గారి కళ్లు మాయిద్దరి మీదా పడ్డాయి. "ఓశి దీని మొహం సంతకెళ్లా. ఇంకా ఇవాళ వచ్చి ఈ సినిమాలో వేషం వేస్తోంది పిల్ల - ఆ డాక్టరు పక్కన కూచుని, కబుర్లాడుతూ విందులారగిస్తోంది. ఇలాగే చెడిపోతారు పిల్లలు" అని వ్యాఖ్యానిస్తున్నారు సూర్యకాంతం గారు - కామెంట్రీ మాకూ వినిపించేలా. అంతలో అసిస్టెంటు డైరక్టరు "అమ్మా! వాళ్లిద్దరూ భార్యాభర్తలు" అని ఉన్నమాట చెప్పి, సూర్యకాంతం గారి వాక్ప్రవాహానికి 'లాక్' కట్టాడు. "ఆహా!" అన్నారావిడ - మావంక చూసి. భోజనం తర్వాత మేము వెళ్లి - మా సంగతులు చెప్పుకున్నాం. "ఈ సినిమాల్లో ఆడపిల్లలు వస్తూనే, ఏదీ ఆలోచించుకోకుండా తొందరపడిపోతారు. అలా అనుకుని, నేనే తొందరపడి మాట అన్నాను. అసలు తొందరపాటు నాదీ" అని తన మీద తనే జోక్ వేసుకున్నారు.

తర్వాత తర్వాత మేము ఆవిడకి చాలా దగ్గరయ్యాం. ఆవిడ నాకు 'అక్కగారు' అయ్యారు - నాలుగైదు సినిమాల్లో ఆవిడకి భర్తగా నటించే అవకాశమూ నాకు లభించింది. మొదటిసారి భర్త పాత్ర ధరించినప్పుడు - "అక్కగారూ! మీకు నేను భర్తనో, మీరు నాకు భార్యో మీరే చెప్పాలి" అన్నాను. "నాకు భర్తలు వేసిన వాళ్లందర్నీ అడుగు నాయనా. వాళ్ల నోళ్లకి ఎలాతాళం వేశానో, నీకూ ఆ తాళమే వేస్తాను. సూర్యకాంతం మొగుళ్లలో ఏ మొగుడు, భార్య ముందు నోరు విప్పాడుగనక? నీకూ అంతే. పాత్ర ప్రకారం నువ్వు నాకు మొగుడివే కాని, నిజానికి నేనే నీకు మొగుణ్ణి" అని అందర్నీ పకపకా నవ్వించారు 'నురేకారం' లాంటి సూరేకాంతం.

* * *

1954-55 ప్రాంతాల నేను ఒక మలయాళ చిత్రానికి తెలుగు మాటలు రాశాను. ఆ సినిమా పేరు "అతను ఎవరు?" త్రివేండ్రంలో డబ్బింగ్ జరిగింది. అందులో పాడ్డానికి వచ్చినప్పుడు మాధవపెద్ది సత్యం గారితో పరిచయం కలిగింది. అందులో ఆయన హీరోకి పాడారు. (చిన్న విశేషం : నేనూ ఒక పాటలో వచ్చే, ఇంకో పాత్రకి ఓ చరణం పాడాను) త్రివేండ్రంలో కలిసి తిరిగాం - గుళ్లూ గోపురాలూ.

ఆ సమయంలోనే అనుకుంటాను - అనకాపల్లిలో ఒక నాటకం వేశాం. అందులో సత్యంగారు, టి.జి.కమలాదేవి గారు - మా అన్నయ్య ఆర్.కె.రావు ఇంకా కొందరు వేశారు. ముందురోజు విశాఖపట్నం, రెండోరోజు అనకాపల్లి. అనకాపల్లిలో నాటకం కాగానే ఆ ప్రదర్శన ఏర్పాటు చేసిన కాంట్రాక్టరు ఎక్కడి వాళ్లని అక్కడ పారేసి, పారిపోయాడు ! రైలు టిక్కట్లకి డబ్బులు ఇవ్వాలి, భోజనం ఎలా - బస ఏమిటి? - అని అందరం తర్జనభర్జనలు పడుతూ వుంటే - "ఇవన్నీ మాకు మామూలేరా. అందుకే కాంట్రాక్టర్లు దగ్గర ముందుగానే డబ్బు లాగేస్తాం. ఇక్కడ మీరెవరో చూసుకుంటున్నారని నేను పట్టించుకోలేదు. పదండి! బస్సు స్టాండులో దుప్పటి పరచి, నాలుగు పద్యాలు చదివి, నాలుగు రాళ్లు సంపాయిద్దాం!" అని జోక్ వేశారు - సత్యం చుట్ట వెలిగిస్తూ. ఆ సీరియస్ విషయాన్ని ఆయన చాలా లైట్‌గా తీసుకోవడం చూస్తే ఆశ్చర్యం వేసింది. అక్కడా అక్కడ డబ్బు పోగుచేసి, మధ్యవర్తి ఎవరో కొంత అందించాడు. కమలాదేవిగారు, ఒకటో తరగతి టిక్కట్లు కొనుక్కున్నారు. సత్యం గారు, నేనూ మామూలు పెట్టెలో ఎక్కి మద్రాసుకి ప్రయాణించాం. దారంతా ఆయన "కాంట్రాక్టర్ల కథలు" చెబుతూనే వున్నారు. నేను "అన్నా" అని ఆప్యాయంగా పిలిస్తే - ఆయన "ఏంరా తమ్ముడూ" అనేవాడు.

ఆయనకి సంగీత దర్శకత్వం చేసే అవకాశం వచ్చింది. "నిజం చెబుతే నమ్ముతారా?" అని ఆ సినిమా పేరు. 'రెండు మూడు కోరస్ పాటలున్నాయి. నీచేత పాడిస్తాన్రా" అన్నాడు అన్నగారు. ఓ మూడు పాటలు రికార్డింగ్‌తో, సినిమా ఆరంభమైంది. అప్పట్లో ఆర్కెస్ట్రా పేమెంట్లు ఇప్పటిలా కాదు. తర్వాత ఎప్పుడో ఇచ్చేవారు. ఆర్కెస్ట్రా వాళ్లు నిర్మాత ఇంటిచుట్టూ, ఆఫీసు చుట్టూ డబ్బుల కోసం తిరిగారు సత్యం



గారు - "నాకు పైసా ఇవ్వలేదు బాబూ - నేనెవరితో చెప్పుకోనూ!" అని గొడుగు వేసుకుని ఆఫీసుచుట్టూ తిరిగి, విసిగిపోయారు.

ఓ రోజు తిరిగితిరిగి వేసారిపోయిన ఒక వాద్యకారుడు నిర్మాతతో మాటామాటా పెంచుకుని నిర్మాత ముక్కు తన నోటితో కరిచేశాడు! పెద్ద గాయమై - ఆయన ఆస్పత్రికి వెళ్లి - ముక్కు మీద పట్టీ వేసుకున్నారు. ఆ పట్టీ అలాగే వుండేది, ఆ ముక్కుమీద - చాలాకాలం పాటు.

అప్పుడు సత్యంగారు ఓ మాట అన్నారు:

"ఒరే, నిర్మాత - పని చేసిన వాళ్లకి డబ్బులు ఇవ్వకపోతే, అతన్ని శూర్పణకని చెయ్యొచ్చు. ముక్కో చెవులో కొరికేయొచ్చు. అంచేత నేనెన్నడూ నిర్మాతను కాను -మళ్లీ సంగీత దర్శకుణ్ణి కూడా కాను!" అని గట్టిగా చెప్పారు ఇంకా గట్టిగా చుట్టపొగలాగి, గుప్పున వొదుల్తూ. ■



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

క రాజు కథలు 3

# తుంబురశాస్త్రి

మంత్రిగారి ముఖంలో ఒక కొత్తకళ తొణికిసలాడింది. క రాజుగారికి చెప్పదగ్గ కొత్త ఆలోచన ఏదైనా స్ఫురించినప్పుడల్లా మంత్రిగారి ముఖం ఇలా కాంతివంతమౌతూ వుంటుంది. రాజుగారికి ఇది ఎప్పుడెప్పుడు చెప్దామా అని అరాటపడ్తూంటాడు. ఈసారి తన ఆలోచనను రాజుగారు తప్పకుండా మెచ్చుకుంటారనే ఉత్సాహంతో ఉదయాన్నే రాజభవనం చేరుకున్నాడు. క రాజుగారు అప్పుడే ఫలహారాలు, పానీయాలు సేవించి ఏకాంతమందిరంలో ఏకాంతంగానే వున్నారని తెల్సుకొని తన ఆలోచనను చెప్పడానికి ఇంతకంటె మంచి తరుణం దొరకదని నిర్ణయించుకొని సరాసరి రాజుగారు ఉన్నచోటుకి వెళ్లాడు.

"రండి మంత్రిగారూ! రండి! కూర్చోండి. ఏదో కొత్త ఆలోచన వచ్చినట్టుంది" అన్నారు క రాజుగారు.

తన మనస్సులోనిది రాజుగారు అట్టే పసిగట్టడంతో మంత్రి కాస్త ఖంగుతిన్నారు. వెంటనే తెప్పరిల్లుకొని "విజయమొ, వీరస్వర్గమో" అనుకుంటూ మొదలెట్టాడు.

"మహారాజా! మన రాజ్యంలో సంగీత కళను అభివృద్ధి చేసే ఒక వినూత్న పథకం ఆలోచించాను."

"బాగు బాగు, చెప్పండి" అన్నారు క రాజుగారు.

"నా అభిప్రాయంలో ప్రజా బాహుళ్యం మెచ్చిన సంగీతమే గొప్ప సంగీతం. అదేమిటో కనుక్కొని దానికి మన రాజ్యంలో ప్రోత్సాహమిస్తే-"

"మంచి ఆలోచన మంత్రీ! - కానీ-"

వికసించిన మంత్రి ముఖం క్షణంలో ముడుచుకుపోయింది. క రాజుగారు వివరించారు.

"సరిగ్గా ఇదే ఆలోచన మా బావగారి మేనత్త రెండవ అల్లుడూ, రాయలకోట రాజు అయిన రఘునాథ వర్మకు వచ్చింది. దానిని తన రాజ్యంలో అమలు పెట్టడంలో ఉత్పన్నమైన విశేషాన్ని వివరిస్తా. వినండి".

క రాజుగారు చెప్పిన కథ ఈ విధంగా సాగింది.

రాయలకోట రాజు రఘునాథవర్మ ఏది ప్రజలు మెచ్చే సంగీతమో తెలుసుకోవాలనుకొని అందుకొక పథకం తయారు చేశాడు. దాని ప్రకారం చెఱువును ఆనుకుని ఒడ్డునవున్న పెద్ద మైదానంలో ఒక వేదికను కట్టారు. దాని ముందూ, కొంత దూరం వరకూ అటూ యిటూ ఒక లావు పాటి తెరను కట్టారు. అంటే ముందుండి మైదానంలోంచి చూస్తే వేదికలో ఏం జరిగేదీ కనిపించదు. ఆ రోజక్కడ సంగీతోత్సవాలు జరుగుతాయని, ఊరి జనమంతా రావాలని నలుమూలలా చాటించారు.

ప్రకటించిన నియమావళి ప్రకారం ఉత్సవం ఉదయం తొమ్మిది గంటలనుంచి సాయంత్రం ఐదు గంటలవరకు జరుగుతుంది. నిజానికి ఇదొక రకమైన పోటీ. రాజ్యంలోని గొప్ప సంగీత విద్వాంసులంతా ఒకరి తర్వాత ఒకరుగా వేదిక మీద తెర వెనుక కూర్చొని గానం చేస్తారు. ఒక్కొక్కరికి కేటాయించిన సమయం అరగంట. ఊరి ప్రజలంతా ఈ సంగీతాన్ని వింటారు. కార్యక్రమం కాగానే ఎవ్వరు ఉత్తమ విద్వాంసులో ప్రజలు తమ అభిప్రాయాన్ని తెలియజేస్తారు. ఈ విధంగా ప్రజల్లో ఎక్కువమంది మెచ్చే సంగీతమేదో, గాయకుడెవరో రాజుగారికి తెలిసివస్తుంది.

పాడిన వారంతా తెరవెనుక నుంచే పాడ్తారు కనుక ఎవరు పాడేదీ జనం చూడలేరు. దీనివల్ల పక్షపాతాలకెక్కడా తావుండదు. ప్రముఖులు కదా అని వారిని మెచ్చుకోడం, కొత్తవారు కదా అని వారిని చులకనగా చూడడం లాంటివి వుండదు. ఐతే గాయకులు పాడ్డానికి ముందు వాళ్ళ పేర్లు ప్రకటించాలి కదా? అప్పుడు వాళ్ళెవరో జనానికి తెలిసిపోతుంది కదా? - కార్యకర్తలు ఈ విషయంలో కూడా తగు జాగ్రత్తలు తీస్కున్నారు. పోటీలో పాల్గొనే పదిహేనుమంది విద్వాంసుల అసలు పేర్లకు బదులు పాడ్యమి, విదియ, తదియ అంటూ రహస్య నామాలిచ్చి ఆ రీతిన వాళ్ళ పేర్లను ప్రకటించారు.

పోటీలో పాల్గొనడానికి వచ్చిన విద్వాంసులలో అతి ముఖ్యుడు తుంబురశాస్త్రి. ఇతను కర్ణాటక హిందుస్తానీ శాస్త్రీయ సంగీతాల్లో ప్రవీణుడు. తోడిరాగం ఆలాపన చేస్తే కింది షడ్జమం, గాంధారాలమధ్యనే కొన్ని గంటలు సంచారం చేయగలడు. అంతటి ప్రతిభావంతుడు కూడా ఈనాటి కచేరీలలో పాల్గొంటున్నా ఆ విషయం ప్రజలకు తెలీదు.

మైదానమంతా జనంతో నిండిపోయింది. ఇన్నాళ్లా జరిగిన కచ్చేరీలన్నీ రాజుగారు వింటూండగా ఆస్థానంలో జరిగేవి. బహిరంగంగా జనం మధ్య కచ్చేరి జరగడం ఇదే మొదటిసారి. అందుకని అందరూ ఏదో తెలియని ఉత్సాహంతో కచ్చేరీ ఎప్పుడెపుడు మొదలౌతుందా అని ఎదురుచూస్తున్నారు.

తెరవెనుక నుంచి ప్రకటన వచ్చింది. ప్రప్రథమంగా గానం చేసే విద్వాంసుడు పాడ్యమి అని. భైరవ రాగాలాపనతో అతని గానం ప్రారంభమైంది. కొంత సేపటివరకు అందరూ నిశ్శబ్దంగా విన్నారు. కాని ఆలాపన సాగే కొద్దీ



జనంలో ఏదో ఒక నిస్సారమైన వాతావరణం పాకింది. మొదటున్న ఉత్సాహం కొద్ది కొద్దిగా తగ్గి, కొంత సేపయ్యేసరికి గుస గుసలు బయల్దేరాయి. అవి రణగొణ ధ్వనులుగా మారి చివరకు తెరవెనుక పాటలు, తెరముందు మాటలుగా తయారయ్యాయి. అరగంటయిన తర్వాత రెండవ గాయకుడు విదియ తన గానం మొదలెట్టాడు. ఇది కానడ రాగం. ఇతడేమైనా కొత్తగా వినిపిస్తాడేమోనని ముందు కొన్ని నిముషాలు అంతా నిశ్శబ్దంగా విన్నారు. కాని ఆ తర్వాత యథాప్రకారమే. గొణగొణలు, మాటలు వగైరాలు. ఇలా ఒకరి తర్వాత ఒకరు పంచమి, షష్ఠి, సప్తమిలు పాడుతున్నా జనం ఏమీ పట్టించుకోలేదు. ఇక అష్టమి, నవమిలు వచ్చేసరికి ఒళ్ళు విరుచుకునేవారు, కాసేపు అలా తిరిగి వచ్చేవారు, ఇంటి నుంచి తెచ్చుకున్న తినుబండారాలను తినేవారు, ఇలా ఎవరి వ్యాపకంలో వాళ్ళున్నారు. సాయంత్రం నాలుగు గంటలైంది. ఇప్పటికి వచ్చింది తుంబురశాస్త్రి వంతు. వరుసలో అతను త్రయోదశి.

తెరవెనుక నుంచి త్రయోదశి గానం మొదలౌతుంది అని ప్రకటన వచ్చినా ఎవరూ పట్టించుకోలేదు.

తుంబురశాస్త్రి తోడిరాగం ఆలావన మొదలెట్టబోయారు. ఈ సమయంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. దగ్గర్లో చెఱువు ఒడ్డున ఒక చాకలివాడు ఆరేసిన బట్టల్ని మూటగట్టి వక్కనున్న గాడిదమీద పెట్టబోయాడు. గాడిద ఎందుకో మారాం చేస్తూ పక్కకి తప్పుకుంది. దాంతో చాకలివానికి కోపం వచ్చి గాడిదను కొట్టడానికి కఱ్ఱ ఎత్తాడు. గాడిద పరుగెత్తింది. చాకలివాడు తరుముతూ దానివెంట పడ్డాడు. గాడిద పరుగెత్తి సరాసరి వెనుక నుంచి వచ్చి వేదికనెక్కింది. ఈ సమయంలోనే తుంబురశాస్త్రి తోడిరాగం ఆలాపన మొదలెట్టబోయింది. గాడిదను చూసి తుంబురశాస్త్రి కేక పెట్టబోయాడు. ఈలోగా గాడిద తుంబురశాస్త్రిని ఎగిసి తన్నింది. తుంబుర శాస్త్రి ఒక్కసారి గాలిలోకెగిరి కిందెక్కడో పడ్డాడు. ఈ కథంతా తెరవెనుక జరుగుతున్నది కనుక మైదానంలో వున్న జనానికి ఇదేమీ తెలీదు. తరుముకుంటూ వచ్చిన చాకలివాడు గాడిద చేసిన పనికి మండిపడి కఱ్ఱతో దాన్ని గట్టిగా బాదాడు. గాడిద బిగ్గరగా కేకపెట్టింది.

ఇంతవరకు నిస్సారంగా, నిర్జీవంగా వున్న వాతావరణం ఒక్కసారిగా కొత్త చైతన్యాన్ని అందుకుంది. వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకుంటున్న జనం మాటలాపేసి నిశ్శబ్దంగా వినసాగేరు. తెరవెనుక చాకలి వాడు కొట్టే దెబ్బలకు గాడిద అరుస్తూవుంది. ఎన్నో స్వరాలు పెనవేసుకొని ఉద్భవించిన ఈ కొత్త రాగానికి, ఈ కొత్త శబ్ద సంగీతానికి జనం రక్తనాళాల్లోని రక్తం వేడెక్కింది. అందరూ చప్పట్లు కొట్టేరు.

గాడిదను తీస్కొని చాకలి వెళ్ళిపోయాడు. తుంబురశాస్త్రి కచ్చేరీని కొనసాగించే స్థితిలో లేడు. తర్వాత వచ్చిన విద్వాంసులు చతుర్దశి, పౌర్ణమిలు మళ్ళీ నీరసమైన పాత సంగీతం

వినిపించడంతో జనం దాన్ని తిరస్కరించారు.

ఉత్సవం ముగిసిన వెంటనే కార్యకర్తలు జనం వద్దకొచ్చి ఈ నాటి ఉత్తమ గాయకుడెవరో చెప్పవలసిందిగా కోరారు. ఎలాంటి సందేహమూ లేకుండా అందరూ ముక్త కంఠంతో వెలిబుచ్చిన ఏకాభిప్రాయం - ఈనాటి ఉత్తమ సంగీత విద్వాంసుడు త్రయోదశి - అంటే తుంబురశాస్త్రి.

ఆస్థాన పండితులు మెచ్చుకున్న తుంబుర శాస్త్రినే ప్రజలు కూడా మెచ్చుకున్నారన్న సంగతి తెలిసి రఘునాధరాజుకి ఆనందమూ, ఆశ్చర్యమూ కలిగింది. కాని కాస్సేపటికల్లా కార్యకర్తలు రాజుగారికి రహస్యంగా అసలు విషయం చెప్పారు.

ఇప్పుడు రాజుగారికి కొత్త సమస్య ఎదురైంది. వచ్చేనెల జరగబోయే రాజ్యోత్సవాల్లో తుంబురశాస్త్రి బహుమాన గ్రహీతగా తప్పనిసరి పాడాల్సుంటుంది. కాని కచ్చేరీకి వచ్చిన జనం తోడిరాగం వినగానే "ఇది కాదు మేము మెచ్చిన సంగీతం" అని గొడవ చేస్తే ప్రమాదం.

ఈ విషయాన్ని రాజుగారు తుంబురశాస్త్రినే ఏకాంతంగా తన మందిరానికి పిలిపించి వివరించారు.

"తుంబురశాస్త్రి! తెలిసో తెలియకో ఈనాడు మీరు జనం మెచ్చిన ఉత్తమ విద్వాంసులు. మీరందించిన కొత్త సంగీత శబ్దం అందరినీ ఉద్రిక్తులను జేసింది. ఇప్పుడు ఇదితప్ప వేరే ఏ సంగీతాన్ని మీరు అందించినా జనం దాన్ని స్వీకరించే ప్రసక్తే లేదు. ఇక నుంచి మీరు ఈ సంగీతాన్నే గానం చెయ్యాలి. తప్పదు. నెల రోజుల్లో రాజ్యోత్సవాలు జరగనున్నాయి. ఈలోగా మీరు ఎలాంటి కృషి చేస్తారో, ఆ బాధ్యతంతా మీదే"

తుంబురశాస్త్రి రాజువంక దీనంగా చూశాడు. కానీ రాజాజ్ఞ. తప్పనిసరి. చివరకు ఒక పథకం ఆలోచించాడు. రాత్రి చాకలివానింటికి వెళ్ళి అతనికి పెద్ద పారితోషికం సమర్పించుకొని ఒక ఒప్పందానికి వచ్చాడు. దాని ప్రకారం తుంబురశాస్త్రి ప్రతిరోజూ రాత్రి రహస్యంగా చాకలివానింటికి వెళ్లేవాడు. అప్పుడా చాకలివాడు కఱ్ఱతో గాడిదను బాదేవాడు. గాడిద గట్టిగా అరిచేది. వెంటనే తుంబురశాస్త్రి గాడిద నాదాన్ని అనుసరిస్తూ దానిలాగే అరుస్తూ తన అభ్యాసం మొదలెట్టేవాడు. ఈ విధంగా ప్రతిరాత్రి చాకలివాడు గాడిదను కొట్టడం, అది అరవడం, తుంబురశాస్త్రి అదే విధంగా అరవడం ఇలా అభ్యసించి, అభ్యసించి నెలయ్యేసరికి చక్కటి ప్రావీణ్యాన్ని సంపాదించాడు.

రాజ్యోత్సవాలు మొదలయ్యాయి. తుంబుర శాస్త్రి కచ్చేరీ సమయం ఆసన్నమైంది. జనం తండోపతండాలుగా వచ్చి అతని సంగీతం కోసం ఆతృతతో ఎదురు చూశారు. తుంబురశాస్త్రి వేదిక మీదకు వచ్చి, అందరికీ నమస్కరించి ఒక్కసారి గట్టిగా అరిచాడు. వెంటనే జనమంతా ఆనందంతో ఈలలేస్తూ, గంతులేస్తూ తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు. కచ్చేరీ అయింతర్వాత జనమంతా తుంబురశాస్త్రి గురించి మాట్లాడుకుంటూ పోటీ రోజంత బాగా పాడక పోయినా ఇంచుమించు బాగానే పాడేడనుకున్నారు.

అప్పట్నుంచీ రాజ్యమంతా ఈ కొత్త సంగీత శబ్దం దావానలంలా పాకిపోయింది. పెళ్ళిళ్లు, సభలు, సమావేశాలు ఎక్కడ చూసినా ఈ అరుపులే, దీంతో రఘునాధరాజుకు సంగీత కళాబంధువనే బిరుదు నిచ్చారు.

'క'రాజు చెప్పిన కథను విన్న మంత్రి దీర్ఘాలోచనలో పడ్డాడు. క రాజు మంత్రి నుద్దేశించి "మంత్రీ! ఇప్పుడు ఆలోచించి చెప్పండి మన రాజ్యంలో ఎలాంటి పథకం వేస్తే సంగీత కళ అభివృద్ధి చెందుతుంది?" అంటూ లోనికి వెళ్ళిపోయాడు. మంత్రి ఏమీ ఆలోచించలేక అలాగే నిలబడి పోయాడు. ●

---

# ఘంటసాల క్విజ్

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | : రూ. 250/- | మరియు |
| రెండవ బహుమతి | : రూ. 200/- | ఘంటసాల |
| మూడవ బహుమతి | : రూ. 150/- | కలర్ ఫోటో |

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**

డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-16

1. ఘంటసాల సంగీత దర్శకత్వం వహించిన హిందీ పాతాళ భైరవిలో పాడిన గాయకుడి పేరు?

జ: ............................

2. ఘంటసాల, ఆర్.బాలసరస్వతీ దేవి కలిసి పాడిన తొలి యుగళగీతం గల చిత్రం?

జ: ............................

3. ఎన్.టి.ఆర్, ఎ.ఎన్.ఆర్ కలిసి నటించిన చిత్రములో ఘంటసాల ఎ.ఎన్.ఆర్.కు మాత్రమే పాడారు. ఆ చిత్రం?

జ: ............................

4. ఘంటసాల సంగీతంలో టి.జి.కమలాదేవి పాడిన తొలి చిత్రం?

జ: ............................

5. ఘంటసాల నిర్మించిన మొదటి చిత్రం?

జ: ............................

పంపినవారి పేరు :

చిరునామా :

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 31-12-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.



# పింగళి పాటల్లో వెటకారాలూ చమత్కారాలూ



- రావి కొండలరావు

సినిమా మాటల్లోనూ, పాటల్లోనూ వెటకారాలు చూపించడం, చమత్కారాలు నూరడంలో పింగళి నాగేంద్రరావు గారి తర్వాతే ఎవరైనా - అని చెప్పుకోవడంలో అతిశయం లేదు, అది అతి సత్యమే గాని. గిడిగిడి, వలా, గింబళి, డింగరి, డింభకా, శాయరా లాంటి మాటలు - మాటల్లో పొదిగి పాప్యులర్ చేసిన ఘనత పింగళి వారిది. "అన్ని వున్న మాటలే. నేను పుట్టించినవి కావు. గిడిగిడి అంటే నమస్కారం. డింగరి అంటే సేవకుడు. డింభకుడంటే బాలకుడు. హలా అనేది సంబోధన" అని వివరించిన నాగేంద్రరావు, సినిమా "వరించి వచ్చిన మానవ రచనా వీరుడు" కాకపోతే "వరించి వచ్చిన మానవ వీరుడు ఏమైనాడని విచారమా?" (జగదేకవీరుని కథ) అని డైలాగు లాగా, పాట పల్లవి రాయడం ఎవరికి సాధ్యమవుతుంది? "ఇలా రాయడానికి పింగళి నాగేంద్రరావు లాంటి కవి అవసరమా? ఎవరైనా రాయవచ్చు గదా" అన్న సవాళ్లు కూడా ఆయన ఎదుర్కొన్నారు. "ఏమిశిక్ష కావాలో కోరుకొనవే ప్రేయసీ" (చంద్రహారం) అన్న పల్లవి కూడా అలాంటిదే. ఇలా సింపుల్‌గా రాస్తేనే పాప్యులర్ అవుతాయన్నది ఆయన నమ్మకం, ఆ దర్శకుల నమ్మకం. "ఆడువారి మాటలకు అర్థాలు వేరులే", "బృందావనమది అందరిదీ గోవిందుడు అందరి వాడేలే", "ఎంతఘాటు ప్రేమయో" వంటి పల్లవులు అందరినోటా నానుతున్న అల్లరి పాటలు. ఆయన పాటల మాటలు, సినిమా టైటిల్స్ అయినట్టు - ఇంకో రచయితవి కనిపించవు (ఒకటో రెండో వుండొచ్చునేమో) వివాహ భోజనంబు, అహ నా పెళ్లంట, చూపులు కలిసిన శుభవేళ, ఎంత ఘాటు ప్రేమయో, కనులు తెరచినా నీవాయె, లాహిరి లాహిరి లాహిరిలో, పాపం పసివాడు - వంటివి.

'గుణసుందరి కథ'లోని ఒక పాటలో "చిటి తాళం వేస్తినంటే, సిగ్గు కీలే సడలిపోవాలి" అని దైవాధీనం (కస్తూరి శివరావు) పాట. ఇందులో ఆయన ఉపయోగించిన 'సిగ్గుకీలు' తమాషా అయిన మాట. కీళ్లలో సిగ్గుకీలు అని ఒకటుంటుందని, అది సడలిపోతుందనీ, పింగళివారు చమత్కరించారు. అన్ని పాటల్లోనూ ఆయన చేసిన చమత్కారాలు ఇప్పుడు చెప్పుకోలేం గాని, కొన్ని చెప్పుకుంటే - 'పాతాళభైరవి'లోని 'ఎంతఘాటుప్రేమయో' పాట. ఘాటుప్రేమ చాలా కొత్త ప్రయోగం., వింత సమాసం. తోటరాముడు మోటువాడు గనక, వాడి ప్రేమ ఘాటుగా వుండక, సున్నితంగా ఎలా వుంటుందని నాగేంద్రరావు గారు అడిగారు. (ఈ చమత్కారం మీద చేసిన ప్రతి చమత్కారం - నాయిక మాలతిని దృష్టిలో పెట్టుకుని - 'ఇంత లేటు వయసులో' అన్నారు) ఆ పాటలోనే - తోటరాముడి చూపు కూడా తీవ్రమైనదన్నారు - 'ఎంత తీవ్ర వీక్షణమో' అని. 'కన్నుకాటుతిన్నదిగా' అని తర్వాత చేసిన చమత్కారం. తీవ్రమైన ఆ చూపుకి కన్ను - కాటు తిన్నదిట (పాము, కాటు వేసినట్టు) ఆ కాటుకి కళలు విరిశాయిట. తోటరాముడు కంటితో కాటు వేస్తే - ఆ కాటుకి రాజకుమార్తె కళ్లలో కళలు విరిశాయి! 'పెళ్లి చేసిచూడు'లోని స్వప్న దృశ్యంలో ఊర్వశి, అర్జునుడూ పాట. ఊర్వశి, అర్జునుడి వెంటపడి, ప్రేమించమని అడిగితే - "చాలు చాలు నీ సాముదాయకపు వలపు పంపిణీ" అని పాడతాడు అర్జునుడు. ఊర్వశి అందర్నీ ప్రేమిస్తుంది. అందరిమీదా వలపులు కురిపిస్తుంది. ఆమె తన వలపుని, కో ఆపరేటివ్ సిస్టమ్‌లో డిస్ట్రిబ్యూట్ చేస్తుందిట! దాన్నే ఆయన 'సాముదాయకపు వలపు పంపిణీ' అని, అనువదించినట్టు చమత్కరించారు! ఎంత ఆలోచన! ఆ పాటలోనే 'ఊగించిన ఉర్రూగించిన' (ఉర్రూతలూగించడం - అన్నమాట) 'యుగయుగాలుగా, జగజగాలుగా' అని ప్రయోగాలు చేశారు.



"జగజగాలు ఎక్కడుంటాయి?" అని అడిగితే, "ఔచితీభంగం కాకుండా పదం వెయ్యడంలో తప్పులేదు" అని జవాబు ఇవ్వగల 'జగమొండి' రచయితగా కనిపిస్తారు పింగళి. 'చందమామ చల్లగా మత్తుమందు చల్లగా' అన్నది (గుండమ్మకథ) చల్లని మాట మీద చేసిన చమత్కృతి. అలాగే "జగమునె ఊటీశాయగ" (గుండమ్మకథ) అని రాశారు - 'ప్రేమయాత్రలకు' పాటలో. అంటే జగాన్ని చల్లబరచడం అన్నమాట. 'చంద్రహారం'లోని 'ఏం చేస్తే అది ఘనకార్యం' అన్నపాట రాజకీయాల్లో వున్నవాళ్ల మీద ముల్లు తీగ విసురు. అందులో ఆయన చేసిన వెటకారం - "వాడి జుట్టు ముడి వీడికి పెట్టి, వీడి జుట్టు ముడి వాడికి పెట్టి -" ఇద్దరూ 'సిగపట్లు' పడితే ఆనందించడం - 'ఏం చేస్తే అది ఘనకార్యం! 'పెళ్లి చేసిచూడు'లో 'పెళ్లిచేసుకుని - ఇల్లు చూసుకుని' అంటూ భార్యాభర్తలిద్దరూ 'ఇంటా బయటా జంటకవులవలె - అంటుకు తిరగాలోయ్' అన్నారు. అంటే - జంటకవులు - అంటుకు తిరుగుతున్నా పోట్లాడుకుంటూనే వుంటారు. వాదించుకుంటూనే, అంటుకు తిరుగుతూ వుంటారు. భార్యాభర్తలు కూడా అలాగే వుంటారనీ, ఉండాలనీ, ఆ కవి భావం. ఆ పాటలోనే, "భావ కవులవలె ఎవరికి తెలియని ఏవో పాటలు పాడాలోయ్" అని వాళ్ల మీద కూడా వెటకార బాణం విసిరారు. 'అప్పుచేసి పప్పుకూడు'లోని టైటిల్ సాంగ్ "అప్పుచేసి పప్పుకూడు తినరా ఓ నరుడా - గొప్ప నీతి వాక్యమిదే వినరా పామరుడా" అన్నది వ్యంగ్యం. అప్పుచెయ్యమని చెప్పడం నీతి వాక్యమెలా అవుతుంది? అదొక రకమైన 'ఇన్‌డైరెక్ట్' నీతి. "కానరాని కోయిలలు మనల మేలుకొలుపగ, కానరాని కోయిలలు మనకు జోలపాడగ" అని (గుండమ్మకథ) డ్యూయెట్‌లో చేసిన చమత్కారాలు. ఆ కోయిలలు ఒకరిని మేలు కొలుపుతాయిట, ఒకరిని జోలపాడతాయిట! విరుద్ధంగా లేదూ? ఉన్నా రెండూ మంచివే, రెండూ వలపు ప్రయోగాలే. ఈ ఊహ రావడం సామాన్యమా!

"మోహనరాగమహా - మూర్తిమంతమాయె" (మహామంత్రి తిమ్మరుసు) పాటలో "చిత్రసీమలో వెలయగజేసి" అని రాస్తే కొంతమంది - 'సినిమా ప్రపంచం' అని రాశారేమిటి? అని ముక్కున వేలేసుకున్నారు. మోహనరాగాన్ని సినిమా ప్రపంచం బాగా వాడుకుంది. అదే స్ఫురిస్తుంది - తప్పదు. చిత్రసీమలో మోహన రాగాన్ని వెలయజేసి, "దివ్యగానమున జీవము పోసి" అంటే ఎన్నెన్నో పాటలు మోహనలో తయారయ్యాయని. కాని, కవిగారు కృష్ణదేవరాయల వారి,పరంగా రాసిన పాట.

# ఇడియట్లు పెట్టె అను సరదా పజ్యాలు

-డా॥పి.వి.రామకుమార్

గంటగంటకు వేడి వార్తలే వడ్డించ
చావులూ మర్డర్లు కళ్లముందుంచ
శవంక్లోజప్పులే కలల్లో దడిపించ
వార్తలంటే చాలు వచ్చేను మూర్ఛ



పెద్దలందరికి బుద్ధి మాంద్యంబు పుట్టె
పిల్లలకు బుర్రలు బూజు పట్టె
ఇంటింట వచ్చి పడె దిక్కుమాలిన పెట్టె
దయలేని వాడెవడొ దీన్ని కనిపెట్టె




అరవ డబ్బింగులతో అదిరి పోవగ కొంప
కంపు డైలాగులు మన దుంపదెంప
అయిదు నిమిషాల కథ అరగంట చూప
దొరక లేదా ఇంక మన కంటె నాప



డైలి సీరియళ్లు జగట పాకపు జీళ్లు
అయిపోయి చావవు ఏళ్లు పూళ్లు
అతుక్కుని చూస్తిరా ఇంట్లోని ఆడాళ్లు
ఆ పూట ఉండవిక కూడు నీళ్లు



ఎపుడు ఏడుపు గొట్టు ఎపిసోడులే ఉండ
ఆడ పాత్రకు నెత్తిన నీళ్లకుండ
నట్టింట కన్నీళ్లు కాల్వలుగుచునుండ
బతక లేదెవ్వడిక ఈతరాకుండ



మోహనరాగం 'మూర్తిమంతమాయె' అన్నారు. 'మూర్తిమంతం' కావడం కూడా పింగళివారి ప్రయోగమే!

'ఇక - షడ్రసోపేతమైన 'వివాహభోజనంబు', 'మాయాబజార్'. ఈ సినిమా ఎన్నో ఎన్నెన్నో విధాల గొప్పదయిన గొప్ప సినిమా. ఒక గొప్పదనం పింగళి రచన. అందులోనూ చమత్కార రచన. మాటల్లోనూ, పాటల మాటల్లోనూ గుచ్చిన చమత్కారాలు ఇన్నీ అన్నీనా? చెప్పుకుంటూనే వుంటారు అభిమానులు.

దుర్యోధన బలగం పెళ్లికి తరలివచ్చింది. వాళ్లని ఘటోత్కచుడి బలగం ఆహ్వానించి "మాయాబజార్" చూపించింది పాటతో. ఆ పాటలో లక్ష్మణ కుమారుణ్ణి, పల్లకి దిగమంటూ "పెళ్లికుమారా రావయ్యా మా భాగ్యం కొద్ది దొరికావయ్యా" అని పాడతారు. "మా కర్మ కొద్ది దొరికావయ్యా" అనడం రివాజు. అలా అనకుండా, వాళ్లకి మాత్రమే మంచిగా తెలిసేలా, మనకి అందులోని వ్యంగ్యం తెలిసేలా - 'మా భాగ్యం కొద్ది దొరికావయ్యా' అని రాయడం కవి వెటకారం. రుక్మిణి నౌకావిహారంలో పాడుతూ - "ఎల్లరి మనములు ఝల్లన చేసే చల్లని దేవుని అల్లరిలో" అంటుంది. ఇదీ కవిగారు పెట్టిన అల్లరే. "అల్లరి దేవుడని కూడా ముందు రాశారు. దేవుళ్లలో అల్లరి పెట్టే దేవుడు కృష్ణుడే గనక" అని చెప్పాడొకసారి నాగేంద్రరావు గారు. ఆ పాటలోనే "రాసక్రీడకు ఉసిగొలిపే ఈ మధురిమ" అన్నారు.

మారువేషంలో వున్న ఘటోత్కచుడు "అహనా పెళ్లియంట" అని పాడాడు - పాడింది. "తాళికట్టవచ్చునంట" అని, 'తధీం ధీం ధీంత, తంధోత తంధీత' అంటూ దాంట్లోనే కలిపి, "అటుతంతాం ఇటు తంతాం" అంటుంది శశిరేఖ. ఇది 'తోంతోం'లో కలిసిపోయినా "మిమ్మల్ని తంతాం" అని చెప్పడం!

చివర్లో ఘటోత్కచుడు కౌరవులకి బుద్ధి చెబుతాడు పద్యరూపంలో. ఐశ్వర్యంతో తుళ్లుతున్నారు - మీరు దుమ్ముధూళిలో కలిసే కాలం దగ్గరలో వుందంటూ - "పాండవులే కాదు, పాండవ బంధుకోటి బంధుబంధుల బంధుల బంధులందు" ఎవర్నివెదిరించినా ఇదే శాస్తి! అని హెచ్చరిస్తాడు. ఈ "బంధుబంధు" అంటూ నొక్కి నొక్కి పలకడంలో ఎంత చమత్కారం! మాటలు అవే అయినా, అందులో అక్షర చమత్కారం వుంది.

పింగళి నాగేంద్రరావు గారు పాటల్లో చేసిన అల్లరీ, చమత్కారాల్లో ఇవి కొన్ని మాత్రమే. ఎన్నో సినిమాల్లో ఇంకా ఎన్నెన్నో ప్రయోగాలు, చమత్కారాలూ, వెటకారాలూ.

-(అందుకే వచ్చే సంచికలో మరికొంత)

# ఇడియట్ల పెట్టె అను సరదా పజ్యాలు

-డా॥పి.వి.రామకుమార్

ఎత్తుపై ఎత్తుతో అత్తకోడలి పాట్లు
టూటౌను త్రీటౌను నరుడి అగచాట్లు
కళ్లెదుట మిరుమిట్లు పెళ్లాల సిగపట్లు
కుళ్లు కథలతొ తల తూట్లు తూట్లు



పనులు మానిన జనులు గుడ్లప్పగించంగ
తెరచి ఉంచిన నోట తెగక కారును చొంగ
రంగు బొమ్మల గంగ అందరూ మునుగంగ
ఇల్లు సర్దుకుపోవు దర్జాగ దొంగ



యాడు మీద యాడు వరదలా వచ్చిపడు
ఆడాళ్ల నేప్కిన్లు అడుగడుగు కదలాడు
అది ఏమిటని అడుగ అయిదేళ్ల పిల్లాడు
అమ్మలూ అంటీలు గోడు గోడు



గడ్డి తినగలిగితే వాడె ఘనాపాఠి
సిగ్గునొగ్గేసేటి సాహసులె మేటి
చెయ్యగలిగితె ఫీటు వెయ్యి రూకల పోటీ
ఛానళ్లు ఛాలెంజ ఒక దానికొకటి



మీ పాట మా ఆట తీరునిక తీట
సినిమాల చిందుకేనట పెద్దపీట
కళలంటె ఇవేగా మన తెలుగు నాట
కథ మలుపు తిరిగేను అధోగతి బాట

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

భారతీయ చలన చిత్రాల చరిత్రలో 'మాయాబజార్' అనే పేరు చాలా ప్రత్యేకంగా కనిపిస్తుంది. 1925 లో 'మాయాబజార్'(సురేఖా హరణ్) పేరిట వెలువడిన నిశ్శబ్ద చిత్రంతో మొదలయిన 'మాయాబజార్' చిత్రాల పరంపర 1984 దాకా కొనసాగింది. 1932 లో 'మాయాబజార్ ఉర్ఫ్ సురేఖాహరణ్' పేర వెలువడిన టాకీతో మాయాబజార్ చరిత్ర మొదలయినట్టు కనిపిస్తుంది. 1935 లో తెలుగులో పి.వి.దాసు నేతృత్వంలో 'మాయాబజార్ అను శశిరేఖా పరిణయం' వెలువడింది. ఆ చిత్రంలో శశిరేఖ పాత్రను శాంతకుమారి ధరించారు. 1935 నుంచి 1984 దాకా మాయాబజార్ కథతో హిందీ, తెలుగు భాషలలోనే కాక తమిళం, మరాఠీ, గుజరాతీ భాషలలోనూ మొత్తం మీద పది చిత్రాలు వెలువడ్డాయి. సురభి నాటక సంస్థ వారు నేటికీ 'మాయా బజార్ ' పేరిట నాటకం ప్రదర్శిస్తూనే ఉన్నారు.

1957లో విజయాసంస్థ వారు విడుదల చేసిన 'మాయాబజార్' తెలుగు చిత్రం - దృశ్య కావ్యంగా పేరు తెచ్చుకుంది. అన్ని వయసుల వారినీ నేటికీ ఆకర్షించే ఆ చిత్రం - భారతీయ పౌరాణిక చిత్రాలలో ప్రత్యేకస్థానం గడించింది. సొగసైన కథాకల్పనతో బాటు సంభాషణలు, సంగీతం, ఛాయా గ్రహణం - ఇలా ఆ చిత్ర విజయానికి ఎన్నో హంగులు కలిసివచ్చాయి. కె.వి.రెడ్డి దర్శకత్వ ప్రతిభకు గొప్ప ఉదాహరణగా నిలిచిన 'మాయాబజార్' చిత్రానికి పింగళి నాగేంద్రరావు రాసిన మాటలూ, పాటలూ గొప్ప ఆకర్షణలు.

'మాయాబజార్' చిత్రానికి సంగీతదర్శకత్వం నిర్వహించడానికి నిర్మాతలు నాగిరెడ్డి-చక్రపాణి మొదట సాలూరి రాజేశ్వరరావును ఎన్నుకున్నారు. నాలుగు పాటలకు వరుసలు కట్టిన తర్వాత కారణాంతరాల వల్ల రాజేశ్వరరావు 'మాయాబజార్' నుంచి విరమించారు. రాజేశ్వరరావు స్వరపరిచిన ఆ నాలుగు పాటలు - నీవేనా నను తలచినది, లాహిరి లాహిరి లాహిరిలో, చూపులు కలిసిన శుభవేళ, నీ కోసమె నే జీవించునది. రాజేశ్వరరావు చేసిన వరసలకు వాద్య విన్యాసం మేళవించడమూ, పాటల రికార్డింగూ ఘంటసాల చేశారు. చిత్రంలోని తక్కిన పాటలూ, పద్యాలూ అన్నిటికీ ఘంటసాల సంగీతం సమకూర్చారు.

విజయా సంస్థ వారు 'మాయాబజార్' తెలుగు చిత్రంతోబాటే అదే కథతో అదే పేరుతో తమిళ చిత్రాన్ని 1957లో విడుదల చేశారు. తెలుగు, తమిళ చిత్రాల రెండింటిలోనూ కనిపించిన వారు - ఎన్.టి.రామారావు, ఎస్.వి.రంగారావు, సావిత్రి, ఋష్యేంద్రమణి, సంధ్య. తెలుగు చిత్రంలోని పాటల వరుసలలోనే తమిళ చిత్రంలోని పాటలూ ఘంటసాల సంగీత దర్శకత్వంలో రూపొందాయి.

మాయాబజార్ -తెలుగు, తమిళ చిత్రాలలోని రెండు పాటల గురించి ఈ సారి చెప్పుకుందాం.

రాజసూయ యాగం నుంచి ద్వారకకు తిరిగి వచ్చిన శ్రీ కృష్ణుడు - శశిరేఖకు ఒక కానుక తెస్తాడు. ఆ కానుక 'ప్రియదర్శిని' అనే పేటిక. ఆ పేటిక తీసుకుని శశిరేఖ తన మందిరానికి వెళ్లింది. వెళ్లి ఆ పేటిక మూత తెరిచింది. తెరవగానే అభిమన్యుడు కనిపించాడు. కనిపించడమే కాదు. పలకరిస్తూ పాట అందుకున్నాడు. ఆ పలకరింతకు శశిరేఖ సమాధానమూ పాటగానే సాగింది. ఆ పాట:

**అభిమన్యుడు :** నీవేనా....
నీవేనా నను తలచినది
నీవేనా నను పిలిచినది
నీవేనా నా మదిలో నిలచి
హృదయము కలవరపరిచినది... నీవేనా

**శశిరేఖ :** నీవేలే నను తలచినది
నీవేలే నను పిలిచినది
నీవేలే నా మదిలో నిలచి
హృదయము కలవరపరిచినది... నీవేలే...

**అభిమన్యుడు:** కలలోనే ఒక మెలకువగా
ఆ మెలకువలోనే ఒక కలగా ॥కలలోనే॥
కలయో నిజమో వైష్ణవమాయో
తెలిసీ తెలియని అయోమయములో ॥నీవేనా॥

**శశిరేఖ :** కన్నుల వెన్నెల కాయించి
నా మనసున మల్లెలు పూయించి ॥కన్నుల॥
కనులను మనసును కరగించి
మైమరపించి - నన్నలరించి ॥నీవేలే॥








తెలుగు చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు ధరించినఅభిమన్యుడి పాత్రను తమిళ చిత్రంలో జెమినిగణేష్ ధరించారు. పింగళి నాగేంద్రరావు రాసిన తెలుగు పాట ఒరవడిలో సాగిన తమిళ గీతాన్ని తంజై రామయ్యదాస్ రాశారు. తెలుగు, తమిళ గీతాలు రెండింటినీ గానం చేసిన వారు

ఘంటసాల, పి.లీల.

రామయ్యదాస్ రాసిన తమిళ గీతం ఇది:

**అభిమన్యుడు : నీదానా...**

**నీదానా ఎన్నై నినైత్తదు**

**నీదానా ఎన్నై అళైత్తదు**

**నీదానా ఎన్ ఇదయత్తిలే**

**నిలై తదుమాఱిత ఉలవియదు ॥నీదానా॥**

**వత్సల: నీదానే ఎన్నై నినైత్తదు**

(శశిరేఖ) **నీదానే ఎన్నై అళైత్తదు**

**నీదానే ఎన్ ఇదయత్తిలే**

**నిలై తతుమాఱిడ ఉలవియదు ॥నీదానే॥**

**అభిమన్యుడు: కనవినిలే ఒరు నినైవాగి ఎన్**

**నినైవినిలే ఒరు కనవాగి**

**కనవో నినైవో కాణ్బదు మాయై యో**

**కలవరమేవిడుమ్ నిలవరమానేన్ ॥నీదానే॥**

**వత్సల: కణ్గళిల్ నిలవుమ్ కాయన్దితవే - ఇని**

**ఎన్ మనదిల్ మణముమ్ కమళన్దిడవే**

**కణ్ణైయుమ్ మనదైయుమ్ కవరన్దిడవే**

**మెయ్ కాదలినాలే మగిళన్దితవే ॥నీదానే॥**








'మాయాబజార్' చిత్రాన్ని విజయాసంస్థ వారు మొదట తెలుగులో 'శశిరేఖా పరిణయం' పేరిటా తమిళంలో 'వత్సలా కల్యాణమ్' పేరిటా విడుదల చేయాలనుకున్నారట.

'నీవేనా నను తలచినది' పాట చోట తమిళంలో వినిపించిన 'నీదానా ఎన్నై నినైత్తదు' పాటలోని భావాలు - తెలుగు పాటలోని భావాలను దాదాపుగా ప్రతిబింబించాయి. తమిళ గీతం భావానువాదం :

**అభిమన్యుడు : నీవేనా నను తలచినది**

**నీవేనా నను పిలిచినది**

**నీవేనా నా హృదయంలో**

**(అది) నిలకడ తప్పేటట్టు సంచరించింది...**

**వత్సల: నీవేగా నను తలచినది**

**నీవేగా నను పిలిచినది**

**నీవేగా నా హృదయంలో**

**(అది) నిలకడ తప్పేట్టు సంచరించింది....॥నీవేగా॥**

**అభిమన్యుడు: కలలో ఒక జ్ఞాపకంగా (మెలకువగా)**

**మెలకువలో ఒక కలగా**

**కలయో నిజమో చూచేది మాయయో**

**కలవరం నిండిన స్థితినయ్యాను ॥నీవేగా॥**

**వత్సల: కన్నులలో వెన్నెల కాసేట్టు(వెన్నెల కాయగా)**

**ఇక నా మనసులో సువాసన నిండేట్టు (నిండగా)**

**కంటినీ (చూపునూ) మనసునూ ఆకర్షించేట్టు(ఆకర్షించగా)**

**నిజమైన ప్రేమతో ఆనందించేట్టు(ఆనందించగా) ॥నీవేగా॥**

తెలుగు పాట పల్లవిలోని మది, హృదయము అని రెండు మాటల చోట తమిళ గీతంలో 'ఇదయం'(హృదయం) ఒకటే కనిపిస్తుంది. తెలుగు పాటలో పింగళి సార్థకంగా వాడిన 'వైష్ణవమాయ' ను తమిళ గీతంలో 'మాయ' గా పరిమితార్థంతో వాడారు. తెలుగు గీతంలో 'మనసున మల్లెలు పూయించి' అని ఉండగా తమిళ గీతంలో మల్లెల ప్రస్తావన లేదు. అందుకు మారుగా 'మణమ్'(సువాసన) ప్రస్తావన కనిపిస్తుంది. తెలుగు పాటలోని 'మనసున మల్లెలు పూయించి' అనే పంక్తి మీద 'మల్లీశ్వరి' లోని 'మనసున మల్లె మాలలూగెనే' ప్రభావం ఉందేమో!

'మాయాబజార్ 'చిత్రం లోని అజరామరమైన పాటలలో 'వివాహభోజనంబు' ఒకటి. సురభివారి మాయాబజార్ నాటకంలో 'వివాహభోజనంబు' పల్లవితోనే ఒక పాట ఉంది. ఆ పాట బాణీ 1935లో వెలువడిన తెలుగు చిత్రంలోని పాట బాణీనే అనుసరించిందని విమర్శకుల అభిప్రాయం. విజయా వారి 'వివాహభోజనంబు' పాట బాణీ కూడా ఈ పాటల వరసకు సన్నిహితమైనదే. 1930 ప్రాంతాలలో ప్రసిద్ధులైన ఎడ్మండో రాస్ చేసిన పాశ్చాత్య సంగీత రచన - 'వివాహభోజనంబు' వరుసకు - మాతృక అని సంగీతాభిమానులు పేర్కొంటూ ఉంటారు.

'వివాహభోజనంబు' పాట మాధవపెద్ది సత్యం గానానికి విశేషఖ్యాతి ఆర్జించి పెట్టింది. ఆయన చేసిన వేలాది కచేరీలలో ఈ పాట తప్పని సరిగా పాడేవారు. ఘంటసాల కూడా ఈ పాటను తమ కచేరీలలో పాడిన సందర్భాలున్నాయి. ఈ పాటను మాధవపెద్ది చేత వారం రోజులు సాధన చేయించారట ఘంటసాల.

గారెలు, బూరెలు, అరిసెలు, లడ్డులు, పేణి, పోళీలు, జిలేబి, అప్పళాలు, పులిహోర, దప్పళాలు, పాయసాలు - అన్నిటినీ అవలీలగా ఘటోత్కచుడు ఆరగించడం - సాంకేతిక నైపుణ్యం అంతగా లేని ఆ రోజులలో ఛాయాగ్రాహకులు మార్కస్ బార్ట్లీ సృష్టించిన మాయాజాలం!

పాట మొదట వివాహభోజనంబు అనే వచనమూ, పాట ఆద్యంతమూ వినిపించే నవ్వులు అన్నీ మాధవపెద్ది వినిపించినవే...'మాయాబజార్' చిత్రంలో మాధవపెద్ది దారుకుడి వేషం వేసి -'భళి భళి భళి భళి దేవా' పాటనూ పాడారు.

కన్నులకూ, చెవులకూ విందు చేసిన 'వివాహ భోజనంబు' పింగళి 'మార్కు' పాట-

**ఘటోత్కచుడు :**

**వివాహ భోజనంబు వింతైన వంటకంబు**

**వియ్యాల వారి విందు ఒహోహోహ్హో నాకె ముందు**

అహహ్హా హహ్హా హహ్హా ॥వివాహ॥
ఔరౌర గారెలెల్ల అయ్యారె బూరెలిల్ల
ఓహోహ్హొరె అరిసెలుల్ల ఇవెల్ల నాకె చెల్ల ॥వివాహ॥
భళిరె లడ్డులందు వహ్‌ఫేణీపోణిలిందు
భలే జిలేబి ముందు ఇవెల్ల నాకె విందు ॥వివాహ॥
మఝ్హారె అప్పడాలు పులిహోర దప్పళాలు
వహ్వారె పాయసాలు ఇవెల్ల నాకె చాలు ॥వివాహ॥



మాధవపెద్ది సత్యం తెలుగులో పాడిన పాటను తమిళ చిత్రం కోసం తిరుచ్చి లోకనాదన్(లోకనాథన్) పాడారు. తమిళ గీతాన్ని తంజై రామయ్యాదాస్ రాశారు.

తమిళ గీతం ఇది:

హహ్హహ...
కల్‌యాణ శమైయల్ సాదమ్ హహ్హహ
కల్‌యాణ శమైయల్ సాదమ్
కాయ్‌గఱిగళుమ్ ప్ఱమాదమ్
అన్‌ద గౌరవ ప్ఱసాదమ్
ఇదువే ఎనక్కు పోదుమ్ అహహ్హాహహ్హాహ ॥కల్‌యాణ॥
అన్‌దార బజ్‌జి అంగే
సున్‌సార సొజ్‌జి ఇంగే
సన్‌దోషమ్ మీఱి పొంగ
ఇదువే ఎనక్కు తింగ ॥కల్‌యాణ॥
పుళియోదరైయుమ్ శోఱు
వెగు పొఱుత్తమాయ్ సాంబారు
పూరికిళంగు పొరు
ఇదువే ఎనక్కు జోరు
జోరాన పేణి లడ్డు
శువైయాన శీని పుట్టు
ఏరాళమాన తట్టు
ఇని ఇష్టమ్ పోల వెట్టు ॥కల్‌యాణ॥

'వివాహభోజనంబు' తెలుగులో కనిపించే వైవిధ్యం 'కల్‌యాణ శమైయల్ సాదమ్' తమిళ గీతంలో కనిపించదు. తమిళ గీతం హడావుడిగా రాసి సరిపెట్టేసినట్టు అనిపిస్తుంది.

తమిళ గీతంలో ఘటోత్కచుడు ఏమంటున్నాడో చూద్దామా!

పెళ్లి వంట(పెళ్లి కోసం వండిన) అన్నం
కాయగూరలు అద్భుతం
ఆ గౌరవ (కౌరవ) ప్రసాదం
ఇదే నాకు చాలు ॥పెళ్లి॥
అందాల బజ్జి అక్కడ (అదుగో)
సింగారపు సొజ్జి (రవకేసరి) ఇక్కడ (ఇదుగో)
సంతోషం పెరిగి పొంగగా
ఇదే నేను తినగా (ఇదేనాకు తిండి)॥పెళ్లి॥
పులిహోర అన్నమూ
సరిజోడుగా సాంబారు
పూరి(బంగాళ) దుంపలు చూడు
ఇదే నాకు జోరు ॥పెళ్లి॥
జోరైన పేణీ లడ్డు
రుచికరమైన తీయని (చక్కెర)పుట్టు
ఎన్నెన్నో పళ్లెరాలు
ఇక ఇష్టం వచ్చినట్టు మెక్కు ॥పెళ్లి॥

తమిళ గీతం రచన ఒక పద్ధతిలో జరిగినట్టు కనిపించదు. పల్లవినుంచే సమస్య మొదలైనట్లు అనిపిస్తుంది. 'కాయగూరలు అద్భుతం' అంటే వంటకాలలో వేసినవి అనుకోవాలేమో! కౌరవులకోసం వండినది తనకు దక్కింది అనే అర్థంలో కవి 'కౌరవ ప్రసాదం' అని రాసినా పాటలో మాత్రం 'గౌరవ ప్రసాదం' అనే వినిపిస్తుంది. తమిళంలో క కారానికీ, గ కారానికీ వాడే అక్షరం ఒకటే. ఆ అక్షర సామ్యాన్ని బట్టి రామయ్యాదాస్ శ్లేష వేసినా - అది పాడటంలో తేలిపోయింది.

పెళ్లి చూపుల సందర్భాలలో బజ్జీలు, సొజ్జి పెట్టడం తమిళ సంప్రదాయం. అన్నాన్ని సూచిస్తూ 'సాదమ్' అనే మాట పల్లవిలో ఉండగా కూడు అనే మాటకు దగ్గరగా ఉండే 'శోఱు' అనే మాటను చరణంలో వాడటంలో ఏదో విధంగా పాటను సర్దేసే ప్రయత్నంగా కనిపిస్తుంది. పూరీలు వాటికి తోడుగా బంగాళ దుంపల మసాలా కూర వ్యంజనం ఇవ్వడం ఉపాహారశాలల వాళ్లు మొదలు పెట్టిన సంప్రదాయం. తమిళుల పాక శాస్త్ర ప్రావీణ్యానికి ప్రతినిధులుగా పాటలో కనిపించేవి - పులిహోర, సాంబారు, పుట్టు. 'పుట్టు'ను బియ్యం పిండిని చక్కెరతో కలిపి ఆవిరిలో ఉంచి తయారు చేస్తారు.

'శీని' ని 'చీని'గా చదువుకోవాలి. 'చీని' అంటే చక్కెర. 'పుట్టు'ను ఉప్పుతోనూ చేయవచ్చు కనుక - ఘటోత్కచుడు ప్రత్యేకంగా తీపి వంటకాన్నే 'శీని పుట్టు' అని పేర్కొంటాడు.

తెలుగు పాటను మాధవపెద్ది సత్యం అవలీలగా పాడినట్టు అనిపిస్తుంది. తిరుచ్చి లోకనాదన్ తమిళ గీతం పాడటానికి కొంత శ్రమపడవలసి వచ్చిందట. ఆ శ్రమ ఆ పాటలోనూ కొంత వినిపిస్తుంది.

అయినా - తెలుగు పాటలాగానే తమిళ గీతమూ నేటికీ వినిపిస్తూ శ్రోతలకు ఆనందం కలిగిస్తూ ఉంటుంది!

- పి.ఎస్.గోపాలకృష్ణ




ప్రాచుర్యం పొందిన కొన్ని సరదా తమిళ సినీ గీతాలను ఒక ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు తీసుకు వచ్చారు. ఆ క్యాసెట్ ఇన్-లే కవర్ పైన 'కల్‌యాణ శమైయల్ సాదమ్' పాటకు అభినయించిన ఎస్వీ రంగారావు ఫోటోను ముద్రించడం ఆ పాట సాధించిన విజయానికి గుర్తు.

# సరిగపదమని

## 9

**కూర్పు : టి.నవీన్**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | | 4 | ● |
| | ● | | ● | ● | | ● | 5 | |
| ● | 6 | ● | 7 | | ● | 8 | | ● |
| 9 | | ● | | ● | 10 | | ● | 11 |
| ● | 12 | | ● | 13 | ● | ● | 14 | |
| ● | | ● | 15 | | ● | 16 | ● | |
| ● | 17 | | ● | 18 | | | ● | |
| 19 | | ● | 20 | | ● | | ● | |
| ● | 21 | | ● | 22 | | ● | 23 | |

పంపినవారి పేరు :........................................................................

వయసు :........... వృత్తి :.....................................................................

చిరునామా :.........................................................................

.............................................................................................

.................................................................ఫోన్ :.......................

**ఆధారాలు:**

**అడ్డం:**

1. '.......................... దీక్షబూని సాగరా' అన్నాడు అల్లూరి సీతారామరాజు (8)
5. భీమవరం బుల్లోడా పాలుకావాలా .......పాలుకావాలా (2)
7. '........... రంజనీ నవరాగిణీ' సినారె గీతం (2)
8.'రెండు....... రెండు వరకు చూడలేదె ఇంతసరుకు ' అంటూ జూ॥ఎన్టీఆర్ అభినయించిన పాట(2)
9. 'అందమైన ........ ఆవు పాలకోవా' యస్.జానకి, పి.బి.శ్రీ నివాస్ పాడిన పాట(2)
10. 'కొండలలో నెలకొన్న కోనేటి రాయడు ........' అన్నమయ్య గీతం (2)
12. '........... గురూ ప్రేమ కోసమేరోయ్ జీవితం' నాగార్జున నటించిన గీతం(2)
14. '....... బలిపురం ........బలిపురం ........... బలిపురం భారతీయ కళ జగతికిది గొప్పగోపురం' (2)
15. ..........మేరా అన్నిటికి మూలం (2)
17. 'రాను రానంటూనే సిన్నదో ' అనేపాట గల చిత్రం (2)
18.గోదారి............. గట్టు మీద సెట్టుంది (3)
19.రాగం ......... పల్లవి నామదిలోన కదలాడి కడతేరమన్నవి' అన్నాడు శంకరశాస్త్రి(2)
20. 'జయ జయ జయ ప్రియ భారతి .......యిత్రి దివ్యధాత్రి' దేవులపల్లి గీతం (2)
21. బూచాడమ్మా బూచాడు ........ పెట్టెలో ఉన్నాడు (2)
22. ...... చిరు ........నిను చూసిందెవరమ్మా అంటూ బాధపడుతోంది 'వసంతం' (2)
23.నిలువవే ........ కనులుదానా వయ్యారి హంస నడకదానా(2)

**నిలువు:**

1. తేట తేట తెలుగులా........... వారి వెలుగులా (2)
2.'చూపుల్తో....... ........ చంపకే మేరి హాయ్ అంటూ పాడాడు ఇడియట్ (2)
3. 'సరి....... నీకెవ్వరూ' కంచుకోట చిత్రంలో సుశీల, జానకీ పాడిన పాట (2)
4.శ్రీ సీతా....... కళ్యాణం చూతమురారండి (3)
6. మాయబజార్‌లో మాధవపెద్ది సత్యం పాడిన హిట్ పాట పల్లవి (7)
7. .......లపై శిల్పాలు చెక్కినారు మనవాళ్ళు సృష్టికే అందాలు తెచ్చినారు (2)
8. ......... కొండామా వెంకటగిరి వేంకటేశ్వరుని ........కొండామా (2)
11.ఎందరో ................ అందరికి వందనములు (6)
13. '............... ఆకాశం వుంది ఆకాశంలో మేఘంవుంది ' సిరివెన్నెల సీతారామశాస్త్రి రాసినపాట(5)
16. ........... అల్లదివో శ్రీహరివాసము పదివేలు శేషుల పడగలమయము (3)

**పజిల్, కూపన్ 31-12-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



34 పాటలు గల డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



16పాటలు గల సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



33 పాటలు గల డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



20 పాటలు గల సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

# 'సరిగపదమని-7'

## జవాబులు

అడ్డం: 1.చిటపట, 3.మురారి, 6.యమలీల, 7.మాయలో, 9.కేక 10.శ్వాస, 14.మైనా, 15. ఇంద్ర, 16.మావా, 18.దాయి, 20.సిగ, 22.చెప్పవే, 23.డిరిడి.

నిలువు: 1.చిరునామా, 2.పని, 3. ముత్యాలకేలే, 4 రివ్వున, 5. ప్రేమకోసమై, 8.యమ, 11.చంద్రమా ,12. చిన్నదానా, 13.రామా, 17. పసిడి, 19.రావే, 21.గరి.

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

జి.కృష్ణవేణి-విశాఖపట్నం, జె.చరణ్‌కేదార్- తాడేపల్లిగూడేం (ప॥గో॥జిల్లా), సి.హెచ్. సురేష్‌కుమార్- విజయనగరం, పంగులూరి సత్యనారాయణ- నెల్లూరు, కె.లావణ్య- ధర్మవరం (అనంతపురం), ఎ.వి.ఎస్.మందేశ్వరరావు - మండపేట (తూ॥గో॥జిల్లా), కనుపర్తి జగదీష్- విజయవాడ, సి.సుధాకర్- విశాఖపట్నం, వాస్తు వరలక్ష్మి- నెల్లూరు, దాసరి పద్మజ- అల్లీపూర్(కరీంనగర్), ఎ.ఉమ- హైదరాబాద్, కె.పల్లవి- చౌటుప్పల్ (నల్గొండ), మల్లిడి దినేష్‌రెడ్డి- కుతుకులూరు(తూ॥గో॥జిల్లా), మల్లిడి అరుణాదేవి- కుతుకులూరు(తూ॥గో॥జిల్లా), ఎమ్,మురళీకృష్ణ- నిజామాబాద్, ఆర్.ఎస్.ఎస్. ద్వారకామాయి- హైదరాబాద్, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), పట్నాల నాగరత్నం- విశాఖపట్నం, సి.హెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), బి.వి.బ్రహ్మం- శ్రీరంగపట్నం (తూ॥గో॥జిల్లా), బి.సత్యసాయి శ్రీనివాస్- సెల్ క్యాంపస్ (ఖమ్మం), మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, జె.పోలరాజు- కడపరాజుపల్లి (ప్రకాశం), జి.కె.ఎస్.విశ్వనాథ్- కాకినాడ, ఎ.వీణామాధురి- హైదరాబాద్, వజ్రం.పి- హైదరాబాద్, చిట్టాకమల- హైదరాబాద్, ఆర్.వాణిశ్రీ- ఒంగోలు, కె.వి.శరవణన్- చిత్తూరు, మాడుగుల శ్రీరామచంద్రమూర్తి- విజయవాడ, అగస్త్యరాజు హైమ- ఒంగోలు, జి.యనాదయ్య- చిత్తూరు, ఎన్.సి.ఎస్.లక్ష్మి- హైదరాబాద్, సౌమిత్రి రమణాచార్య- హైదరాబాద్, పి.యం.ఆచారి- హైదరాబాద్, కె.వి.దుర్గామోహన్ రావు- నల్గొండ, దారెల్లి భానుశంకర్- పాల్వంచ, ఎ.ఆర్.ఎన్.శర్మ- విజయవాడ, ఎ.హరిప్రసాద్- హైదరాబాద్, మణిప్రసాద్.ఆర్- జడ్చర్ల (మహబూబ్‌నగర్), పి.వి.జె. మురళి- హైదరాబాద్, ఎమ్.ఎన్.వైజయంతి- నడకుదురు (తూ॥గో॥జిల్లా), టి.విజయలక్ష్మి- విజయవాడ, నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, రాజా సత్యనారాయణ- నార్తురాజుపాలెం (నెల్లూరు),తాసిమళ్ళ వెంకటశేషగిరిరావు- గుడివాడ, ఆర్.శైలజ- కొవ్వూరు, కామరుసు నాగేశ్వరరావు- తణుకు(ప॥గో॥జిల్లా), పెండ్యాల సూకరత్నం- విశాఖపట్నం, కటకం శేషాంజనేయదుర్గాప్రసాద్- హైదరాబాద్, జె.వి.ఎన్.చారి- అహ్మదాబాద్ (గుజరాత్), బి.ప్రశాంతి- పర్లాకిమిడి (ఒరిస్సా), కె.ఎల్.ఎన్.రాజేశ్వరి- తణుకు, పి.వి.రాజేశ్వరి- విశాఖపట్నం, సహారే ఇందిర- ముంబాయి, పి.వి.వి.అప్పారావు- రావులపాలెం (తూ॥గో॥జిల్లా), పి.వి.రామశర్మ- విశాఖపట్నం, మద్ది త్యాగరాజు- నర్సీపట్నం (శ్రీకాకుళం), ఆర్.రఘునందన్- విజయనగరం, కొణిదెల ఆదిత్య- గుంటూరు, ఎన్.అరుణకుమారి- ఎలమంచిలి (విశాఖజిల్లా), జి.వి.రమణ- సంగారెడ్డి, బి.సురేష్‌బాబు- కె.నాగలాపురం (కర్నూలు), ఎస్.సి.నవ్య దీపిక- రాజమండ్రి, జి.రమాదేవి- శ్రీకాకుళం, కూచి కార్తీకవర్ధని- హైదరాబాద్, ఎ.ఆర్.రష్మి- నెల్లూరు, గంటివినయ్- అమలాపురం, ఎ.వి.రమణమ్మ- పార్వతిపురం(విజయనగరం), ఎ.లక్ష్మిజ్యోత్స్న- విజయవాడ, యం.సాగరకుమారి- అనంతపురం, కె.బి.కైలాస్‌నాథ్- అనంతపురం, పూసరపు రోహిణి శ్రీకృష్ణప్రియ- నర్సాపురం(ప॥గో॥జిల్లా), పి.వి.రేఖ - కర్నూలు, గరిమెళ్ళ అన్నాజీరావు- అన్నవరం (తూ॥గో॥జిల్లా),పింగళి క్రిష్ణమూర్తి- గుంటూరు, కె.జ్యోతి- మామిళ్ళగూడెం (ఖమ్మం), దండిభొట్ల శివకుమార వెంకటశాస్త్రి- మచిలీపట్నం (కృష్ణా), పి.అనురాగ్- ఏలూరు, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, వై.బి.వి.ఆర్.మూర్తి- రాజాం (శ్రీకాకుళం), జాగిర్దార్ మాధురి- సామర్లకోట (తూ॥గో॥జిల్లా), జి.పాండురంగశర్మ- హైదరాబాద్, మచ్చలక్ష్మి నర్సయ్య- జాగిత్యాల, ఆర్.రాఘవేంద్రరావు- హైదరాబాద్, వై.రామలక్ష్మి- కాకినాడ, ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, అబ్దుల్ అజీమ్- హైదరాబాద్, కె.అరవింద కళ్యాణ్- హైదరాబాద్, ఎమ్.సురేఖ- హైదరాబాద్, లాలం స్నిగ్ధసింధూర- ఒంగోలు, పి.చందన- నెల్లూరు, తెలికిచెర్ల రామకృష్ణ- విజయనగరం, ఐ.వి.ఎస్.కె.ఆర్.పవనశ్రీ - విశాఖపట్నం, ఏగూరు అపర్ణ- మహబూబ్‌నగర్, ఎ.పి.హృదయకుమార్- నిజామాబాద్, బి.స్వరుపరాణి- కడప, చెరుకుపల్లి వేణుమాధవ్- హన్మకొండ, కె.సందీప్- కడ్తల్(ఆదిలాబాద్), ఎన్.శ్యామలా- నెల్లూరు, రాయప్రోలు లక్ష్మిదేవి- ఒంగోలు, కె.శ్రీవైష్ణవి- కడప, కె.మహేష్- హైదరాబాద్, నందిరాజు వెంకట చలపతిరాజు- హైదరాబాద్, నళినిసాగర్- కర్నూలు, సి.వి.పద్మావతి- జమ్మల మడుగు(కడప), రాగం కనక ఉదయసూర్య భాస్కరరావు- ములగపూడి (తూ॥గో॥జిల్లా), మన్నవమాధవి- సత్తెనపల్లి, సామంచిశ్రీరాధ- విశాఖపట్నం, పి.గిరిజ- ఒంగోలు, దేవినేని కిరణాబాల- హైదరాబాద్, ఆర్.శిరీష- హైదరాబాద్, ఎన్.రవి- రావివలస (శ్రీకాకుళం), పి.పద్మావతి- హైదరాబాద్, టి.వి.ఎస్.శాస్త్రి- గుంటూరు, యు.పద్మజ్యోతి-కడప, ఇప్పిలి శ్రీహర్షశర్మ- హర్షవల్లి (శ్రీకాకుళం), తాడి రంగారావు- రాజమండ్రి, మద్దూరి మధులత- వైజాగ్, సోమయాజుల సాయిప్రసాద్- ఒనకఢిల్లీ(ఒరిస్సా), యస్.సుప్రియక్రిష్ణ- హైదరాబాద్, బి.శేషశాయి- సత్తెనపల్లి(గుంటూరు), ఎ.సంగీత లక్ష్మి- పోతవరం(గుంటూరు), అయ్యగారి రాజశేఖర్- రాజోలు(తూ॥గో॥జిల్లా), జె.శ్రీదేవి- మహబూబ్‌నగర్, ఎన్.శంకరచార్యులు- చిలుకానగర్, కొత్తపల్లి వెంకటలక్ష్మి- విశాఖపట్నం, ఎమ్.శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, కె.కళాబింబి- చెన్నై, తవికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, డి.రామకృష్ణ- రాజమండ్రి, ఉప్పల వెంకట రమణయ్య-కడప, పి.మాధవీలత- విశాఖపట్నం, ఎన్.సి.సీతాదేవి- ఆత్రేయపురం, డి.సంజీవ్‌కుమార్- నిజామాబాద్, సంజీవ్‌కుమార్.కె.-అనంతపురం, వజ్రాలదుర్గాప్రసాద్- హైదరాబాద్, జి.ఎన్.రుక్మిణి- అనంతపురం, పాలెపు శ్రీనివాస్- కొంతమూరు (తూ॥గో॥జిల్లా), వై.చిట్టిబాబు- ద్వారపూడి (తూ॥గో॥జిల్లా), ఎ.వాగ్దేవి- కోదాడ (నల్గొండ), ఆర్.రాజ్యలక్ష్మి- హైదరాబాద్, ఎమ్.ఎస్.సి.శేఖర్- హైదరాబాద్, ఆర్.వి.లక్ష్మిదేవి- విజయవాడ, వరగంటి మంజుల- చౌటుప్పల్ (నల్గొండ), టి.జగన్మోహన్- విశాఖపట్నం, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, కె.సత్యనారాయణ- కాకినాడ, పి.తిరుమల్ ప్రసాద్- హైదరాబాద్, జల్లేపల్లి విజయలక్ష్మి-విశాఖపట్నం, ఎన్.గాయత్రిదేవి- హైదరాబాద్,బాసరాజు యాదగిరి రామన్నపేట (నల్గొండ), తాతా సౌందర్యకౌముది- విశాఖపట్నం, ఎస్.సునీత- ఎమ్మిగనూరు, పి.పాపారావు- విశాఖపట్నం, ఆత్మూరి వెకంట శరత్‌కృష్ణ- హైదరాబాద్, ఎమ్.జె.అనిల్ కుమార్ రెడ్డి- ఉరుటూరు(కడప), తాతిరాజు మోహన్‌రావు- విశాఖపట్నం, బి.రేణుక కుమారి- బోధన్, ఆర్.హరిత- కర్నూలు, సరోజ.సి- విజయవాడ, కే.వి.ఎన్.బిందు- హైదరాబాద్, నండూరి సుబ్రహ్మణ్య వేణుమాధవ్- కాకినాడ, డి.మురళి- మార్కాపూర్(ప్రకాశం), బి.బర్నబాస్- నెలిమర్ల (విజయనగరం), టి.సూర్యశ్రీ- హైదరాబాద్, బచ్చువిజయకుమార్- విశాఖపట్నం, పి.వేణుగోపాల్‌రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), కె.లావణ్య- నంద్యాల (కర్నూలు), కె.ఉమామహేశ్వరరావు- అనపర్తి (తూ॥గో॥జిల్లా), సి.సంజీవమూర్తి- ఆళ్ళగడ్డ (కర్నూలు), ఇ.టి.రామరావు- శ్రీహరికోట (నెల్లూరు), టి.చంద్రజ్యోతి- కాకినాడ, వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి(గుంటూరు), స్వర్ణవిద్యులత- స్వర్ణ (ప్రకాశం), బిల్లంకొండ రాంబాబు- పమిడుపాడు (గుంటూరు), డి.భానుమతి- రాజమండ్రి, యన్.శ్రీనివాసులు- కర్నూలు, డి.మల్లిఖార్జున్- మందమర్రి (ఆదిలాబాద్), బి.శైలజకుమారి- అల్లూరు (కర్నూలు), పి.రాజ్కి- సికింద్రాబాద్, ఆమంచి వెంకటలక్ష్మి కామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), మహమ్మద్ లతీఫ్- హైదరాబాద్, గురజాల శ్రీదేవి- విశాఖపట్నం, కె.ఎస్.ప్రకాశరావు- కంకిపాడు, ఎ.తేజేశ్వరరావు- పాతపట్నం (శ్రీకాకుళం), ఎస్.రమాసుందరి- వీరనారాయణం (విజయనగరం), కె.మాధవీలత- నందికొట్కూరు (కర్నూలు), జి.వరలక్ష్మి- హైదరాబాద్, సి.వి.ఎస్.శైలజ- హైదరాబాద్, పి.వి.ఆర్.యస్- నరసాపురం(ప॥గో॥జిల్లా), పి.వి.రమణ సుధాకర్- దర్శి (ప్రకాశం), ఎ.మధుకృష్ణ-విజయవాడ, ఎ.రవికుమార్- చీరాల (ప్రకాశం), ఎస్.ప్రవీణ్‌కుమార్- నిజామాబాద్, ఎ.చంద్రశేఖర్- హైదరాబాద్, కొత్తపల్లి రూప- ఖమ్మం, ఆర్.ఉషావినోద్- హైదరాబాద్, రమణ- హైదరాబాద్, పెంటకోట షర్మిళాబుషి- చింతల అగ్రహారం(విశాఖపట్నం), ఎ.భార్గవప్రత్యూష్- సికింద్రాబాద్, దావిలాల కృష్ణకుమారి- హైదరాబాద్, శారదదేవి.సి- హైదరాబాద్, ఎమ్.ఎ.ఎమ్.తాయరు- విశాఖపట్నం, ఎన్.లీలా ప్రసూనాదేవి- హైదరాబాద్, బొడిగ వెంకటేశం గౌడ్- హైదరాబాద్, మంత్రిప్రగడ శ్వేత- నల్గొండ.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

బొబ్బిలి లక్ష్మిరేణుక- విజయవాడ, వేదగిరి విజయలక్ష్మి- హైదరాబాద్, కె.నీలిమ- రాజమండ్రి, కె.వి.రమణామూర్తి- బరంపురం(ఒరిస్సా), ఎస్.కె.మాధవి- చంద్రాపూర్ (మహారాష్ట్ర), ఎ.అపూర్వ- ఖమ్మం, డి.అమరేశ్వరరాయశర్మ- నిడుబ్రోలు (గుంటూరు), బాలనాగు విజయసారధి- భీమడోలు (ప॥గో॥జిల్లా), వై.సిద్దన్న- నారాయణపేట (మహబూబ్‌నగర్), జి.రామనందరెడ్డి- పుణే, ఎ.సువర్చాల- కడప, మద్దిపాటి సూర్య- హైదరాబాద్, ఎమ్.నాగేశ్వరరావు- విశాఖపట్నం, చింతల బుక్క ప్రకాశ్- వేములవాడ (కరీంనగర్), కె.వి.లక్ష్మి- హైదరాబాద్, జి.మణిశారద- పాల్వంచ(ఖమ్మం), సోపింటి శకత్‌బాబు- హైదరాబాద్, బి.ఎస్.రామరావు- హైదరాబాద్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), గేదేల ఢిలేశ్వరరావు- ధనుపురం (శ్రీకాకుళం), ఎ.కృష్ణవేణి- తెనాలి, పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరం), పి.లక్ష్మికాంత్- గుంటూరు, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపురం, ఎ.శివకుమార్- తిరుపతి, ఎం.వి.ఎస్.లక్ష్మి- కాకినాడ (తూ॥గో॥జిల్లా), యర్రవాణి- కాకినాడ, కె.వి.సరస్వతి- హైదరాబాద్, బి.ఇ.శ్రీనివాసమూర్తి- అనంతపురం, పెద్దాడ వేంకటేశ్వర్లు- సిర్పూర్ కాగజ్‌నగర్, జి.భార్గవి- తారిగొండ (చిత్తూరు), సి.ఎన్.లాస్య- సికింద్రాబాద్, పి.శేఖర్‌బాబు- ధర్మసాగర్ (వరంగల్), సి.మెచ్.రమ్యనవీన్- హైదరాబాద్, ఎమ్.ఉదయ్‌కుమార్- కోదాడ(నల్గొండ), జయంతి రమ్యసాహితి- విశాఖపట్నం, సి.హెచ్.ఎల్.వి.ఎమ్,అదిత్యా- నరసారావుపేట, కిశోర్‌కుమార్.ఆర్- గోదావరిఖని (కరీంనగర్), ఎ.స్పందన- న్యూపాల్వంచ(ఖమ్మం), శివనాద్రి ప్రదీప్‌కుమార్- హైదరాబాద్, సి.విజయసారధి- కర్నూలు, అవసరాలమణి- విజయనగరం, డి.మణిమంజరి- హైదరాబాద్, కె.రంగాచారి- వరంగల్, యు.విజయశేఖరరెడ్డి- హైదరాబాద్, కె.ఎస్.శ్రీనివాస్- ఖమ్మం, జి.ప్రసాదరెడ్డి- శ్రీకాకుళం, శిమ్మసన్యాసిరావు- రాగోలు (శ్రీకాకుళం), ఎ.వినయ్‌కుమార్- వరంగల్, టి.పి.రాజ్యలక్ష్మి- శ్రీకాకుళం, ఎస్.పద్మవతి- కాకినాడ, పి.ఎస్.నారాయణరాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), ఎస్.జగన్మోహనరావు- కరీంనగర్, ఏలూరిపాటి నాగేశ్వరరావు- కొవ్వూరు(ప॥గో॥జిల్లా),పరస జగన్నాధరావు- దొమ్మేరు (ప॥గో॥జిల్లా), వూదర్శి వీరమ్మడు- పెందుర్తి (విశాఖజిల్లా), చీవుకుల చిరంజీవి- ఒంగోలు, పి.మయూఖ- అమలాపురం (తూ॥గో॥జిల్లా), ఎమ్.వి.కె.సింగ్- రాజమండ్రి, కె.మురళీమోహన్- మార్కపూర్(ప్రకాశం), యన్.మాధురి- విజయవాడ, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), శిష్టాసీతామహాలక్ష్మి- హైదరాబాద్, ఎమ్.మహేశ్వరి- అంగర(తూ॥గో॥జిల్లా), కడార్లనారాయణ- జగిత్యాల, టి.ఎస్.హిమబిందు- కాకినాడ, ఎ.శైలజ- హైదరాబాద్, యు.యు.శ్రీరాములు- చెన్నై, బి.కవిత- తిరుపతి, సన్నిధి రాజ్యలక్ష్మి- ఆకివీడు(ప॥గో॥జిల్లా), పి.లక్ష్మిదేవి- దొర్నిపాడు (కర్నూలు), సి.హెచ్.విష్ణుప్రియ- ఆదిలాబాద్, యు.ఇందు నీహారిక- నెల్లూరు, ఎన్.ఎస్.ఎన్.రాజు- శృంగవృక్షం (ప॥గో॥జిల్లా), మంచెం శ్రీరాంస్వరూప్- కాకినాడ, ఎ.శివారెడ్డి- ఉదయగిరి (నెల్లూరు), పి.వి.సుందర్‌కుమార్- బిరహంపూర్ (ఒరిస్సా), పి.శాంతిలక్ష్మి- బిరహంపూర్ (ఒరిస్సా), బి.రాఘవేంద్ర- శ్రీశైలం, వై.వి.ఎస్.సత్యనారాయణ- కాకినాడ, బి.చంద్రశేఖరయ్య- రామసముద్రం (చిత్తూరు), డి.మురళీకృష్ణ- నడుపల్లి(ప॥గో॥జిల్లా), గూడెం స్వప్నమాల- మంచిర్యాల (ఆదిలాబాద్), మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల(ఆదిలాబాద్), శర్వాణి.ఎన్- నెల్లూరు, ఎ.రాధిక- అమలాపురం, బావినేని జ్యోతి- చందనగర్, ఎన్.సాయిలీల- హైదరాబాద్, బి.చెందన- హైదరాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, మోచెర్ల సురేష్- రాజమండ్రి, ఎమ్.కమల కుమారి- కాకినాడ, మద్దుల అప్పారావు- అనకాపల్లి (విశాఖజిల్లా), నసీమాతాజ్- శ్రీశైలం డ్యామ్ ఈస్ట్ (కర్నూలు), బుద్దన ప్రశాంతి- కాకినాడ, పి.అపర్ణా భారతి- సికింద్రాబాద్, డి.హరిప్రియ- అనంతపురం, దేవరం సతీష్‌కుమార్- జగిత్యాల (కరీంనగర్), వనం జానకీదేవి- పాతపాల్వంచ (ఖమ్మం), గంటి బుల్లబ్బాయి- కొమానపల్లి (తూ॥గో॥జిల్లా), జె.అరుణదీపిక- తిలరు (శ్రీకాకుళం), ప్రభల శ్రీనివాస్ - హైదరాబాద్, వై.భానుప్రసాద్- కర్నూలు, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, విరివింటి శ్రీమోక్షిత్‌శాస్త్రి- వనపర్తి (మహబూబ్‌నగర్), ఎ.శారద- హైదరాబాద్, జి.కళ్యాణిశర్మ- నంద్యాల (కర్నూలు), వి.ఎమ్.ఎమ్.గుప్త- హైదరాబాద్, పి.జితేంద్రదేవ్- హైదరాబాద్, బి.రామచంద్రమూర్తి- హైదరాబాద్, డి.యస్.రెడ్డి- నర్సీపట్నం (విశాఖజిల్లా), ఎస్.కె.షబ్నం- నాయుడుపేట (నెల్లూరు), రావి నరేష్‌చౌదరి- గుంటూరు, టి.మల్లిఖార్జున రాజు- గద్వాల్, పొన్నడ రమేష్- హైదరాబాద్, జి.వరలక్ష్మి- కర్నూలు, ఎమ్.శ్రీనివాసమూర్తి- మదనపల్లె, పడాలరాము - పాతపట్నం, పొణ్యం రుక్మిణీదేవి- కర్నూలు, వరదా సాయికుమార్- పర్లాకిమిడి (ఒరిస్సా), ఎమ్.సత్యవాణి- తణుకు (ప॥గో॥జిల్లా), పి.సమన్వయ్‌రెడ్డి- చిత్తూరు, క్రిరిఝాన్సీ- హైదరాబాద్, ఎన్.దివ్యధాన్యలక్ష్మి- హైదరాబాద్, కె.నీరజదీపిక- హైదరాబాద్, గెలివి శశికళ- నంద్యాల (కర్నూలు), సి.ఛాయాదేవి- విజయవాడ, ఎన్.సాంబశివరెడ్డి- చిత్తూరు, జె.శర్వాణి- తిరుపతి, కొప్పుల ప్రభామనోజ- కాకినాడ, ప్రవీణ్‌కుమార్.ఎస్- సంగం (నెల్లూరు), బి.పుష్పదేవమణి- హైదరాబాద్, డి.చందినిదీప్తి- నెల్లూరు, జె.రాజ్యలక్ష్మి- శ్రీహరికోట, ఎస్.ఎస్.చంద్రశేఖర్- తాడేపల్లిగూడేం (ప॥గో॥జిల్లా), వంకాయలపాటి రాజయ్య- హుజూర్‌నగర్ (నల్గొండ), వై.గణేశ్వరావు- కె.కొతపాడు(విశాఖజిల్లా), కాటేపల్లి కృష్ణమోహన్- మిర్యాలగూడ (నల్గొండ), కదలి అప్పారావు- చిరాల (ప్రకాశం), గరిమెళ్ళ భాగ్యశ్రీ- ఖమ్మం, బి.వి.మనోహర్‌బాబు- నవులూరు (గుంటూరు), మామిడి మునిశ్రీలత- రేపల్లె, పి.నరసింహామూర్తి- హైదరాబాద్.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

ఎమ్.మాధురి రంగరావు- నల్గొండ, సి.హరగోపాల్- నెల్లూరు, పి.రామజోగారావు- విశాఖపట్నం, జి.భగవాన్‌దాస్- కడప, ఎన్.విష్ణుమోహనరావు- విశాఖపట్నం, కె.దివ్యతేజ- గుడివాడ, ఐ.వి.గిరిజ- హైదరాబాద్, పి.పద్మనాభం- హైదరాబాద్, కొండపల్లిరంగయ్య- లంగ్టాపూర్ (నిజామాబాద్), ఇ.శివకుమార్- చిత్తూరు, జి.బాలత్రిపురసుందరి- ఆముదాలవలస (శ్రీకాకుళం), టి.ప్రదీప్- గుంతకల్లు, ఐ.రమమాణి- జి.ఎల్.పురం (విజయనగరం), దూసి జయశ్రీ- హైదరాబాద్, జె.అప్పలరాజు- గజపతినగర్(ఒరిస్సా), కె.జగన్- కందుకూర్ (రంగారెడ్డి), టి.మమతారెడ్డి- కరీంనగర్, జివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, ఎ.సరోజాదేవి- రాజమండ్రి, పి.ఝాన్సీలక్ష్మిబాయి- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా), టి.ఉమారాణి- మార్కాపురం, ఎన్.తనూజ- కుర్ధరోడ్ (ఒరిస్సా), పి.గోపాలకృష్ణ- జి.మామిడాడ (తూ॥గో॥జిల్లా), మామిడి మాహేంద్ర- పుణే, శ్రీనివాస్ పవార్- ఆర్మూర్ (నిజామాబాద్).

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



20

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగినకథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడు తూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి ఆండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడతాడు వెంకట్రావు. ఎంతసేపటికీ లైను కదలదు.

(ఇక చదవండి)

"మేస్టారూ... సారీ... టైపిస్టుగారూ... ఇంతింత సేపు నిలబడాలంటే కష్టం కదా! మరి అంతవరకూ మనకు ఒకటొచ్చినా రెండొచ్చినా... ఎలా?..." వేళ్ళు చూపిస్తూ అడిగాడు.

ముఖం చిట్లిన్చూ వెంకట్రావును చూశాడతను.

"మనకా! అంటే! ఒకటీ రెండూ మనకు ఒకేసారి రావడానికి మనమేమైనా కవల పిల్లలమా? నాకొస్తే మీకు రావాలని మీకొస్తే నాకు రావాలని రూలుందా? నాకెప్పుడొస్తుందో మీకు తెలుస్తుందా? మీకెప్పుడొస్తుందో నాకు తెలుస్తుందా? ఎవరికెప్పుడు వస్తుందో వారికే తెలియదే! మరి నా సంగతి మీకు, మీ సంగతి నాకు ఎలా తెలుస్తుంది? వస్తే మాత్రం ఇద్దరం ఒకేసారి వెళ్తామా? ఏవిటండీ మీరు నా వెనక చేరి నా ప్రాణాలు తోడేస్తున్నారు? మీకసలు మంచీ మర్యాదా మాట్లాడే పద్ధతి ఏమీ తెలిసినట్లే లేవే?" కోపంగా అన్నాడు.

అందరి కళ్ళు ఇటువైపు మళ్ళాయి. బిక్క చచ్చిపోయాడు వెంకట్రావు. ముఖం పెనరగింజంతయింది. మళ్ళీ అతనితో మాట్లాడి పెంట మీద రాయి వేశాననుకుని చింతించాడు. వెనుక వైపతనిని చూసి మాట్లాడదామా వద్దా అని రెండు నిముషాలు ఆలోచించాడు. రెండు మూడు సార్లు వెనుకతని వైపు చూశాడు.

వెంకట్రావు భావాలను గమనించాడో యేమో! అతనే నవ్వునాపుకుంటూ అన్నాడు "ఏంటి సార్?".

"మనం క్యూలో ఇంతింత సేపు నిలబడాలంటే కష్టం కదండీ." అన్నాడు వెంకట్రావు.

"తప్పేదేముంది సార్... మా అబ్బాయి సీటుకోసం కాన్వెంటు స్కూల్లో రెండురోజులు నవరంధ్రాలు బిగించుకుని నిలబడ్డాను. అవసరం మనది." అన్నాడాయన.

"మరి ఈ లోపల మనకు... ఐ మీన్ నాకు.."

"అర్థమైంది. ఒకటొచ్చినా రెండొచ్చినా అదిగో. ఆ వైపు టాయ్‌లెట్సున్నాయి. ఏం దిగుల్లేదు. వన్నైతే పాతిక రూపాయలు, టు అయితే ఏభై రూపాయలు చెల్లించి అవసరాలు తీర్చుకోవచ్చు." చెప్పాడతను.

"మై గాడ్... వద్దులెండి... రెండూ ఆగిపోయాయి." గుటకమింగి అన్నాడు వెంకట్రావు.

రెండు నిముషాలు తరువాత మళ్ళీ కదిలించాడతన్ని.

"సార్... మరి ఆకలైతే.. ఎలా?... మరి దానికోసం..." తూచి తూచి అడిగాడు వెంకట్రావు.

నవ్వాడతను.

"ఆ విషయంలో మీరేమీ దిగులు పెట్టుకోవద్దు. వాస్తు భూషణం గారు సర్వజ్ఞులు. తన క్లయింట్స్ కష్టసుఖాలు ఆయనకు బాగా తెలుసు. అందుకే ఇక్కడ సకల హంగులతో చక్కని క్యాంటిన్ పెట్టించారట! మనకేం కావాలన్నా చిటికెలో సప్లై చేస్తారట! టిఫిన్ టైముకు టిఫిను. లంచవర్‌లో లంచ్ సాయంత్రం స్నాక్స్, రాత్రికి డిన్నర్ అన్నీ అరేంజ్ చేస్తారట! ఇందాక గార్డు చెప్పాడు." అన్నాడతను.




ఇంతలోనే కమ్మని వాసన వెంకట్రావు ముక్కు పుటాలను సోకింది.

అందరి కళ్ళూ అటువైపు తిరిగాయి.

దూరంగా నలుగురు కుర్రాళ్ళు నాలు సైకిల్ చక్రాల తోపుడు బండిమీద బేసిన్లలో ఇడ్లీలు, వడలు, దోసెలు, పూరీలు, ఉప్మా కొన్ని గిన్నెల్లో కాఫీ, చట్నీలు పెట్టుకుని ఇడ్లీ, వడై, దోసై, పూరీ అని అరుస్తూ వస్తున్నారు.

వారిని చూడగానే అందరి కడుపుల్లో ఎలుకలు వేగంగా పరిగెత్త సాగాయి. ఇంట్లో ఇల్లాళ్ళు ఎంత కమ్మగా చేసిపెట్టినా బజార్లో అమ్మేవాటిని చూస్తే ఎటువంటి వారికైనా నోళ్ళూరి పోతుంటాయి.

"ఏయ్... అబ్బాయ్... నాయనా... బాబూ... ఇలారా... రా..." అందరూ కేకలు పెట్టసాగారు. క్యూ చెదిరి పోతున్నది.

గార్డులు లాఠీలూపారు.

"ఎవ్వరూ కదలొద్దు. లైనులోంచి రావద్దు. అది రూల్సుకు విరుద్ధం. మా సారు తన క్లయింట్లకు అంత శ్రమ ఇవ్వరు. వారే మీ దగ్గరకు వస్తారు. దయచేసి కదలొద్దు." అరిచారు.

"అందరికీ అందుతాయోలేదో"

"అయిపోతాయేమో..."

"నాకు ఆకలి రగలిపోతున్నది."

"నాకు పేగులు మడతపడుతున్నాయి."

ఈ విధంగా అరవసాగారు జనం.

"ఏం భయం లేదు. అందరికీ అన్నీ దొరుకుతాయి. ఇంటర్నేషనల్ పెసర్డోస్ గ్రూప్ వారిదీ క్యాంటీన్. వారి హెడ్డాఫీసు జర్మనీలో ఉంది. ప్రపంచమంతటా వారికి పదహారువేల బ్రాంచీలున్నాయి. ఇండియాలో వారి బ్రాంచి ఈ ఒక్కచోట మాత్రమే ఉంది. ఆర్డరిస్తే జర్మనీ నుంచైనా క్షణాల్లో తెప్పిస్తారు. డోంట్ వర్రీ." అన్నారు ధృఢకాయులు.

జనం ఆశ్చర్యపోయారు.

"ఓ గాడ్... పెసర్డోస్ గ్రూప్ వారికి ఇక్కడ క్యాంటీనుందా!" అన్నాడు వెంకట్రావు.

"ఏసీ... ఇది పెసర్డోస్ వారిదా! మొన్న ప్యారిస్‌లో వాళ్ళ రెస్టారెంట్‌లో తిన్నాను. వారి క్వాలిటీ చాలా బాగుంటుంది." అన్నాడు లైన్లో ఒకాయన.

అందరూ ఆశ్చర్యంగా అతనివైపు చూశారు.

"ఆఁ... మీరు ప్యారిస్ వెళ్ళారా?" అన్నారెవరో.

"అదే.. లండన్ వెళ్ళినపుడు వీకెండ్‌కు అలా ప్యారిస్ వెళ్ళొచ్చా" అన్నాడాయన.

ఆ మాటతో ఆయన మీద ప్రత్యేక గౌరవం పెరిగింది అందరికీ.

"ఆయన మొహం చూస్తుంటేనే అన్నం తిని ఆరు రోజులైనట్లుంది. ఆంధ్రా ప్యారిస్ వెళ్ళుంటాడు." వెంకట్రావు వెనుక నిలుచున్నాయన గొణిగాడు.



"మరి వాస్తు భూషణం గారి డిమాండ్ ఏమనుకున్నారు? ప్రపంచంలోని అన్ని పెద్ద పెద్ద హోటల్ గ్రూపులు ఇక్కడ క్యాంటీన్ పెట్టడానికి టెండర్స్ వేశారు. చివరకు వీరి 'టెండర్ 'ది లోయస్ట్' అయింది. నైన్టీనైన్ ఇయర్స్ కాంట్రాక్టిచ్చారు." చెప్పాడొక గార్డు.

తోవుడు బండివాళ్ళు క్యూలను సమీపించారు. బేసిన్లలోని పదార్థాలను దగ్గరగా చూస్తే-

ఇడ్లీలు రూపాయి బిళ్ళ మందం, సైజులో ఉన్నాయి. దోసెలు తమలపాకు కంటే నన్నగా ఉన్నాయి. వడలు ఐదురూపాయల బిళ్ళంత ఉన్నాయి. పూరీ అరచెయ్యి సైజులో ఉన్నాయి.

"అదేంటయ్యా బాబూ... ఇడ్లీలు మరీ అంత చిన్నవిగా ఉన్నాయి. వంద తిన్నా కూడా పంటి కిందకు రావు." అన్నాడొకాయన.

"ఆ దోసె లేంటి నాయనా... ఆకుల కంటే సన్నవిగా ఉన్నాయి. ఒకేసారి యాభై మడత పెట్టి నోట్లో పెట్టుకోవచ్చు." అన్నాడు మరొకాయన.

"ఇవేం వడలు స్వామీ... రేగుపళ్ళుంతున్నాయి? రూపాయికి ఎన్నేమిటి?" అడిగాడు ఇంకొకాయన.

"పది ప్లేట్లు ఇడ్లీ ఇవ్వు..."

"ఇరవై దోసెలివ్వు.."

"పాతిక వడలు, పాతిక ఇడ్లీలివ్వు"

"పది పూరీలు"

అందరూ కేకలు పెట్టసాగారు.

వెంకట్రావు దగ్గర బండి ఆగింది.

"ప్లేటిడ్లీ ఎంత నాయనా" అడిగాడు వెంకట్రావు.

"నలభై రూపాయలు సార్" అన్నాడు బండివాడు.

"నేనడిగింది ప్లేటుతో పాటు కాదు నాయనా."

"నేను చెబుతుంది అదేనండి."

అదిరి పడ్డాడు వెంకట్రావు.

"ప్లేటుకు ఎన్నిస్తారు?"

"రెండు"

"అంటే... రెండిడ్లీ నలభై రూపాయలా? అంటే ఒక్కోటి ఇరవై రూపాయలా?"

"మరి అంతే గదాండి. ఒకటి ఇరవై అయితేనే రెండు నలభై. మూడు అరవై. నాలుగు




ఎనభై ఐదు వంద,ఆరు నూటిరవై..."

"అబ్బ ఆపవయ్యా... ఎక్కాలు మాకూ వచ్చులే. మరి మిగిలిన వాటి రేట్లు?..."

"ఇడ్లీ విత్ సాంబార్ ఏభై రూపాయలు. రెండు వడ ఎనభై రూపాయలు. ఒక ఇడ్లీ ఒక వడ ఏభై చట్నీతో ఇడ్లీ వంద రూపాయలు. ఒక వడ ఒక ఇడ్లీ చట్నీతో అరవై, సాంబార్‌తో డెబ్బై, చట్నీ సాంబార్‌తో ఎనభై. చట్నీ, కారప్పొడితో ఏభై నాలుగు రూపాయలు. నెయ్యి కావాలంటే స్పూనుకు పదిహేను రూపాయలు. సింగిల్ పూరీ ఇరవై ఆరు రూపాయలు. రెండు పూరీలైతే ఏభై రూపాయలు మాత్రమే. ప్లెయిన్ మినపదోసె అరవై రూపాయలు. ఆనియన్ దోసె ఎనభై రూపాయలు. రవ్వ దోసె నూట ఇరవై రూపాయలు. పెసరట్టు నూట ఏభై రూపాయలు ఉప్మా పెసరట్టు నూట ఏనభై రూపాయలు. ఎక్స్ట్రా చట్నీ ఇరవై రూపాయలు. ఎక్స్ట్రా కుర్మా నలభై రూపాయలు ఇడ్లీ, వడ ప్లేట్ తిన్నవారికి ఒక స్పూన్ చట్నీ ఉచితం." మైకులో చెప్పారు వారు.

ఆ రేట్లు వినగానే క్యూలో ఉన్న సగం మంది మూర్ఛపోయారు. మరో సగం మంది గుండెపోటు రాకుండా గుండెను అదిమి పట్టుకున్నారు. వెంకట్రావు స్వరపేటిక చలన రహితమైంది.

"ఏమిటింత రేట్లా?" అతి కష్టం మీద అడిగాడు.

"అవునండీ మా స్టాండర్డ్స్ అలా ఉంటాయి. మేము తయారు చేసి ప్రతి పదార్థంలోనూ ఇరవై శాతం మాంసకృత్తులు, ఇరవై శాతం విటమిన్స్, ఇరవై శాతం ఖనిజ లవణాలు, ఇరవై శాతం ప్రొటిన్స్, ఇరవై శాతం పోషకాహార విలువలు ఉంటాయి. ఇవి జర్మన్ టెక్నాలజీతో రూపొందించబడ్డాయి."

"రామ రామ! ఇడ్లీ వడలు కూడా జర్మన్ టెక్నాలజీతోనా! ఇటువంటి మాటలు ఈ జీవితంలో వింటానని కలకూడా కనలేదు." అన్నాడో వృద్ధుడు.

"కానీ ఈ రేట్లు చాలా దారుణంగా ఉన్నాయి. ఇండియాలో ఏ ఫైవ్ స్టార్ల హోటల్లోనూ ఇంత రేట్లుండవే" అన్నాడు వెంకట్రావు.

"అవునండీ. ఇండియాలో ఉండకపోవచ్చు. కానీ జర్మనీలో టూ స్టార్ హోటల్లో ఉంటాయి. మాది సెవెన్ స్టార్ హోటల్. కానీ టూ స్టార్ రేట్లకే అమ్ముతున్నాం. వీటిలో వాడే ప్రతి ఇంగ్రేడియంటూ ఉప్పుతో సహా అన్నీ జర్మనీ నుంచే వస్తాయి. అంతా ఇంపోర్టెడ్." చెప్పాడు బండివాడు.

"ఓరినీ ఇల్లు దొంగలు దోలా... ఇండియాకు మూడు సముద్రాలున్నాయి. ఉప్పు దొరకదా?" అన్నాడో వ్యక్తి.

"దొరికితే మాత్రం వేస్తామా సార్? మాది ఇంటర్నేషనల్ గ్రూప్. ప్రపంచంలో ఎక్కడున్నా ఆ స్టాండర్డ్స్ మెయిన్ టెయిన్ చెయ్యాలి. నడి సముద్రంలో క్యాంటిన్ పెట్టినా పెసర్డోస్ వారి రూల్స్ ఒకటే." చెప్పాడు బండివాడు.

ఆకలితో కేకలు పెట్టిన వారెవ్వరూ కొనడానికి సాహసించలేదు. అందరికీ కడుపులు దహించుకు పోతున్నాయి. కానీ రేట్లు విన్న తరువాత అందరి మనసులు మరింత దహించుకుపోతున్నాయి.

-(ఇంకావుంది)



రీమిక్స్‌లో గ్రాండ్ సక్సెస్ పొందవచ్చుననే ఆలోచనే

# 'మసక మసక చీకటిలో...'

## ఆల్బమ్‌కు పునాది

### - 'హాయ్‌రబ్బా' స్మిత

"మసక మసక చీకటిలో...మల్లెతోట వెనకాలా... మాపటేళ కలుసుకో.... నీ మనసైనది దొరుకుతుంది" అంటూ ఓ పాట ఇక మీదట ఎక్కడైనా వినిపిస్తే.... 'ఆహా...ఎల్లారీశ్వరి (ఎల్.ఆర్.ఈశ్వరి) నిత్యనూతనంగా ఎంత చక్కగా పాడింది" అని తొందరపడి మురిసి పోకండి... అది 'స్మిత' గొంతు కావచ్చు. అవును... ఆ పాటను మరికాస్త జాగ్రత్తగా వింటే... ట్యూన్ అదే అయినా - నేపథ్య సంగీతంలోని కొత్త పోకడలు మీ చెవిని చేరవచ్చు... నిన్న మొన్నటి వరకూ ఉత్తరాది సంగీత ప్రపంచాన్ని ఊపేసిన రీ - మిక్స్ ప్రక్రియ ఇప్పుడు తెలుగులోనూ మొదలైంది. సినిమాల్లోని పాపులర్ పాటల ట్యూన్‌కి కొత్త పదాలతో సొగసులద్దిన సంగీత దర్శకుల్ని చూశాం. ఒకే పాటను - రెండు సినిమాల్లో చిత్రీకరించుకోవడం గురించి విన్నాం. ఇక ఇప్పుడు అవే బాణీలు - అవే పదాలు... కొత్తగా మన చెవుల్ని చేరటం మొదలైంది. 'హాయ్‌రబ్బా' ప్రైవేట్ పాప్ ఆల్బమ్‌తో తెలుగు పాప్ రంగంలో సంచలనం సృష్టించిన స్మిత ఇప్పుడు రీ మిక్స్ గీతాలని తనదైన శైలిలో శ్రోతలకి వినిపిస్తోంది. అదే 'మసక...మసక చీకటిలో...'

ప్రముఖ సినీ దర్శకుడు పూరి జగన్నాథ్ ఈ రీ -మిక్స్ ఆడియో ఆల్బమ్‌ను, హీరో శ్రీకాంత్ వీడియో ఆల్బమ్‌ను ఇటీవల విడుదల చేశారు. పాప్ గాయనిగా స్మిత వయస్సు కేవలం నాలుగేళ్లు. ఈ నాలుగేళ్లలోనూ రెండు హిందీ పాప్ ఆల్బమ్స్‌ను, రెండు తెలుగు ఆల్బమ్స్ విడుదల చేసింది. ఇది అయిదవ ఆల్బమ్. 'మసక.... మసక చీకటిలో...' రీ మిక్స్ విడుదల సందర్భంగా 'హాసం' ఆమెతో జరిపిన మాటా మంతి ఇది...



**సంగీత ప్రపంచంలో అడుగుపెట్టాలనే కోరిక ఎలా కలిగింది?**

చిన్నప్పటి నుండి పాటలు పాడటం అలవాటు ఉంది. నేపథ్యగాయని కావాలనే కోరిక మనసులో వుండేది. అందువల్ల కర్ణాటక, హిందుస్తానీ సంగీతాలను కొంత వరకూ నేర్చుకున్నాను. మొట్టమొదట పాటను కూడా కన్నడ చిత్రంలోనే పాడాను. ఆ సమయంలో ఓ రోజున టీవీ లో ఎంటీవీ మ్యూజిక్ అవార్డ్స్ కార్యక్రమాన్ని చూడటం తటస్థించింది. ప్లేబ్యాక్ సింగర్‌గా కంటే పాప్‌సింగర్‌గా రాణిస్తే బాగుంటుందనే ఆలోచన కలిగింది. నేనూ ఎంటీవీ పాప్ సింగర్‌గా అవార్డు పొందాలనిపించి దాంతో అటువైపు దృష్టి నిలిపి 'హాయ్‌రబ్బా' పాప్ ఆల్బమ్ చేశాను. దాదాపు 50 సినిమా పాటలు పాడినా నాకు రాని గుర్తింపు తొలి పాప్ ఆల్బమ్ 'హాయ్‌రబ్బా' తెచ్చిపెట్టింది.

**తొలి ఆల్బమ్ సక్సెస్ మీకు సంతృప్తిని కలిగించిందా?**

- లేదు. ఎందుకంటే - తెలుగులో ఆ రకమైన క్వాలిటీ ఆల్బమ్‌ను అంతకు ముందు ఎవరూ చేయలేదు కాబట్టి నాకు గుర్తింపు బాగానే వచ్చింది కానీ- మా ఎఫర్ట్‌కి తగ్గ ప్రతిఫలం మాత్రం దక్కలేదు. దానికి అందించిన ట్యూన్స్, వీడియో పిక్చరైజేషన్, రికార్డింగ్ క్వాలిటీ ఇవన్నీ బాగా కుదిరాయి. నా అంచనా ప్రకారం మేం కేవలం 40 శాతం సక్సెస్ మాత్రమే పొందగలిగాం. ఈ ఆల్బమ్‌కి 'శ్రీ' సంగీతాన్ని సమకూర్చారు. ముంబైకి చెందిన హేమంత్ వీడియోకి దర్శకత్వం వహించారు. 1999వ సంవత్సరం ఆఖరులో అది విడుదలైంది. ఆ తర్వాత ఐదారు నెలలకు తెలుగులోనూ విడుదల చేశాం. ఈ రెండు భాషల్లోనూ కలిపి లక్షకు పైగా క్యాసెట్స్ అమ్ముడు పోయాయి. అప్పటి వరకూ ఏ ప్రైవేట్ ఆల్బమ్ 20 వేలను మించి అమ్మకం జరపలేదని తెల్సింది.

**ఆ స్థాయి సక్సెస్‌ను రెండో ఆల్బమ్ 'హాయ్ రామా' పొందక పోవడానికి కారణం?**

- నా వరకూ నాకు 'హాయ్ రామా' టైటిల్ సాంగ్ అద్భుతంగా నచ్చింది. ఈ ఆల్బమ్‌కి

కూడా 'శ్రీ' సంగీతాన్నిచ్చారు. చాలా చక్కటి ఆల్బమ్ ఇది. అయితే వీడియోలో కాస్త సీరియస్‌నెస్ ఎక్కువ కావడంతో అది ప్రేక్షకుల్ని అలరించలేదు. దాని ప్రభావమే 'సేల్స్‌మీద పడింది. ఇదే ఆల్బమ్‌ను తెలుగులో 'కోకిలమ్మ' పేరుతో విడుదల చేశాం.

**❂ కొన్ని పాప్ సాంగ్స్ బైట పాపులర్ అయ్యాక సినిమాల్లో చోటుచేసుకోవడం జరిగింది. అలా మీ ఆల్బమ్స్ గురించి మీరు ఆలోచించలేదా?**

-'హాయ్‌రబ్బా' ఆల్బమ్ విడుదలైన సమయంలో కొందరు దర్శక, నిర్మాతలు నన్ను ఆ పాట తమ సినిమాల్లో ఉపయోగించుకుంటామని అడిగారు. కానీ ఆ సమయంలో నేను అంగీకరించలేదు. ఆ ఆల్బమ్‌కి వున్న ఇండివిడ్యువాలిటీ పోతుందేమో అనిపించేది. కానీ 'హాయ్ రామా' వంటి మంచి ఆల్బమ్ ప్రేక్షకుల్ని చేరటంలో విఫలమైన తర్వాత - చాలామంది 'దీనిని సినిమా వాళ్లకి ఇచ్చి వుంటే ఎంతో బాగుండేది' అని అన్నారు. మంచి బ్యానర్‌లో , మంచి నిర్మాతలు కోరితే ఈ ఆల్బమ్‌లోని పాటల్ని ఇవ్వాలనే నిర్ణయానికి ఇప్పుడే వచ్చాను.

**❂ పాప్ గాయనిగా పేరు తెచ్చుకున్న మీరు, నేపథ్య గాయనిగా వెనకపడటానికి కారణం?**

-అవకాశాలు ఇవ్వమని నేనెవరి వెనకా పడకపోవడమే అసలు కారణం. సినిమా రంగంలో - ముఖ్యంగా సంగీత రంగంలో 'గాడ్‌ఫాదర్' తప్పని సరిగా వుండాలి. లేకపోతే నా పరిస్థితే అవుతుంది. కెరీర్ ప్రారంభమైన సమయంలో నేను కొందరిని అవకాశాలు ఇమ్మని అప్రోచ్ అయ్యాను. 'హాయ్‌రబ్బా' ఆల్బమ్ వచ్చాక - గాయనిగా నేనేమిటో ఆ పాటలే చెబుతాయి కాబట్టి ఇక అవకాశాల కోసం అడగటం మానేశాను. అయినా ఇవాళ ప్రతి సంగీత దర్శకుడికీ తనకంటూ కొందరు సింగర్స్ ఉన్నారు. వాళ్లని కాదని బైట వారికి అవకాశం ఇవ్వడం - అసాధ్యంగా కనిపిస్తోంది. ఆ గుంపులోకి ఎలాగోలా చేరాలని నేనను కోవడంలేదు.

**❂ మరి మిమ్మల్ని ప్రోత్సహిస్తున్న సంగీత దర్శకులు ఎవరు?**

చక్రి, కీరవాణి గార్లు ఎంతో ప్రోత్సహిస్తున్నారు. ముఖ్యంగా కీరవాణి గారి సహకారం మాత్రం మర్చిపోలేను. ఆయన సంగీత దర్శకత్వంలో నేనిప్పటికి పాడింది మూడు పాటలే అయినా - ఒకదానికి ఒకటి సంబంధం లేని పాటలవి. నా వాయిస్ మెలోడీకి సెట్ అవుతుందని ఆయన నమ్మకం. ఇటీవల విడుదలైన 'మా అల్లుడు వెరీగుడ్'లో ఆయనతో కలసి 'పడక పడక....' అనే యుగళ గీతం పాడాను. నేను పాడిన సినిమా పాటల్లో నాకు బాగా నచ్చిన పాట అది. 'స్మితా నీతో అన్ని రకాల పాటలు పాడిస్తాను' అని ఆయన చెప్పారు. కాబట్టి మరిన్ని మంచి పాటల్ని, విభిన్నమైన పాటల్ని శ్రోతలు నానుండి ఆశించవచ్చు.

**❂ పరభాషా గాయకుల మీద మీ అభిప్రాయం?**

- నేను హైదరాబాద్‌లో కాకుండా ముంబైలో మకాం పెట్టి వుంటే - తప్పకుండా తెలుగులో గాయనిగా ఇంతకంటే మంచి పొజిషన్‌లో ఉండేదాన్ని. మన వాళ్లకి 'పొరుగింటి పుల్లకూర రుచి' అనే సామెత నూటికి నూరు శాతం వర్తిస్తుంది. మరే ప్రాంతంలోనూ ఇంతగా పరభాషా గాయనీ గాయకుల మీద అభిమానాన్ని మనం చూడం. నా పాప్ ఆల్బమ్స్ హిందీలో విడుదలైనా - నాకు అక్కడ హిందీ సినిమాల్లో పాడే అవకాశం రాలేదు. బహుశా ముంబైలో సెటిల్ అయ్యి - ప్రయత్నించి ఉంటే వచ్చేవేమో తెలియదుగానీ - ఇక్కడనుండి తీసుకెళ్లి పాడించుకుందామని అక్కడివాళ్లు అనుకోరు. కానీ మన వాళ్లు మాత్రం - ఎక్కడెక్కడి నుండో

> **'శివమణి'లో 'ఏలో ఏలో...', గంగోత్రిలో 'మావయ్యది మొగల్తూరు', 'అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి' లో 'తళుకు తళుకు', 'ఈ అబ్బాయి చాలా మంచోడు' లో ' నవ మల్లిక నేనై వచ్చానె..' తదితర పాటలతో సహా దాదాపు 50 నేపథ్య గీతాలను ఆలపించిన స్మిత దేశ విదేశాలలో వందకి పైగా స్టేజ్ షోలను ఇచ్చింది. 'ఆలాపన' సౌత్ ఇండియన్ మ్యూజిక్ అవార్డ్స్ నుండి ఉత్తమ పాప్ సింగర్‌గానూ, 'మా' సినీ అవార్డ్స్ నుండి వ్యూయర్స్ ఛాయిస్ బెస్ట్ పాప్ సింగర్ అవార్డుల్ని స్మిత ఇంత వరకూ పొందింది.**

పరభాషా గాయనీగాయకుల్ని వెతికి తెచ్చి పాడిస్తుంటారు.

**❂ మీది చాలా హస్కీవాయిస్. ఇది వరమా...శాపమా?**

- అటువంటిదేమీ లేదు. ఈ వాయిస్‌లో సాఫ్ట్ మెలోడీలు - బీట్ ఓరియెంటెడ్ మెలోడీలు కూడా పాడాను. 'పాప్ సింగర్ అనగానే 'హస్కీ పాటలకైతేనే బాగుంటుంది. వాటికే ఈ అమ్మాయి గొంతు సూట్ అవుతుంది' అని మ్యూజిక్ డైరక్టర్స్ ఫిక్స్ కావటం వల్ల ఆ తరహా పాటలు వచ్చాయి. ఆ ఇమేజ్‌లోంచి బయటకు వచ్చే ప్రయత్నం చేస్తున్నాను.

**❂ కొత్త బాణీలతో, చక్కగా పాటలు పాడుతూ, వున్నట్టుండి రీ -మిక్స్ వైపు మళ్లారెందుకు?**

-ప్రస్తుత సమయంలో రీ - మిక్స్‌కి ఉత్తరాదిన మంచి డిమాండ్ వుంది. ఆ డిమాండ్ దక్షిణాదిన వున్నా - ఇంతవరకూ ఈ మార్కెట్‌ని - కాప్చర్ చేయటానికి ఎవరూ సిద్ధం కాలేదు. సో - రీ మిక్స్‌లో ఓ గ్రాండ్ సక్సెస్‌ను పొందవచ్చు అనే ఆలోచనతోనే 'మసక...మసక చీకటిలో' ఆల్బమ్ ప్రారంభించాం.

**❂ అంటే ఈ ఆల్బమ్‌లో ఎల్లారీశ్వరి పాటలే ఉంటాయా?**

-టైటిల్‌ని బట్టి ఆ అభిప్రాయం కలగటం సహజం. నిజానికి ఈ ఆల్బమ్‌లో ఎల్.ఆర్. ఈశ్వరివి రెండు పాటలే ఉన్నాయి. మరో రెండు పాటలు జమునా రాణివి. ఇంకో పాట పి.సుశీలది. ఈ పాటలకి హరీ ఆనంద్ తిరిగి ఆర్కెస్ట్రయిజేషన్ పరంగా స్వరాల్ని సమకూర్చారు. ఒక పాటలో రవివర్మ నాతో గొంతు కలిపారు. ఇక ఈ పాటల్ని ఎంచుకోవడానికి కారణం తొలి యత్నంలోనే సక్సెస్ పొందాలని. ఫాస్ట్ నెంబర్స్‌కి ఆదరణ తొందరగా లభిస్తుంది. పైగా మేం ఎంపిక చేసిన ఐదు పాటలూ- బాగా పాపులర్ అయినవే. ముందు ఈ ఆల్బమ్‌తో సక్సెస్ సాధిస్తే- మరోసారి మరో తరహా పాటలతో మళ్లీ శ్రోతలు, వీక్షకుల ముందుకు వెళ్తాను. అసలు - రీ మిక్స్ చేయాలని అనుకోగానే - ముందు ఎల్.ఆర్.ఈశ్వరి గారి 'మసక....మసక చీకటిలో..' పాటే మాకు తట్టింది. ఆవిడ గొంతంటే నాకెంతో ఇష్టం. సౌత్ ఇండియన్ ఆశాభోంస్లే ఆవిడ. ఆవిడదే మరో పాట 'మాయదారి సిన్నోడు', పి.సుశీల పాడిన 'మొక్కజొన్న తోటలో...', జమునారాణి పాడిన ' మావా...మావా....మావా' పాటల్ని ఎంపిక చేశాం. ఈ ఆల్బమ్‌లో ఆఖరుగా చేరిన పాట 'ముక్కుమీద కోపం...' అయితే ఈ పాటే అన్ని పాటల కంటే చాలా బాగా వచ్చిందని నాకనిపించింది.

**❂ ఈ అచ్చ తెలుగు పాటలకి హరీ ఆనంద్‌తో రీ - మిక్స్ చేయించారెందుకు?**

-ఉత్తరాదిలో హరీ ఆనంద్ ఇవాళ హాట్ ఫేవరేట్....'కాంటా లగా' ఆల్బమ్‌తో సహా వరుసగా ఆరు సూపర్‌హిట్ రీ - మిక్స్‌లను ఆయన అందించారు. ఆయన కున్న ఇమేజ్,రీ-మిక్స్ లో వున్న అనుభవం మా ఆల్బమ్‌కి ఉపయోగపడుతుందనే ఆయనతో వర్క్ చేయించుకున్నాం. ఇవే ట్యూన్స్‌కి పాటలను హిందీ లో రాయించి ఆ ఆల్బమ్‌ను వచ్చే ఫిబ్రవరి, మార్చిలో విడుదల చేస్తాం.

**❂ మరి ఎంటీవీ అవార్డ్ కోరిక ఎప్పుడు తీరుతుంది?**

- రాబోయే ఆల్బమ్‌తో ఆ కోరిక తీర్చుకోవాలి. అందుకోసం కృషి చేస్తున్నాను. ఆ టార్గెట్ రీచ్ కావాలన్నదే గాయనిగా బలమైన కోరిక.

**❂ మొదట రెండు ఆల్బమ్స్ మీరు సొంతంగా విడుదల చేసి - ఇప్పుడు ఆదిత్యా మ్యూజిక్‌కి ఇవ్వడానికి కారణం?**

-ఈ కాన్సెప్ట్ చెప్పగానే ఆదిత్యా సంస్థ వారు అభినందించారు. మాకు మంచి ఆఫర్ ఇచ్చారు. అన్ని రకాలుగా ఆ ఆఫర్ బాగుండటం - పైగా మార్కెటింగ్ నెట్ వర్క్ వాళ్లకి బలంగా ఉండటంతో పంపిణీ హక్కుల్ని ఇచ్చాం. తప్పకుండా మా టార్గెట్‌కి ఈ ఆల్బమ్ రీచ్ అవుతుందనే నమ్మకం ఉంది.

**❂ రీ-మిక్స్‌లో పాడటం వల్ల మీ ఇండివిడ్యువాలిటీని కోల్పోతున్నారేమో?**

-అటువంటిదేమీ లేదు. పాటలో లిరిక్స్, ట్యూన్ పాతవే అయినా గొంతు, నేపథ్యంలో విని యోగించే వాయిద్యాలు అన్నీ కొత్తవే. ఇదీ ఒక రకంగా క్రియేటివిటినే! ఇటువంటి పాటలు పాడటం ఓ రకంగా గర్వంగానూ అనిపిస్తుంది. అంతమంచి పాటల గురించి ఈ తరం వారికి పెద్దగా తెలియదు. ఆ పాటలని నా ద్వారా ఈ తరం వినడం, ఆ అవకాశాన్ని మేం కల్పించడం... ఓ కరంగా గ్రేట్ ఫీలింగ్. కాబట్టి రీ - మిక్స్ వల్ల వ్యక్తిత్వాన్ని - సొంత దనాన్ని కోల్పోయామనే భావనే

## స్మిత తాజా ఆల్బమ్ 'మసక మసక...'లోని పాటల పూర్వాపరాలు




'దేవుడు చేసిన మనుషులు' చిత్రం కోసం ఆరుద్ర రాయగా రమేష్‌నాయుడు స్వర పరిచిన 'మసక మసక చీకటిలో' పాట ఈ రీమిక్స్ ఆల్బమ్‌లో మొదటిది. దీని తర్వాత 'మొక్కజొన్న తోటలో....' పాట వస్తుంది. ఈ జానపద గీతాన్ని కొనకళ్ల వెంకటరత్నం రచించగా -'అదృష్ట వంతులు' చిత్రం కోసం కె.వి.మహదేవన్ స్వరపరిచారు. అంతకు ముందు ఈ పాటనే 'సిపాయి కూతురు' చిత్రం కోసం ఎం.సుబ్రహ్మణ్యరాజు స్వర పరిచారు. ఈ రెండు సినిమాల్లోనూ ఆ పాటను పి.సుశీలే పాడారు. అయితే స్మిత కె.వి.మహదేవన్ బాణీలనే అనుసరించింది. మూడవ పాట 'మంచి మనసులు' కోసం కొసరాజు రాసిన 'మావ..మావ...' గీతం. సినిమాలో దీనిని జమునారాణి, ఘంటసాల పాడగా, మహదేవన్ స్వరపరిచారు. ఆ పాటను ఈ రీమిక్స్ ఆల్బమ్‌లో స్మితతో పాటుగా రవివర్మ పాడారు. నాలుగవ పాట 'అమ్మమాట' కోసం సినారె. రాయగా రమేష్‌నాయుడు స్వర కల్పనలో ఎల్.ఆర్.ఈశ్వరి పాడిన 'మాయదారి చిన్నోడు' పాట. ఐదవపాట 'మూగమనసులు' కోసం ఆత్రేయ రాయగా, కె.వి.మహదేవన్ స్వరపరిచిన 'ముక్కుమీద కోపం' పాట. ఈ పాటను సినిమాలో జమునారాణి గానం చేసింది. ఈ ఐదు పాటలతో పాటుగా 'మసక....మసక' పాట మరో వెర్షన్‌ను కూడా ఈ రీమిక్స్ ఆల్బమ్‌లో పొందుపరిచారు. ఈ పాటలకి మలి ట్యూన్స్ కట్టింది హరీ ఆనంద్ కాగా, ముంబైకి చెందిన రాహుల్ సూద్ దర్శకత్వంలో 'మసక..మసక చీకటిలో' పాటని స్మితతో పాటు మరికొందరు డ్యాన్సర్స్‌పై ముంబై ఫిల్మ్‌సిటీలో వేసిన సెట్‌లో చిత్రీకరించారు.

కలగదు. ఇవన్నీ కూడా మేం కాపీరైట్ యాక్ట్‌కు లోబడే చేస్తున్నాం. కాబట్టి సమస్యే లేదు.

**గతంలో ఓ సారి నటన మీద ఆసక్తిలేదని - తెరమీద కనిపించనని చెప్పారు. మరి వెంకటేశ్ హీరోగా నటిస్తున్న 'మల్లీశ్వరి' లో నటిస్తున్నారెందుకు?**

- నిజమే- అప్పట్లో నటనమీద పెద్దగా ఆసక్తి లేదు. కొందరు దర్శక నిర్మాతలు అడిగినా - సారీ చెప్పాను. సినిమారంగంలో ఇంత కాలం అనుబంధం పెంచుకున్న తర్వాత, దేశ విదేశాలలో పలు స్టేజ్ షోలు ఇచ్చాక - నాకు నచ్చిన పాత్ర ఏదైనా లభిస్తే ఎందుకు చేయకూడదూ! అనిపించింది. 'నటిద్దాం' అని నేను అనుకోగానే లభించిన మొదటి చిత్రం 'మల్లీశ్వరి'. అందులో 'కత్తి' లాంటి పాత్ర చేస్తున్నాను. సెకండ్ హాఫ్ నుండి నా పాత్ర ఎంటర్ అవుతుంది. అవుట్ అండ్ అవుట్ నెగిటివ్ షేడ్స్ వున్న పాత్ర. నిజంగా ఆ పాత్ర చేస్తూ బాగా ఎంజాయ్ చేస్తున్నాను.

**నటిగా నెగిటివ్ పాత్రతో పరిచయమైతే - అవే తరహా పాత్రలు వస్తాయేమో?**

- నేనలా అనుకోవడం లేదు. ఆ పాత్ర ద్వారా నాలోని టాలెంట్ ను పరిశ్రమ గుర్తిస్తే - వైవిధ్యమైన పాత్రలను నా కివ్వడానికి ముందుకొస్తుందనే నమ్మకం ఉంది. ఈ సినిమా విషయంలో ఈ పాత్ర పోషణలో దర్శకులు విజయభాస్కర్, కెమెరా మెన్ సమీర్ అందిస్తున్న సహకారం మర్చిపోలేను. సినిమాతో సంబంధం లేకుండా మంచి మిత్రుల్లా వాళ్లు సలహాలిస్తున్నారు.

**నటిగా ఏ తరహా గుర్తింపును మీరు కోరుకుంటున్నారు?**

-నందితాదాస్ అంటే నాకెంతో ఇష్టం. ఆమె కొన్ని బోల్డ్ క్యారెక్టర్స్ చేసింది. అటువంటి పాత్రలు కాక పోయినా - కాస్త వైవిధ్యమైన పాత్రలు చేయాలని వుంది. ఇక మనవాళ్ల విషయానికొస్తే 'స్వర్ణ కమలం' లో భానుప్రియ చేసిన పాత్ర - నాకెంతో నచ్చింది. ఎన్ని సార్లు చూసినా ఆమె నటన బోరు కొట్టదు. అటువంటి పాత్ర చేయాలని వుంది.

**గాత్రం...నటన...స్టేజ్ షోలు...ఇవి చాలవన్నట్టు కొత్తగా బిజినెస్‌లోకి ప్రవేశించారెందుకు?**

- అవును. మొదటనుండీ నాకు క్షణం తీరిక లేకుండా వుండటమంటే ఇష్టం. గాయనిగా 365 రోజులు బిజీగా వుండలేను కాబట్టి, స్టేజ్ షోలు, నటన మీద దృష్టి నిలిపాను. మా అమ్మ, నాన్నగారు మొదటీ నుండీ బిజినెస్ పీపుల్. వాళ్ల అడుగు జాడల్లో నడుస్తూ - బిజినెస్ చేయాలను కున్నప్పుడు... నేననుకున్న తరహాలో ఓ హెయిర్ అండ్ బ్యూటీ పార్లర్ హైదరాబాద్‌లో లేదు కదా అనిపించింది. మా అమ్మకి చెబితే వెంటనే ప్రారంభించమని ప్రోత్సహించింది. అనుకున్న నాలుగు నెలల్లోనే దీనిని ప్రారంభించాం. డిసెంబర్ 3 న నాగార్జున గారు మా 'బబుల్స్ హెయిర్ అండ్ బ్యూటీ పార్లర్' ని ఓపెన్ చేశారు. ఈ ఫీల్డ్‌లో వున్న స్నేహితుల సంపూర్ణ సహకారం వల్లే ఈ బిజినెస్‌లోకి వచ్చాను.

**మీ కెరీర్ ప్లానింగ్‌లో మీ వారి పాత్ర ఏమిటి?**

- గత సంవత్సరం అక్టోబర్‌లో శశాంక్‌తో నా మ్యారేజ్ అయింది. వాళ్లది కూడా బిజినెస్ ఫ్యామిలీనే. పెళ్లికి ముందు నుండే పరిచయం వున్న కుటుంబం మాది. నాకెరీర్ ప్లానింగ్ మొత్తం నా ఇష్ట ప్రకారమే జరుగుతుంది. ఆయన జోక్యం చేసుకోరు - పైగా కెరీర్ విషయంలో ఎప్పుడూ నన్ను ప్రోత్సహిస్తూ వుంటారు.

**ఇంతకీ మీ కిష్టమైన గాయనీ గాయకులు....?**

- ఆశాభోంస్లే, చిత్ర, హరిహరన్, శంకర్ మహదేవన్....

- చంద్రలేఖ



రచన: భాస్కరభట్ల (1) గానం: చక్రి

ప: ఓ మగువా నీతో స్నేహం కోసం ఎంతో ట్రయ్ చేశా...
కాళిదాసులాగ మారి కవితే రాసేశా!
ఓ మగువా నీతో స్నేహం కోసం ఎంతో ట్రయ్ చేశా
దేవదాసులాగ మారి గెడ్డం పెంచేశా!
ఫుడ్ లేకపోయినా బెడ్ లేకపోయినా ॥2॥
పగలు రాత్రి వెదికీ వెదికీ నీకే లైనేశా.... ॥ఓ మగువా ॥

చ: ట్రిపుల్ ఎక్స్ రమ్ములోన కిక్కులేదు హల్లో మైనా..
నీ లుక్కే చూడబోతే మత్తులోకి దించేనా...
సన్‌లైట్ వేళనుంచీ మూన్‌లైట్ వెళ్లేదాకా
ఫుల్ టైమ్ నా గుండెల్లో థాట్‌లన్నీ నీవేగా...
ఓ లలనా ఇది నీ జాలమా.. నీ వలన మనసే గాయమా...
కుదురేమో లేదాయే...నువు నమ్మవుగానీ కలవరమాయె
ఓ మగువా....ఓ మగువా..ఓ మగువా...ఏయ్ ॥ఓ మగువా॥

చ: కో అంటే కోటి మంది అందగత్తెలున్నా గానీ
నీ జంటే కోరుతుంటే దంచుతావే కారాన్ని
క్రేజీగా ఉంటే చాలు ప్రేమలోన పడతారండీ
ట్రూ లవ్వే చూపుతుంటే పెంచుతారు దూరాన్ని
ఓ మగువా నీకే న్యాయమా ఎదలో ప్రేమే శాపమా
మనసేమో బరువాయె...నీ మాటలు లేక మోడైపోయె
మగువా....ఓ మగువా... ఓ మగువా... ॥ఓ మగువా॥

రచన: వెంకీ, రాజేష్ (3) గానం: వెంకటరమణ, సూర్యకిరణ్, రాజేష్

ప: రెండు మొక్కజొన్న పొత్తులున్నాయ్ తిందువా
మా వాడి వేడి నాటు దెబ్బ సూత్తువా ॥రెండు॥
దమ్ములున్న మగాడదిగో వచ్చెరా... వచ్చెరా
దుమ్ముదులిపేయడమే నెక్కురా...నెక్కురా
రాతిరి పదిగంటలకు సత్తమన్న దెబ్బలకు
లైటేస్కో హో లైటాప్కో హో లైటేస్కో హో లైటాప్కో,
లైటేస్కో లైటాప్కో... లైటేస్కో, లైటాప్కో,
వేసేయ్....వేసేయ్..వేసేయ్....వేసేయ్....వేసేయ్
రెండు మొక్క....రెండు మొక్క...రెండు మొక్క....
రెండు మొక్క...ఏయ్..ముందుకెళ్లెహె ॥రెండు॥

చ: బీరేసేయ్..బాదేసేయ్ జిన్నేసేయ్ దున్నేసేయ్
రమ్మేసేయ్, రక్కేసేయ్, విస్కేసేయ్, పిస్కేసేయ్
బాదేసేయ్, రమ్మేసేయ్, దున్నేసేయ్, పిస్కేసేయ్
వేసేయ్, వేసేయ్, వేసేయ్, వేసేయ్.... ॥రెండు॥
ఒకటిపీకు రెండుపీకు మూడుపీకు
ఒకటిపీకు రెండుపీకు ఆపు పీకు ఫుల్లు పీకు
వీగ్గా ఉన్నావ్, రెండు పెగ్గుపీకుతావా!థాంక్స్ అన్నా ॥రెండు॥
అబ్బా...అబ్బా...అబ్బా....ఏం దెబ్బ...
ఎందుకబ్బా....ఎప్పుడబ్బా....ఎలా అబ్బా...ఏం దెబ్బ
ఎప్పుడబ్బా ఎలా అబ్బా..ఎక్కడబ్బా...ఇక్కడబ్బా
చాలా ముద్దుగా చెప్పావే... నీయవ్వ ॥రెండు॥

రచన: కందికొండ (4) గానం: శంకర్ మహదేవన్

ప: మధురమె...మధురమె మధురమె
ఈ కనులకి కలలు మధురమే
సెలయేటికి అలలు మధురమే
నీలాల మేఘం నువ్వై నీ నవ్వే తేనెల వానై
నా కోసం వస్తే మధురమే... ఆ..ఆ..
నన్నే తడిపేస్తే మధురమే ॥మధురమే॥

చ: నీ కోసం నే రాసే చిరుపాటైనా మధురమే
నా కోసం నువ్ పలికే అరమాటైనా మధురమే ॥నీ కోసం॥
లిపిలేని సడిలేని ఆ కన్నుల బాష మధురమే
హృదయాన్ని మురిపించే ఆ సాగర ఘోష మధురమే
మధుమాసం మధురమే
నీ దరహాసం మధురమే
ఉంటే నువ్వుంటే ఆ శూన్యం
అయినా మధురమే..మధురమే... ॥మధురమే॥

చ: సఖి విడిచే శ్వాసల్లో పరిమళమెంతో మధురమే
చెలి నడిచే దారుల్లో మట్టిని తాకినా మధురమే ॥సఖి॥
ఉదయాన ఉదయించే ఆ సూర్యుడి ఎరుపు మధురమే
రేయంతా వికసించే ఆ వెన్నెల తెలుపు మధురమే
చెక్కిలి మెరుపు మధురమే
చెలి కాటుక నలుపు మధురమే
రాల్చే కనురాల్చే ఆ కన్నీరైనా
మధురమే...మధురమే....॥మధురమే॥

రచన: విశ్వ (2) గానం: విశ్వ, కౌసల్య

అ: కుచ్ కుచ్ హోనా హై తో fix it చక చక చక చక Just do it
ఏస్కో చేస్కో we don't get it దునియా మనదేరా Damn it

ఆ: Fix it do it get it Jaani
You make your rules Honey
Gonna make things happen truly
No one can stop you really
మాటలొద్దురా... ఓ సారి చేసి చూపరా

కో: Just do it కొత్త దారిలో ఓ మారు దూసుకెళ్లరా...

అ: నీ చేతల్లోన తెగువే ఉంటే విజయం నీ సొంతం
నీ చెమటే చిందగ వచ్చిన ఫలితం ఇచ్చును ఆనందం..॥కుచ్..॥

అ: Yo Yo she got me got me
day and night she got me got me
day and night.....scratch my shoulder
when this is old

ఆ: నడి సంద్రపు లోతుల్లో కడదాకా మునిగేవో
ముత్యాలను వెలికే తెచ్చి వెలగాలంటా నీవు

కో: కొట్టినా తిట్టినా గెలవాలిరో గెలిస్తే అందరు ఎనకాలరో

అ: ఇల తాకిన బంతైనా రెండింతలు పైకెగసి
ఆకాశపు అంచే తాకి తేలేనంటా చూడు...

ఆ: You can make it through strength is within you
Sky is the limit for you

అ: Gonna make a move now and take a chance now
To make our dreams come true

ఆ: నీ చేతల్లోన తెగువే ఉంటే విజయం నీ సొంతం
నీ చెమటే చిందగ వచ్చిన ఫలితం ఇచ్చును ఆనందం.. అ॥కుచ్॥

ఆ: పసి మనసే elementary బ్రతుకాటలో new entry
ఉదయించే కిరణం కోసం చూసేనే పైకెసి

అ: ప్రేమా దోమా alpha beta gama అత్తా మామా పక్కింటి భామా

ఆ: వయసంతా గడిపేసి జీవితమే నడిపేసి
వెనకొకటే చూస్తారంట ముసలాళ్లంతా నవ్వేసి

అ: Young generation, have got a vision
నడిచేరూ ముందుకు చూస్తూనే....
We'll move the nation Create sensation
ఎదురేది లేదని అంటూనే

ఆ: నీ చేతల్లోన తెగువే ఉంటే విజయం నీ సొంతం
నీ చెమటే చిందగ వచ్చిన ఫలితం ఇచ్చును ఆనందం.. అ॥కుచ్॥

రచన: కందికొండ (5) గానం: వేణు

ప: I am in love with u I am in love with u
కనులలో దాచిన కావ్యమే నువ్వు
కావేరీ కదిలితే మేఘాలు ఉరిమితే
మనసులో నువ్వే.... ఆ నింగి కరిగితే
ఈ నేలా చేరిన చినుకువే నువ్వే
గుండెలో చిరుకలవరం తొలిసారిగా నువ్వే
అర్పితం ఈ జీవితం నిను చేరడం కొరకే ॥I am॥
చ: కోటి కలలను గుండెలోతుల్లో దాచి ఉంచిన నేస్తమా...
వేయి అలలుగా నిన్ను చేరక కదులుతున్న ప్రాణమా...
వెన్నెల్లో గోదారి నువ్వే నా వయ్యారి నే నీటి చుక్కై పోవాలి
నవ్వేటి సింగారీ వెళ్లొద్దు చేజారి నిను చేరి మురిసిపోవాలి
చిగురాకు నువ్వై చిరుజల్లు నేనై
నిను నేను చేరుకుంటే హాయి ॥2॥
చ: నీవు ఎదురుగా నిలిచి ఉండగా
మాట దాటదు పెదవిని...
నన్ను మృదువుగా నువ్వు తాకగా
మధువు సోకెను మనసుని...
నీ చెంత చేరాలి స్వర్గాన్నే చూడాలి
నే నీలో నిండిపోవాలి నీ కంటి చూపుల్లో
నీ ప్రేమ వానల్లో నిలువెల్లా నేనే తడవాలి
నాలోని ప్రేమ ఏనాటికైనా
నీకే అంకితమవ్వనీ... నీకే అంకితమవ్వనీ... ॥I am॥

రచన: భాస్కరభట్ల (6) గానం: చక్రి, రవివర్మ, రమేష్, పల్లవి

అ: పిలిచిన పలకదు ప్రేమా....
వలచిన దొరకదు ప్రేమా....
అందని వరమే ప్రేమా
మనసుకు తొలి కలవరమా
ప్రేమే మధురం, ప్రేమే పదిలం,
ఏమీ కాదు క్షణికం అన్నీ తానే ప్రణయం
ఆ: I Love u...Love రా...
I Love U...Love U రా
I Love U...Love U రా ॥పిలిచిన॥
అ: వలపును చినుకుగా భావించా అది నా తప్పుకదా !
వరదని తెలిసిన ఈ తరుణం యాతన తప్పదుగా
ఎన్నేళ్లో ఎదురీత... ఎన్నాళ్లీ ఎదకోత
ప్రేమే ఆట కాదు.... గెలుపు ఓటమి లేదు
లాభం నష్టం చూడకు.... ప్రేమవదు
తప్పుంటే అది ప్రేమది కాదే తప్పంతా ప్రేమించిన నాదే
ప్రేమా....ప్రేమా....ప్రేమా....
ఆ: ప్రేమా....ప్రేమా....ప్రేమా.... అ: ॥పిలిచిన॥
అ: మనసును తరిమిన చీకటులే చెలిమిగ మారేనా
ఇది వరకెరుగని ఈ బాధే కొలిమై పోయేనా....
ఆపిలీ ఏదోలా చెబుతావా ప్రియురాలా !
నీడై నీతోపాటు సాగాలనుకున్నానే
నేడే తెలిసెను నాకు ఓ... చెలియా
నింగీ నేలా కలవవని
నీడే మనిషిని తాకదని ప్రేమా... ప్రేమా....ప్రేమా....
ఆ: ప్రేమా....ప్రేమా....ప్రేమా....
అ: ఆపిన ఆగదు ప్రేమా దాచిన దాగదు ప్రేమా
మనసును కలుపును ప్రేమా
మహిమలు చూపును ప్రేమా
అ: ప్రేమే ఆ: గగనం... అ: ప్రేమే ఆ: సహనం...
అ: ప్రేమే కాదా ఆ: ఉదయం
అ: ప్రేమించాలీ ఆ: హృదయం...
ఆ: I Love u...Love రా... I Love U...Love U రా

రచన: కందికొండ (7) గానం: వాసు, సూర్యకిరణ్, రాజేష్

అ: నాటు కొట్టుడు నీటు కొట్టుడు కలిపి కొట్టాలి
గగనం అదిరిపడి సూర్యుడే తొంగి చూడాలి
బీరు రమ్ము విస్కీ కొట్టి నిజం చెప్పాలి
అరెరే గుప్పెడంత గుండెవిప్పి ప్రేమ పంచాలి...
ఓరి దేవుడా....లోకం మారెరా....
ఓరి దేవుడా....లోకం మారెరా
కో: ఓరి దేవుడా....లోకం మారెరా....
ఓరి దేవుడా....లోకం మారెరా॥2॥
అ: స్లీవ్‌లెస్సు మిడీస్కర్టు సిటీ పాపలూ
అబబ్బా పబ్బులలో మందుకొట్టి కల్చరంటారు...
ఇంగ్లీష్ కల్చరంటారు...
కనపడితే పార్టీ అని కౌగిలిస్తారు...
పార్టీ ముగిసినాక దొంగ ముఖం చాటేస్తారూ....
అరెరే చాటేస్తారు....ఓరి దేవుడా....లోకం మారెరా
కో: ఓరి దేవుడా....లోకం మారెరా...
ఓరి దేవుడా....లోకం మారెరా
అ: బెంజ్ కారు రోడ్డు నడుమ వెళ్తుంటుంది
రోడ్డు వేసినోడు రోడ్డుసైడు జీవిస్తాడు.... గుడిసెలో జీవిస్తాడు..
చిన్న గుడిసెలోన పెద్ద మనసుంటుంది..
పెద్ద ప్యాలెస్‌లో డబ్బు తప్ప ఏముంటుంది....
ప్రేమే కరువౌతుంది...ఓరి దేవుడా....లోకం మారెరా
కో: ఓరి దేవుడా....లోకం మారెరా....
ఓరి దేవుడా....లోకం మారెరా
అ: ఓరి దేవుడా....లోకం మారెరా.....
ఎండ వున్నంత వరకే నీడకు విలువ
మరి ఊపిరున్నంత వరకే మనిషికి విలువ
రేపో మాపో పోయేటి ఊపిరి కోసం
మరి ఎందుకు గొడవా స్నేహం చెయ్యర గురువా...
ఓరి సోదరా....ఎంజాయ్ చెయ్యరా... ॥2॥
కో: ఓరి సోదరా....ఎంజాయ్ చెయ్యరా... ॥2॥ చెయ్యరా
అ: అలా గుద్దు ఇలా గుద్దు
ఉత్తర్ సాల్ట్ కమాయ్ తోడు స్వీచర్ ల్యాండింగ్
అలా..ఇలా...అలా..ఇలా...
పర్స్ ఫుల్లు ఉంటేనే లవ్వంటారు నువ్వే ప్రాణమంటారు
హార్టు బీటు అంటారు...అబ్బబ్బా చంపేస్తారు
పుడ్డు, బెడ్డు, కిడ్డు అని కలరిస్తారు..
పర్స్ ఖాళీ అయితే చాలు కనుమరుగవుతారు
ఛీ..! ఛి..! ఛీ..!..ఫో అంటారు..
ఓరి దేవుడా.... లోకం చూడరా...
కో: ఓరి దేవుడా.... లోకం చూడరా...
ఓరి దేవుడా.... లోకం చూడరా...
అ: బైకు మీద షికారంటే నో అంటారు...
ఎ.సి.కారుంటే లేడీసే సై అంటారు
అబ్బా రా అంటారు
మెయిన్‌టెనెన్స్ తగ్గిపోతే బ్రదరంటారు
చేతిలో కార్డుపెట్టి తన పెళ్లికి రమ్మంటారు
అన్నయ్యా.... రా అంటారు..
ఓరి దేవుడా....లోకం మారెరా...
కో: ఓరి దేవుడా.... లోకం మారెరా......
ఓరి దేవుడా.... లోకం మారెరా...
దేవుడా...దేవుడా...దేవుడా...
దేవుడా...అయ్యయ్యో దేవుడా
దేవుడా ....ఓరి..ఓరి దేవుడా...
ఎక్స్‌క్యూజ్‌మి....నన్నెవరైనా పిలిచారా

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు
అన్నపూర్ణ స్టూడియోస్













నాగార్జున అక్కినేని ఆర్.సూర్యకిరణ్ చక్రి












## తారాగణం

సుమంత్, జెనిలియా డిసౌజా, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, కొండవలస లక్ష్మణరావు, తనికెళ్ళ భరణి, శ్రీధర్, రాజేష్, మల్లాది రాఘవ, నిర్మలారెడ్డి, వర్ష, నవీన్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సతీష్, రవి |
| ఫోటోగ్రఫీ | : సమీర్‌రెడ్డి రాజా |
| ఫైట్స్ | : విజయ్ |
| నృత్యం | : లారెన్స్, శంకర్, అశోక్‌రాజు, విద్య |
| ఆర్ట్ | : జె.కె.మూర్తి |
| ఎడిటింగ్ | : నందమూరి హరి |
| కాస్ట్యూమ్ | : శేఖర్ |
| మేకప్ | : బొమ్మదేవర రామచంద్రరావు |
| పబ్లిసిటీ | : కృష్ణ డిజిటల్స్ |
| పి.ఆర్.ఓ. | : యల్.వేణుగోపాల్ |
| సంగీతం | : చక్రి |
| నిర్మాత | : అక్కినేని నాగార్జున |
| కథ, స్క్రీన్‌ప్లే, డైరెక్టర్ | : ఆర్.సూర్యకిరణ్ |






## ఖండాతర ఖ్యాతి గడించిన 'మిస్ ఇండియా'

# మెహనాజ్

**చ**క్కటి గాత్రం, అభినయపటిమ వున్న వ్యక్తి అతి తక్కువ సమయంలో పాపులారిటీ పొందటంలో విశేషం వుండదు. అందువల్లే మెహనాజ్‌కి లభించిన ఆదరణ పట్ల ఎవరూ ముక్కున వేలు వేసుకోరు. 1996లో 'మిస్ ఇండియా' పాప్ ఆల్బమ్‌లో సంగీత ప్రపంచంలో తనదైన శైలిని తెలియచేసిన మెహనాజ్ అక్కడ నుండి అంచలంచలుగా ఎదుగుతూనే వుంది.

ముంబాయి మహానగరంలో పెరిగిన మెహనాజ్ చిన్నతనం నుండే గాయనిగా, నృత్యకారిణిగా పేరు తెచ్చుకోవాలని కృషి చేస్తూనే వుంది. మోడరన్ డాన్సర్‌గా శిక్షణను పొందింది. తొలి ఆల్బమ్ 'మిస్ ఇండియా'లోనే మెహనాజ్ ఇండీపాప్ సింగర్స్‌లో చక్కటి గాయనిగా గుర్తింపును, పేరును తెచ్చుకుంది. ఆ ఆల్బమ్‌లోని 'మైహూఁ...', 'మిస్ఇండియా' అనే టైటిల్‌ట్రాక్ ఆమెకి మంచి క్రేజ్‌ను తెచ్చిపెట్టాయి. అంతేకాదు ఆ యేడాది ఛానల్‌వి నుండి ఉత్తమ గాయనిగా అవార్డునూ సంపాదించిపెట్టాయి. ఒక్కసారి జాతీయస్థాయిలో ఈ ఆల్బమ్‌తో గుర్తింపు రావటంతో తన కెరీర్‌కు దానినే మెహనాజ్ పునాదిగా మలచుకుంది. మూడేళ్ళ పాటు విరామం లేకుండా లైవ్ షోలను మనదేశంలోని వివిధ నగరాల్లోనూ, విదేశాల్లోనూ ఇచ్చింది. స్వతహాగా డాన్సర్, మంచి సింగర్ కావటంతో ఆమె నిర్వహించే ప్రతి కార్యక్రమం గ్రాండ్ సక్సెస్ అవుతూనే వచ్చింది. దాదాపు నూట యాభై షోస్ నిర్వహించిన మెహనాజ్ అదే సమయంలో మిత్రులు వెలువరచిన ఆల్బమ్స్‌లోనూ పాటలు పాడింది. 'దుమా దుమ్ మస్తకలందర్', 'సంభాల్‌కే...', 'రఘుపతి రాఘవ రాజారామ్...' మంచిగా పాపులారిటీని పొందాయి. అలానే ఖైజాద్ గుస్తాద్ 'బొంబే బాయ్స్' కోసం మెహనాజ్ పాడిన 'పైసా పైసా పైసా' పాట కూడా క్లిక్ అయ్యింది. ఈ పాటకి అశుతోష్ పాఠక్, ధృవ్ ఘనేకర్ బాణీలు సమకూర్చారు.

### ఖండాంతర ఖ్యాతి

అంతర్జాతీయ ఖ్యాతి గడించిన 'ఎయిర్ సప్లయ్' గ్రూప్ కోసం మెహనాజ్ ఓ యుగళ గీతాన్ని ఆలపించటం విశేషం. 'యు ఆర్...' అంటూ సాగే ఈ పాటను దేవ్ బెనెగల్ రూపొందించిన 'స్ప్లిట్ వైడ్ ఓపెన్'లో ఉపయోగించుకున్నారు. ఈ పాటను 'ఎయిర్ సప్లయ్'కి చెందిన గ్రహమ్ రుస్సెల్ రాసి, తానే స్వరపరిచారు. అంతేకాదు ఇవాళ మలేషియా, సింగపూర్, ఇండోనేషియాల్లో కూడా మెహనాజ్‌కు గాయనిగా మంచి పేరుంది. ప్రముఖ మలేషియన్ గాయకుడు, సూపర్‌స్టార్ ఐవాన్‌తో కలిసి మలేషియన్ మ్యూజిక్ ఆల్బమ్‌లో మెహనాజ్ పాడింది. హిందీలోనూ వెలువడిన ఈ ఆల్బమ్ చుట్టుపక్కల దేశాలలో యువతను విశేషంగా ఆకట్టుకుంది.

ఈ విజయ స్ఫూర్తిలోనే మెహనాజ్ 'మౌసమ్' పేరుతో రెండో సోలో ఆల్బమ్‌ను విడుదల చేసింది. ప్రపంచ సంగీతంతో ఏర్పడిన సాన్నిహిత్యము, విస్తృతంగా చేసిన పర్యటన - జీవితానుభవ ప్రభావం ఈ 'మౌసమ్' ఆల్బమ్ మీద ఎక్కువగా వున్నాయి. పాటల ఎంపికలోనే కాకుండా గాయనిగా కూడా మెహనాజ్‌కు ఈ ఆల్బమ్ చక్కటి పేరు తెచ్చిపెట్టింది. చాలాకాలం ఈ ఆల్బమ్ టాప్‌టెన్ ఛార్ట్స్‌లో స్థానం పొందింది. సరళమైన, మధురమైన బాణీలు ఈ ఆల్బమ్‌కు ప్రత్యేకతను సంతరించిపెట్టాయి. ఈ ఆల్బమ్‌లోని నాలుగు పాటలకు బాణీలను 'బొంబే బాయ్స్' ఫేమ్ అశుతోష్ పాఠక్, ధృవ్ ఘనేకర్ సమకూర్చారు. ఈ ఆల్బమ్‌లో మెహనాజ్ లైవ్‌షోలోనే కాదు - నేపథ్య గానంలోనూ తన సత్తా చూపగలదనిపించేలా పాడింది. ఇప్పటికీ ప్రతిరోజు గాత్రాన్ని మెరుగుపరుచుకునేందుకు, డాన్సర్‌గా రాణించేందుకు గంటల తరబడి సాధన చేస్తుంటానని మెహనాజ్ చెబుతోంది.

**- వి.అరుణ సత్యవతి**




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 55/-

# రాజా ఆడియో రివ్యూ

ఈ ప్రపంచంలో మనకు తెలిసిన వాటి కన్నా తెలియనివి, తెలియాల్సినవి, అంతుపట్టనివి ఎప్పుడూ ఎక్కువగానే ఉంటాయి. ఈ మాట కూడా అందరికీ తెలిసినదే.... అయినా కొన్ని కొన్ని మనకు ఎదుట పడినప్పుడు, మనసు కలుక్కుమన్నప్పుడు ఈ మాట ఓ మాటు అనుకోకుండా ఉండలేం. ఏ.పి.కోమల సినీ హిట్స్ పేరిట హెచ్.ఎం.వి. వారు తాజాగావిడుదల చేసిన ఆడియో క్యాసెట్‌ను వినగానే ఈ భావనలతో పాటు ఓ రెండు బాధలకు కూడా మనసు గురవుతుంది. ఏ.పి.కోమల వంటి మంచి గాయనికి రావలసిన టైమ్‌లో ఆమె అర్హతకు తగిన అవకాశాలు చిత్ర పరిశ్రమ ఎందుకు ఇవ్వలేదన్నది మొదటి బాధ అయితే పాడిన పాటలు సంఖ్యాపరంగా తక్కువే అయినా, వున్న వాటిలో మంచివెన్నో వున్నా... శ్రోతలు కూడా వాటికివ్వవలసిన గౌరవం, ప్రాధాన్యత ఎందుకివ్వలేదన్నది రెండో బాధ. ఈ రెండు అంతుపట్టని విషయాల మధ్య ఒకే ఒక ఓదార్పు - ఇప్పటికైనా ఆమె పేరిట చిరస్థాయిగా నిలిచిపోయే సావనీర్ లాంటి ఒక ఆడియో క్యాసెట్ విడుదలవటం.

ఈ క్యాసెట్‌లో ఆరవ పాటగా పొందు పరచిన 'జయ మురళీలోలా గోపాలా' అనే పాటను మొదట వినండి. భక్త రఘునాథ్(1960) చిత్రంలోని ఈ పాట ఆమె ఎంతటి స్వరజ్ఞాన సంపన్నురాలో తెలియజేస్తుంది. వెంటనే రాజేశ్వరి (1952) సినిమాలో పాశ్చాత్య పోకడలతో తయారైన 'ఆయో సికి మాయో' పాటని, రక్తరేఖ(1949)లోని 'రావోయి రావోయి మనోజా' పాటని వినండి. ఆమె కంఠంలోగల వైవిధ్యానికి, ఆమె ప్రతిభకి సాకవుతాం. అలాగే సత్యనారాయణ మహత్యం(1964) లో 'ఓం నమో నారాయణ మాం పాహి శ్రీ నారాయణా' అనే శోక భక్తి గీతాన్ని, ప్రేమ(1952) సినిమాలోని 'ఓహో ఇది కదా బ్యూటీ ఇది కదా' అనే సరదా గీతాన్ని కలిపి వినండి. ఆమె స్వర మాధుర్యంలో గల ఫ్లెక్సిబిలిటీ పూర్తిగా అవగతమవుతుంది. బాల నన్యానమ్మ కథ (1956)లో 'అడుగడుగో' పాట, చండీ రాణి (1953)లోని 'ఈ వయార మీ విలాస మోహా రాజ రాజా' పాట ఒక మంచి గాయనిని మనం ఎంతగా మిస్సయ్యామో తెలియజేస్తాయి. కనకదుర్గ పూజామహిమ(1960)లోని 'వసంతుడే రాగా' పాట గురించి, ఏపీ కోమల ఆ పాటల్లో అందించిన మధురిమల గురించి 16-30 నవంబరు2003 'హాసం'లోని 'ఆపాత మధురం' శీర్షికలో పేర్కొనటం జరిగింది. ఆ అనుభూతిని అందించటానికే ఈ క్యాసెట్‌లో ఆ పాట చోటు చేసుకున్నదా అనిపిస్తుంది. ఆ పాటతో పాటు అల్లావుద్దీన్ అద్భుతదీపం(1957)లోని 'యవ్వనమొకటే కవ్వించింది -నవ్వుతు నువ్వు సాగితే - పువ్వులబాటే జీవితం' పాటని, రక్తరేఖ (1949)లోని 'ఓ ఓహో రాజ సుకుమార' పాటని, పిచ్చిపుల్లయ్య(1953)లోని 'ఈ మౌనమేలనోయి గతమెౌ్మ తలచుటె మేలోయి' పాటని, జయసింహ(1955) సినిమాలోని 'మురిపెము మీర నీ కోరిక తీర' పాటని 'మనసైన చెలీ పిలుపు' పాటని వినండి. జిక్కి, జమునారాణి వంటి గాయనీమణులు తెరమరుగయిపోయిన తరువాత కూడా తిరిగి జాణవులే, నా సొగసే దీపావళి వంటి పాటలిచ్చి ప్రేక్షక శ్రోతలకు గుర్తు చేసిన ఇళయరాజా స్మృతి పథంలోకూడా ఈ గాయని స్ఫురణకు రాకపోవటం ఎవరి దురదృష్టం అని అనిపిస్తుంది. సతీసులోచన (1961)లోని 'కరుణాపయోనిధీ,' పరదేశి(1963)లోని 'రావోయి తేటి రాజా,' సిపాయి కూతురు(1959)లోని 'చింతపిక్కలాంటి చిన్నదానా,' రాజేశ్వరి(1952)లోని 'చూడు చూడు', అంతామనవాళ్లే(1954) లోని 'నావన్నెల చిన్నెల' మొదలైన పాటలు కూడా గల ఈ క్యాసెట్‌లో దీపావళి(1960)లోని 'సరియా మాతో సమరాన నిలువగలడా' పాట, బంగారు పంజరం(1959)లోని 'పదములె చాలు రామా' పాట విన్న తర్వాత హృదయం బాధతో బరువెక్కి పోతుంది. ఇలాంటి గాయనికి దక్కవలసిన గౌరవాన్ని ఇప్పటి వరకు అందించని మన విచక్షణ పట్ల ఆత్మవిమర్శ చేసుకోవలసిన అగత్యం వుందనిపిస్తుంది. ఇటువంటి క్యాసెట్‌ని తీసుకురావడం... 'మేం అభిరుచిగల శ్రోతలం' అంటూ గర్వంగా చెప్పుకునే వారందరినీ ఒక్కసారిగా వెన్నుచరిచి - ఆవిడ ఇంకా మన మధ్య పూర్తి జవసత్వాలతో వుంది. కనీసం ఇప్పుడైనా మేలుకొని - ఇన్నాళ్లుగా చిన్న చూపు చూసిన పాపాన్ని ప్రక్షాళన చేసుకోండి' అని హెచ్చరించినట్టుగా ఉంది. నిజంగా ఎన్నో సాంస్కృతిక సంస్థలు, సినీ సంగీత అధ్యయనంలో మునిగి తేలుతున్న తోటి కళాకారులు, ప్రభుత్వం- ఏపీ కోమల గారిని గౌరవించుకోవలసిన తరుణం ఆసన్నమయింద నిపిస్తుంది. అందుకు ఈ క్యాసెట్ నాంది, పునాది కూడా!

**గత రెండుమూడేళ్లుగా అతి అరుదైన, కొండొకచో అసలు లభ్యంకాని పాటల్ని వెతికి వెతికి మరీ పట్టుకుని - వీలయినంతలో నేటి సాంకేతిక నిపుణతను కూడా జోడించి - 'రేర్ ప్రొడక్ట్' అనదగ్గ 50 గొప్ప క్యాసెట్లు , ఇంకా రకరకాల కాన్సెప్ట్‌లతో కూడిన మరో 200 క్యాసెట్లు - హెచ్.ఎం.వి. సంస్థ ద్వారా వెలువడటానికి కారకుడైన శ్రీ యస్.పి.శివప్రసాద్ ఆ సంస్థలో తన ప్రొడక్ట్ ఎగ్జిక్యూటివ్ ఉద్యోగానికి రాజీనామా చేశారు.**

**ఒక ఉద్యోగిగా కాకుండా చక్కని అభిరుచితో, చిక్కని ఉద్యమస్ఫూర్తితో మరుగున పడ్డ మాణిక్యాలవంటి పాటలను శ్రోతలకు అందించిన ఆయన కృషిని రసస్పందన గల తెలుగు సినీ సంగీత ప్రియులందరి తరపునా అభినందిస్తూ ఇటువంటి సేవలకు ఆయన పునరంకితం కావాలని 'హాసం' ఆకాంక్షిస్తున్నది.**


యస్.పి.శివప్రసాద్

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : కల్ హో న హో
రచన : జావెద్ అఖ్తర్
సంగీతం : శంకర్ - ఎహసాన్ - లాయ్



## హర్ ఘడీ బదల్ రహీ హై రూప్ జిందగీ

హర్ ఘడీ బదల్ రహీ హై రూప్ జిందగీ
ఛాఁవ్ హై కభీ, కభీ హై ధూప్ జిందగీ
హర్ పల్ యహాఁ జీ భర్ జియో
జో హై సమా కల్ హో న హో ॥హర్ ఘడీ॥
చాహే జో తుమ్హే పూరే దిల్ సే
మిల్‌తా హై వో ముష్కిల్ సే
ఐసా జో కోయీ కహీఁ హై
బస్ వహీ సబ్‌సే హసీఁ హై
ఉస్ హాథ్ కో తుమ్ థామ్‌లో
వో మెహర్బాఁ కల్ హో న హో ॥హర్ పల్॥
పల్‌కోఁ కే లేకే సాయే
పాస్ కోయీ జో ఆయే
లాఖ్ సంభాలో పాగల్ దిల్ కో
దిల్ ధడ్‌కే హీ జాయే
పర్ సోచ్‌లో ఇస్ పల్ హై జో
వో దాస్తాఁ కల్ హో న హో ॥హర్ పల్॥

గానం : సోనూ నిగమ్
అభినయం : షారుఖ్ ఖాన్, ప్రీతీ జింటా, సైఫ్ అలీఖాన్

కరణ్ జోహార్ రెండు చిత్రాలకు దర్శకత్వం వహించాక కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి నిఖిల్ అడ్వానీ అనే నూతన దర్శకుడి దర్శకత్వంలో నిర్మించిన చిత్రం 'కల్ హో న హో'. ఇంతవరకూ తన తండ్రి యష్ జోహార్ నిర్మించగా రెండు చిత్రాలకు దర్శకత్వం నెరిపిన కరణ్‌ను ఈ చిత్రాన్ని ఎందుకు డైరెక్ట్ చేయలేదని అడిగితే నిర్మాణ వ్యవహారాలు నేర్చుకుని తమ సంస్థను పటిష్ఠం చేయాలని, తనవద్ద సహాయ దర్శకుడిగా పనిచేసిన నిఖిల్‌ను దర్శకుడిగా పరిచయం చేయాలని ఆ నిర్ణయం తీసుకున్నానని అన్నారు. పైగా ప్రేక్షకులు ఇప్పుడు వైవిధ్యం కోరుకుంటున్నారు కాబట్టి తన గత చిత్రాలకు పూర్తిగా భిన్నమైన చిత్రానికి దర్శకత్వం చేయాలని అనుకుంటున్నారు. తన చిత్రాల మధ్య వచ్చే గ్యాప్‌లో తమ సంస్థ వేరే దర్శకులతో చిత్రాలు నిర్మిస్తుందని చెప్పారు.

కరణ్ తన తొలి చిత్రం 'కుఛ్ కుఛ్ హోతా హై'కి సహాయ దర్శకుల కోసం అన్వేషిస్తుండగా ఒక స్నేహితుడు నిఖిల్ పేరు సూచించారు. నిఖిల్ నిజానికి కరణ్‌కు స్కూల్‌లో సీనియర్. అప్పట్లో కరణ్‌ను బాగా కోప్పడేవారట. కానీ గత్యంతరం లేక ఆయననే అడిగారు కరణ్. 'కుఛ్



కుఛ్ హోతాహై', 'కభీ ఖుషీ కభీ గమ్' చిత్రాలకు సహాయ దర్శకుడిగా పనిచేశారు నిఖిల్. ఆయన నైపుణ్యం గుర్తించి యష్ జోహార్, కరణ్ జోహార్ ఆయనకు 'కల్ హో న హో' దర్శకుడిగా అవకాశం ఇచ్చారు. ఈ చిత్రాన్ని కరణ్ ఘోస్ట్ డైరెక్ట్ చేశారని వచ్చిన వదంతులను తిప్పికొడుతూ ఇది పూర్తిగా నిఖిల్ చిత్రమని చెప్పారు కరణ్.

ఈ చిత్రంలో ఇద్దరు హీరోల పాత్రలను షారుఖ్‌ఖాన్, సైఫ్ అలీఖాన్‌లను దృష్టిలో పెట్టుకునే సృష్టించానని కరణ్ అన్నారు. హీరోయిన్ పాత్రకు మొదట కరీనా కపూర్‌ను ఎంచుకున్నా తరువాత ప్రీతీజింటాకు ఆ పాత్ర ఇచ్చారు. హీరోయిన్ తల్లి పాత్రను మొదట నీతూసింగ్‌కు ఆఫర్ చేశారు. ఆమె తిరస్కరించటంతో జయాబచ్చన్ ఆ పాత్ర చేశారు. ఇంకా కొందరు ప్రముఖ తారలు అతిథి పాత్రలు పోషించారు. ఈ చిత్రం మొత్తం న్యూయార్క్‌లోనే షూటింగ్ జరుపుకుంది.

ఈ చిత్రకథ 'ఆనంద్' చిత్రాన్ని పోలి ఉందని విడుదలకు ముందు వదంతులు వచ్చాయి. ఆ వదంతులను కొట్టిపారేస్తూ 'ఆనంద్' లాంటి క్లాసిక్ చిత్రం స్థాయిని అందుకోగలిగితే అది తన అదృష్టం అవుతుందని అన్నారు కరణ్. నిజానికి 'ఆనంద్'కి, ఈ చిత్రానికి ఒక పోలిక ఉంది - ప్రాణాంతకమైన వ్యాధి ఉందని తెలిసినా నవ్వుతూ, నవ్విస్తూ ఉండే హీరో పాత్ర. జీవితం దేవుడిచ్చిన వరమని, మనకున్న దాంట్లో ఆనందంగా జీవించాలని తెలియజెప్పే పాత్ర ఇది.

న్యూయార్క్‌లో ఒక రెస్టారెంట్ నడిపే జెన్నిఫర్ కపూర్ (జయాబచ్చన్) తన అత్తగారు, ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకుతో జీవిస్తుంటుంది. పెద్ద కూతురు పేరు నైనా (ప్రీతిజింటా). మిగతా పిల్లలు చిన్నవాళ్ళు. మగ దిక్కులేని ఆ ఇంట్లో ఒకరికొకరు తోడుగా ఉండాల్సింది పోయి ఎప్పుడూ కీచులాడుకుంటూ ఉంటారు జెన్నిఫర్, ఆమె అత్తగారు. దీనితో ఎప్పుడూ నిస్పృహతో జీవితాన్ని భారంగా వెళ్ళదీస్తూ ఉంటుంది నైనా. ఆమె స్నేహితుడు రోహిత్ (సైఫ్ అలీఖాన్). కనపడిన ప్రతి అందమైన అమ్మాయినీ ప్రేమించేస్తూ ఉంటాడు.

వీరి జీవితాలలోకి అమన్ (షారుఖ్‌ఖాన్) ప్రవేశిస్తాడు. అతనికి చావు ముంచుకొచ్చేస్తోంది. అయినా నైనాకు ఆనందంగా ఉండటం నేర్పిస్తాడు. మందకొడిగా సాగుతున్న రెస్టారెంట్‌ను పరుగెత్తిస్తాడు. నైనా అమన్‌ను ప్రేమించటం మొదలుపెడుతుంది. మారిన నైనాను రోహిత్ ప్రేమిస్తాడు. అమన్ తన అనారోగ్య పరిస్థితి కారణంగా నైనాపై ఉన్న ప్రేమను మనసులో దాచుకుని తనకు పెళ్ళయిందని అబద్ధం చెబుతాడు. తను అమితంగా ప్రేమించిన తండ్రి మరణంతో కృంగిపోయిన నైనా, తనను ప్రేమిస్తే తనకు రాబోయే మరణాన్ని తట్టుకోలేదు గనుక తను వెనక్కి తగ్గి ఆమెను రోహిత్‌కు దగ్గర చేయా లనుకుంటాడు అమన్. రేపు తానుంటాడో లేదో తెలియని అమన్, ఆమె రేపు కూడా సంతోషంగా ఉండటానికి బాటలు వేయాలను కుంటాడు. అదే ఈ చిత్రం టైటిల్ 'కల్ హో న హో' (రేపు ఉంటుందో లేదో). అదే 'కల్ హో న హో' పాటకు సందర్భం.



ఈ చిత్రానికి శంకర్ - ఎహసాన్ - లాయ్ సంగీతం అందించారు. 'ఇట్స్ ద టైమ్ టు డిస్కో' వంటి పాశ్చాత్య గీతం. 'మాహివే' వంటి పంజాబీ జానపద గీతం, 'కల్ హో న హో' వంటి మధుర గీతంతో బ్యాలెన్స్‌డ్ సంగీతం అందించారు. 1990లో వచ్చిన 'ప్రెటీ వుమన్' కోసం రాయ్ ఆర్బినన్ కంపోజ్ చేసిన 'ప్రెటీవుమన్' పాట హక్కులు తీసుకుని ఆ పాట ఆధారంగా ఒక పాటను రూపొందించారు.

గానం : సోనూ నిగమ్, అల్కా యాగ్నిక్
అభినయం : షారుఖ్ ఖాన్, ప్రీతీ జింటా, సైఫ్ అలీఖాన్, జయా బచ్చన్ తదితరులు

ఆ : తుమ్ హో గమ్ కో ఛుపాయే
మైఁ హూఁ సర్ కో ఝుకాయే
తుమ్ భీ చుప్ హో
మైఁ భీ చుప్ హూఁ
కౌన్ కిసే సమ్‌ఝాయే
అబ్ దూరియాఁ ఇత్‌నీ హైఁతో
మిల్‌నా యహాఁ కల్ హోన హో

అ : సచ్ హై కి దిల్‌తో దుఖా హై
హమ్‌నే మగర్ సోచా హై
దిల్ కో హై గమ్ క్యోఁ
ఆంఖే హై నమ్ క్యోఁ
హోనా హిథా జో హువా హై
ఉస్ బాత్ కో జానే భీ దో
జిస్‌కా నిషా కల్ హో న హో ॥హర్ పల్॥



ఈ పాటలన్నీ జావేద్ అఖ్తర్ రాశారు. 'కుఛ్ కుఛ్ హోతా హై' చిత్రానికి గీత రచయితగా మొదట జావెద్ అఖ్తర్‌నే ఎంచుకున్నారు కరణ్. కానీ ఆ చిత్రం టైటిల్ (అర్థం 'ఏదో ఏదో అవుతోంది') ఇబ్బందికరంగా ఉందని జావెద్ తప్పుకున్నారు. ఆ చిత్రానికి సమీర్ పాటలు రాశారు. ఆ చిత్రం ఘనవిజయం సాధించాక జావెద్ 'నా జీవితంలో మొదటిసారి ఒక 26 ఏళ్ళ యువకుడు నా అభిప్రాయం తప్పని ఋజువు చేశాడు' అన్నారు. ఇప్పుడు ఈ చిత్రానికి 'కల్ హో న హో' వంటి అద్భుతగీతం అందించారు. అందరి నోళ్ళలో నానుతున్న పాట ఇది.

'హర్ ఘడీ' అంటే ప్రతి క్షణం. జిందగీ అంటే జీవితం. ఛావ్ అంటే నీడ. ధూప్ అంటే ఎండ. పల్ అంటే క్షణం, తరుణం. సమా అంటే సమయం.

'ప్రతి క్షణం మారుతోంది జీవితపు రూపు
ఒకసారి చీకటైతే ఒకసారి వెలుగు ఈ బ్రతుకు
ప్రతి తరుణమూ మనసారా జీవించు
ఈ సమయం రేపు ఉంటుందో లేదో'

జీవితం ప్రతి క్షణం రంగు మార్చుకుంటుంది. చీకటి వెలుగుల రంగేళి ఈ జీవితం. ప్రతి తరుణం అందిపుచ్చుకుని ఆనందంగా జీవించాలి. ఇప్పుడున్న దానితో సంతృప్తిగా ఉండాలి. రేపు అది కూడా ఉండకపోవచ్చు. అమన్ పరిస్థితిని చక్కగా వివరిస్తుంది ఈ పల్లవి. అతని జీవితం రేపు

ఉండకపోవచ్చు. అందుకే ఈ రోజు హాయిగా జీవించాలి. అలాగే నైనాకి జీవితం గురించి పాఠం చెప్పినట్టూ ఉంటుంది.

చాహ్‌నా అంటే ఇష్టపడటం. ముష్కిల్ అంటే కష్టం. హసీన్ అంటే అందమైనది. థామ్‌నా అంటే అందుకోవటం, పట్టుకోవటం. మెహర్బాన్ అంటే దయ చూపటం.

**నిను నిండు గుండెతో ఇష్టపడేవారు**
**అతి కష్టం మీద దొరుకుతారు**
**అలాంటి వారు ఎవరైనా ఉంటే**
**వారే అందరికన్నా అందమైన వారు**
**ఆ చేతిని నువ్వందుకో**
**ఆ ప్రేమ రేపు ఉంటుందో లేదో'**

నిండు హృదయంతో ప్రేమించేవారు దొరకటం చాలా కష్టం. అలా ప్రేమించబడటం అదృష్టం. అలాంటి వారు దొరికితే వారి అంతః సౌందర్యాన్ని గుర్తించాలి. మన దృష్టిలో వారే అందరికన్నా అందమైనవారు కావాలి. ఎందుకంటే ప్రేమ అనే సౌందర్యం తరగనిది. ఆ చేతిని అందుకుని సాగిపోవాలి. ఆలస్యం చేస్తే వారు మళ్ళీ చేయి అందించకపోవచ్చు. ఇక్కడ రోహిత్ ప్రేమను అంగీకరించమని నైనాకు చెబుతున్నాడు అమన్. ఇక్కడ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే అమన్‌కి కూడా ఈ సలహా వర్తిస్తుంది. కానీ అతడు అమలుపరచలేదు. అతని పరిస్థితి వేరు. అతనికి రేపనేది ఉండకపోవచ్చు కనుక రేపు ఒకరి ప్రేమ లేకపోయినా ఫరవాలేదు.



'పల్‌కేఁ' అంటే కనురెప్పలు. సాయే అంటే నీడలు. సంభాల్‌నా అంటే జాగ్రత్త పడటం. పాగల్ అంటే పిచ్చిది. సోచ్‌లో అంటే ఆలోచించుకో అని. దాస్తాఁ అంటే గాథ.

**కనురెప్పల మాటున చోటిస్తానని**
**ఎవరైనా దరిజేరితే**
**ఈ పిచ్చి మనసు ఎంత ఆపినా**
**అసలు ఆగనే ఆగదే**
**కానీ తెలుసుకో, ఇప్పుడున్నది**
**ఈ గాథ రేపు ఉంటుందో లేదో**

మొదటి చరణంలో ప్రేమను అందిపుచ్చుకోవాలని చెబితే ఇక్కడ కొన్ని పరిస్థితుల్లో ఆలోచించి అడుగేయాలని తనకు తానే చెప్పుకుంటున్నాడు. రేపు ఉంటుందో లేదో తెలియని ప్రేమ కథను ప్రారంభించకూడదని అతని ఉద్దేశ్యం.

నైనాకు నిజం తెలిసిన తరువాత వచ్చే సెకండ్ వర్షన్‌లో నైనా భావాలు, దానికి అమన్ జవాబు ఉంటాయి. ఈ పాట ఏ సందర్భంలో వస్తుందన్నది చిత్రం చూసి తెలుసుకోవలసినదే.

'గమ్‌ఛుపానా' అంటే బాధ దాచటం. 'సర్ ఝుకానా' అంటే తలదించటం. 'చుప్ హోనా' అంటే మౌనంగా ఉండటం, సమ్‌ఝానా అంటే సముదాయించటం. దూరియాఁ అంటే దూరాలు.

**నీవున్నావు బాధ దాచుకుని**
**నేనున్నాను తలదించుకుని**
**నీవున్నావు మౌనంగా**
**నేనున్నాను మౌనంగా**
**ఎవర్ని ఎవరు ఒప్పించాలో!**
**దూరాలిలా పెరిగాయిగా**
**మరి కలయిక రేపు ఉంటుందో లేదో'**

వారిద్దరూ గుండెల్లో బాధ దాచుకుని మౌనంగా ఉండిపోయారు. ఒకరినొకరు ఓదార్చుకోలేనంత దూరాలు పెరిగాక ఇక మళ్ళీ కలయిక ఉంటుందో లేదో అని ఆమె వేదన చెందుతోంది.

'దిల్ దుఖ్‌నా' అంటే హృదయం గాయపడటం. నమ్ అంటే తడి. 'జానే దో' అంటే పోనీ. నిషాఁ అంటే గుర్తు.

**మనసు గాయపడింది, నిజమే**
**కానీ నాకనిపిస్తోంది**
**మనసుకు బాధ ఎందుకు**
**కంటిలో తడి ఎందుకు**
**జరగాల్సినదే జరిగింది**
**ఆ మాటను నువు మరచిపో**
**ఆ గురుతు రేపు ఉంటుందో లేదో**

మనసు గాయపడింది, నిజమే కానీ అంతా మంచే జరిగింది అనుకుంటే బాధపడాల్సిన అవసరం లేదు. అనివార్యమైన విషయాల గురించి బాధపడకూడదు. గాయం మిగిల్చిన మచ్చ రేపు ఉండకపోవచ్చు. కాబట్టి మరచిపోవటమే ఉత్తమమని చెబుతున్నాడు.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# ఆకాశవాణి సంగీత సమ్మేళన్ - 2003 బ్రాడ్‌కాస్ట్ షెడ్యూల్

## 10.00 P.M. To 11.00 P.M.



**16.12.03**
**పండిట్ ఉల్హాస్ కశాల్‌కర్**
**గాత్రం**



**17.12.03**
**డా॥ఎం.బాలమురళీకృష్ణ**
**గాత్రం**



**18.12.03.**
**వి.సి.రనడే**
**వయొలిన్**



**19.12.03**
**గురువిల్లి అప్పన్న**
**నాదస్వరం**



**20.12.03**
**ఉస్తాద్ గులామ్ ముస్తాఫాఖాన్**
**గాత్రం**



**21.12.03**
**పండిట్ బుద్ధాదిత్య ముఖర్జీ**
**సితార్**



# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 3

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో



## జరిగిన కథ

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహుద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుసలాడే ఆయన తన కుమారులు శ్రీరామచంద్రమూర్తి, లక్ష్మణమూర్తి ల విషయమై భార్యను కోప్పడి స్కూలుకు వెళ్తాడు. అక్కడ పనిచేసే డ్రిల్లు మాష్టారు అనంతం వీరభద్రం కుమారునితో తన కూతురు జలజ వివాహం జరుగుతుందని జ్యోతిష్కుడు చెప్పాడనటంతో వీరభద్రం అది ఎన్నటికీ జరగదని చెప్తాడు. లెక్చరర్ చెప్పే పాఠాన్ని శ్రద్ధగా వింటున్న శ్రీరామ్ పైకి ప్రేమ ఉత్తరాన్ని విసురుతుంది అశ్విని. అది మాష్టారి కంట్లో పడుతుంది. అది ఆయన క్లాసులో అందరికీ చదివి వినిపిస్తాడు.

(ఇక చదవండి)

పోలాన్ని కొనసాగిస్తున్నాడు. ఒక్క వాక్యం కూడా శ్రీరామ్ బుర్రలోకి ఎక్కటం లేదు. తనకేదో గొప్ప అవమానం జరిగిపోయినట్లు భావించాడు.

క్లాసు అయిపోయిన తర్వాత - అశ్విని వెళ్ళిపోతూండేటే - ఆమె వెనకాల వెళ్లాడు.

"అశ్వనీ!" కోపంగా పిలిచాడు.

అశ్విని ఆగిపోయి అటూ ఇటూ చూసింది.

"పిలిచింది నేను!.. ఆకాశవాణికాదు... దిక్కులు చూడకు!" అన్నాడు అదే టెంపోలో.

"నువ్వా? నిజమేనా?... ఇంతకాలంగా నీ వెంటపడి ప్రేమలేఖలు రాస్తూంటే - ఎప్పుడూ కన్నెత్తి చూడకుండా, పన్నెత్తి పలుకరించకుండా తప్పించుకు తిరిగిన నువ్వు - ఇప్పుడు నా వెంటపడి - నన్ను పేరెట్టి నోరారా పిలిచావా?.. నేనెంత అదృష్టవంతురాల్నీ?.. ఆ భగవంతుడు నన్నిప్పటికి కరుణించాడన్నమాట! నా జన్మ ధన్యం చేశాడు!... డాతువంగభహే!..."

"డాతువంగభహే? అదేం పిచ్చిమాట?" విసుగ్గా చూస్తూ అడిగాడు శ్రీరామ్.

"డాతువంగభహే అన్నానా? - బహుశా నువ్వు నన్ను పలకరించిన ఆనందంలో 'హే భగవంతుడా' అనుకోబోయి - అలా రివర్స్‌లో అనేసివుంటాను!"

"ఆపు! నీ ఓవరేక్షను!" - సీరియస్‌గా అన్నాడు.

అశ్విని మాట్లాడలేదు.

"నువ్వు అస్తమానూ ఇలాంటి పిచ్చిచేష్టలు చేయటం ఏమీ బాగాలేదు.." అంటూనే జేబులోంచి - నలిగిపోయి ఉన్న 'ఐలవ్‌యూ' కాగితం తీసి - ఆమె ముఖం మీదకు విసిరేశాడు.

"అవి పిచ్చి చేష్టలు కాదు మైడియర్ శ్రీరామ్!... ప్రేమకు పరాకాష్టలు!" అంది అశ్విని కొంటెగా చూస్తూ.

"ప్రేమకూడా ఓ రకం పిచ్చే!"

"కావచ్చు... దానికి ట్రీట్‌మెంట్ పెళ్లి!.. నువ్ 'ఉ' అన్నావంటే, ఇప్పుడే మా డాడీకి చెప్పి - మనపెళ్లికి రేపే ముహూర్తం పెట్టిస్తాను!"

"మీ డాడీ మనకి పెళ్లి ముహూర్తం పెడితే - మా డాడీ నన్ను ఉప్పుపాతరేస్తాడు... అంచేత నాపై అలాంటి ఆశలు పెట్టుకోకు... గుడ్‌బై!" - అంటూ గబగబా ముందుకు వెళ్లిపోయాడు శ్రీరామ్.

అతన్ని చూసి మనసులోనే నవ్వుకుంది అశ్విని!!

* * *

హైదరాబాద్‌లో మధ్యతరగతి కుటుంబాలూ - ఓ మాదిరి సంపన్న కుటుంబాలూ కలిసిజీవించే విజయనగర కాలనీ అది!




ఆ కాలనీలో ఓ సంపన్నుల పెరటివాటాలో - రాజేంద్ర అద్దెకుంటున్నాడు. ముందుగదిలో కూర్చుని వారపత్రిక చదువుతున్న రాజేంద్ర - ఓ నిముషం తర్వాత -లోపల వున్న భార్యని పిలిచాడు.

"గీతా!... గీతా!"

బదులు రాలేదు.

"ఏం చేస్తున్నావోయ్ లోపల?" అంటూ లోపలకు చూసి మళ్లీ పిలిచాడు.

అయినా జవాబు రాలేదు... పుస్తకం పక్కనపెట్టి పక్క గదిలోకి వెళ్లాడు. అక్కడ గీత కనిపించలేదు... వంటింట్లో చూశాడు... అక్కడా లేదు... రాజేంద్ర పెరట్లోకి వచ్చాడు...

అక్కడ - గోడదగ్గర ఓ చిన్న స్టూలు మీద నిలబడలేక నిలబడుతూ - గోడ అవతల వున్న ఇంట్లోకి చూస్తోంది గీత... రాజేంద్ర కూడా నెమ్మదిగా అక్కడకు చేరుకుని అనుమానంగా - గోడవతలకు చూశాడు.

అవతల ఇంట్లో - టీవీలో సినీమా కనిపిస్తోంది. ఆ ఇంటికిటికీ తెరచి ఉండటాన అందులోంచి - టీవీ చూస్తోందామె.

"గీతా!" కోపంగా అరిచాడు రాజేంద్ర.

గీత ఉలిక్కిపడి - స్టూలు మీదనించి కిందపడబోయి - నిలదొక్కుకుంది.

"ఇవాళ ఆదివారం!... మొగుడు ఇంట్లోనే వున్నాడు' అనే ఇంగితం కూడా లేకుండా ఇక్కడ పీటమీద నిలబడి భరతనాట్యం చేస్తున్నావా?... బుద్ధుందా నీకు?" గద్దించాడు రాజేంద్ర.

"ఇవాళ టీవీలో నాగార్జున సినీమా వస్తోందండీ"- పీట దిగపోయి జవాబు చెప్పిందామె.

రాజేంద్రకు ఆ 'ఎక్స్‌ప్లనేషన్' నచ్చలేదు.

"టీవీలో నాగార్జున సినీమాలూ, చిరంజీవి సినీమాలూ వస్తూనే వుంటాయ్... కానీ వాటిని చూసే విధానం ఇదికాదు!" అంటూనే ఆమె చేయి పుచ్చుకుని బరబరా లోపలకు లాక్కొచ్చాడు.

వీధి గదిలో ఓ మూలకు ఆమెను తీసుకెళ్లాడు.

"ఇదిగో... ఈ మూల ఎంచక్కా కలర్ టీవీ పెట్టుకోవాలి!.... ఇలారా!... ఇక్కడ, టీవీకి ఈమాత్రం దూరంలో సోఫా వేసుకుని అందులో కూర్చోవాలి! కూర్చున్నాక వేడివేడిగా జీడిపప్పో, పకోడీలో తింటూ - టీవీలో వచ్చే సీరియళ్లూ, సినీమాలూ చూడాలి!... వాటిలో ఎవైనా బరువైన సన్నివేశాలొస్తే కన్నీరు పెట్టుకోవాలి! హాస్య రసాత్మకమైన సన్నివేశం వస్తే - పక్క వాటాలో వాళ్ళకు వినిపించేలా ఘొల్లుమని నవ్వాలి!...



అంతేకానీ అలా పెరటి గోడదగ్గర - పక్కింటి వాళ్ళ కరివేపాకు చెట్టు రెమ్మల్ని దొంగతనం చేస్తున్న భంగిమలో - పీటమీద నిలబడి భరతనాట్యం చేయకూడదు!" సీరియస్‌గా చెప్పాడు రాజేంద్ర.

భర్త చెప్పిందంతా - శ్రద్ధగానే విని - మూతి మూడు వంకర్లు తిప్పింది గీత.

"చాల్లెండి మహా చెప్పారు! కలర్ టీవీ కావాలని నేనేం కలవరించటం లేదు - మనకున్న ఆ 'బ్లాక్ అండ్ వైట్' పోర్టబుల్ టీవీని అటకమీదనించి దింపి రిపేరు చేయించండి - చాలు! ఈ మూల సోఫా లేకపోయినా, మనకున్న చాపవేసుక్కూచుని చూస్తాను... ఆఖరికి గుడిసెలో కాపురం వుండే మన పనిమనిషి రాజవ్వ కూడా టీవీ కొనుక్కుని కేబుల్ కనెక్షన్ తీసుకుంది... 'మీ ఇంట్లో టీవీ అయినా లేదు... మీకు కాలక్షేపం ఎట్టా అవుతోందమ్మా' - అని జాలిగా చూసి మరి అడుగుతూంటె - సిగ్గుతో తల ఎత్తుకోలేక పోతున్నాను... తెలుసా?" - అంటూ ఎదురుదాడి చేసింది.

రాజేంద్ర రెండు క్షణాలు ఆమెవైపు తీవ్రంగా చూశాడు.. అంతలో అతనికి ఓ ఆలోచన రావటంతో - గబగబా వెళ్లి లెటరుప్యాడూ, పెన్నూ తెచ్చాడు. వాటిని గీత చేతిలో పెట్టి - చెప్పాడు-

అల్రైట్!... నీకు కలర్ టీవీ కావాలి!... అంతేగా?... మళ్లీ నెల తిరిగేసరికి మనింట్లో కలర్‌టీవీ కనిపిస్తుంది. ఒకే?.. నేను చెప్పినట్టురాయి!"

ఏం రాయిస్తాడో తెలియక - అనుమానంగా చూసింది గీత... అయినా రాజేంద్ర పట్టించుకోలేదు. తన ధోరణిలో చెప్పటం ప్రారంభించాడు -

"మహారాజశ్రీ నాన్నగారికి - మీ అమ్మాయి గీత అనేక నమస్కారాలు చేసి వ్రాయునది -"

అప్పటికి విషయం అర్థమైపో యిందామెకు.

"మా నాన్నకి ఉత్తరం రాయాలా?.. అంటే... మా నాన్న మీకేమైనా లెటర్ రాశారా?" ఉత్సాహంగా అడిగింది...

"లేదు! రాయలేదు... ఎందుకు రాస్తాడూ? దేశంలో వున్న ముసలి అల్లుళ్ళక్కూడా - సంక్రాంతి పండక్కిరమ్మంటూ వాళ్ళమావలు ఉత్తరాలు రాస్తున్నారు. ఫోన్లు చేసి బ్రతిమాలు తున్నారు. అయినా మీ నాన్న మాత్రం రాయడు!.. దుర్మార్గుడు!... అందుకే నువ్వరాయి! మనకి రావాల్సిన కట్నం డబ్బు బాకీ - నలభైవేలూ అర్జంటుగా పంపించమని రాయి!... కలర్ టీవీసెట్టూ - సోఫాసెట్టూ కొనేసుకుందాం!" బల్లమీద పెట్టేసింది గీత.




"ఏం? ఎందుకు రాయవ్?" పళ్లు పటపటా కొరుకుతూ అడిగాడు రాజేంద్ర "మీకు తెలీదా?.. మా నాన్నంటే నాకెందుకో భయం!" చెప్పింది.

"సరే!.. నీకు భయమైతే నాకేమిటి భయం? 'అల్లుడూ - కడుస్వతంత్రుడు...!' నేను రాస్తాను!" - ఆ లెటర్ ప్యాడ్‌లోంచి ఓ కాగితాన్ని బర్రున చింపి గబగబా రాసేశాడు. ఆ తర్వాత తనలో తాను చదువుకుంటున్న టైపులో - గీతకు వినిపించేలా చదివాడు-

"......... మహారాజశ్రీ మావగారికి... వచ్చేనన్నాం!.. సంక్రాంతి పండుగకి వచ్చేస్తున్నాం.. నాకు ఇవ్వాల్సిన కట్నం బాకీ బాపతు నలభైవేలూ రెడీ చేసివుంచండి... ఇట్లు.. మీ అల్లుడు.. రాజేంద్ర..." ఆ కాగితాన్ని కవరులో పెట్టి - పోస్టులో వేసేందుకు, వీధిలోకి నడిచాడు రాజేంద్ర...!

* * * *

"హుం!... రడీ చేసి పట్టుకోవాలట!... ఇదేమైనా పకోడీల పొట్లమనుకొనుచు న్నాడా?" ఆ ఉత్తరాన్ని పదహారు ముక్కలుగా చింపేస్తూ అన్నాడు వీరభద్రం.

అప్పుడే హాల్లోకి వచ్చిన పార్వతమ్మ భర్త వైఖరి చూసి సందేహంగా అడిగింది-

"ఏమిటూ కాగితం? దాన్నలా చింపే స్తున్నారేమిటీ?"

"మంచి మానవుణ్ణి కనుక చింపేశాను. అలాకాక ఈ లేఖను పోలీసులకు అందించినచో - నీ అల్లుణ్ణి ఈపాటికి అరెస్టు చేసి వుందురు!"

"అయితే అల్లుడుగారు రాసిన ఉత్తరమూ అదీ? - ఏం రాశారేమిటీ?" - ఆత్రంగా ముందుకొచ్చి అడిగింది.

"వారికి మనం - పెళ్లి ముహూర్తాన బాకీ పడిన కట్నం - నలభైవేలూ రెడీగా పూల బుట్టలో పెట్టి - పట్టుకొని వుండవలెనట!... వారు సంక్రాంతి పండుగనాడు మన గృహాన్ని పావనం చేసి - దాన్ని స్వీకరించి - మనల్ని ధన్యుల్ని గావిస్తారట!"

పార్వతమ్మ సంతోషంగా చూసింది.

"పోన్లెండి!.. పండక్కి మనం పిలువ లేదని భీష్మించుక్కూచోకుండా - తమకు తామే వస్తామని రాశాడు అల్లుడు! ఈ ఏడైనా పంట డబ్బు రాగానే అందులోంచి నలభై వేలూ తీసి అతనికిచ్చేస్తే మర్యాదగా వుంటుంది!" - చెప్పిందామె.

"ఇవ్వని ఎడల ఏమి జరుగునో?" - కోపంగా చూశాడు వీరభద్రం.

"ఏం జరుగుతుందీ?.. మన పరువు మంటలో కలుస్తుంది... అల్లుడు మంచి వాడైతే మిమ్మల్ని 'పిసినిగొట్టు'గా జమ కట్టుకుని - మనసులోనే తిట్టుకుంటూ ఆ డబ్బుకి నీళ్లొదులుకుంటాడు. చెడ్డవాడైతే అమ్మాయిని అగచాట్లపాలు చేస్తాడు!.. అయినా వాళ్ళపెళ్ళయి రెండేళ్ళయింది... అప్పట్నించే 'అదిగో ఇదిగో' అంటూ ఆ డబ్బు ఇవ్వటానికి వాయిదాల మీద వాయిదాలు వేస్తున్నారు!.. ఈసారి నోరు తెరచి అడిగాడు!"

"నోరుతెరచి అడగలేదు... పెన్ను తెరచి రాసినాడు!"

"పోనీ అలాగే అనుకోండి!... ఈసారి ఇవ్వకపోతే అతను ఉరుకోడు!"

"ఉరుకొనక ఉరివేసుకుంటాడా?... అట్లే కానీయమనండి...!.. అయినా నేనిపుడు మావల సంఘానికి అధ్యక్షుడినన్న సంగతి మరచి

పోయితివా?"

"అయితే మాత్రం?"

"కట్న కానుకలు ఇచ్చుటకానీ, స్వీకరించుటకానీ క్షమింపరాని నేరము. అందునా, సంఘమునకు పెద్దనైవుండి - నేనే ఈ దుష్కార్యానికి తలపడుట ఆత్మహత్యాసదృశము!"

"మరి ఆనాడు - 'తర్వాతిస్తా'నని ఎందుకు చెప్పారూ?" కోపంగానే అడిగింది పార్వతమ్మ.

"అది ఆనాటి మాట! అప్పుడు నేను మావల సంఘమును ఏర్పరచలేదు. కావున అట్లంటిని... కానీ ఇప్పుడు ఇచ్చుటకు వీలులేదనుచుంటిని!... దమ్ములున్నచో ఎదురుపడి అడగమను!" -మీసం తిప్పుకుంటూ అన్నాడు వీరభద్రం.

"చాల్లెండి సంబడం?... మీ మొహం చూసి ఎవరైనా మిమ్మల్ని ఏదైనా అడుగుతారుకూడానా?.. అసలు ఆనాడు పెళ్లిచూపుల్లో మావాళ్లు మిమ్మల్ని సరిగ్గా చూడనిచ్చారు కాదు కనుక, మీకు నేను పెళ్లానైపోయాను!"

"ఓహో!... సరిగ్గా చూసివుంటే ఏమ య్యేదో?"

"మీ మొహం నాకు నచ్చలేదని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పివుండేదాన్ని".

సరిగ్గా అదే సమయంలో - కూరల సంచీతో లోపలకు అడుగుపెట్టిన నారాయణ ఆమాటవిని కిసుక్కున నవ్వేశాడు.

"అచ్చర లచ్చులు ఇలువ చేసే మాట న్నారమ్మగోరూ!.. అదేం సిత్రమోగానీ అయ్య గారంటే పాలిచ్చే పశువుల కాణ్ణించి - పాలుతాగే పిసిబిడ్డల వరకూ అందరూ హడలే కదండీ!" కూరలసంచి ఆమెకు అందిస్తూ అన్నాడు.

"అఘోరించావులే!.. నకిలింవులు చాలించు!" - నారాయణపై కళ్ళెర్ర చేశాడు వీరభద్రం.

వస్తున్న నవ్వును చటుక్కున ఆపేశాడు నారాయణ.

"సిత్తం! తమరు ఉరిసిచ్చ ఎయ్యనంటే ఓ మాట సెప్పాలనుకుంటున్నాను బాబూ!" - వినయంగా చేతులు కట్టుకుని చెప్పాడు.

"ఏమిటో అఘోరించు!"

"తమరి ముకారవిందంలో ఏటి రాసుందో కానీ - ఆ మొకంలోకి సూత్తా సూత్తా తమర్ని ఎవరూ కూడా ఏదీ అడగలేరండి!... అడుగుదారనే వుంటదండీ!... తీరా తమరి మొకం సూడగానే మాటపడిపోద్దండి!"

"ఎందువల్లనో" - గర్వంగా చూస్తూ అడిగాడు వీరభద్రం.

"సిత్తం! అదే అర్తం కాదండిమరి!.. వుప్పుడు నేనున్నానండి?.. పాతికేళ్ళకాడినించీ తమరికాడ




పనిసేత్తన్నాకదండీ!.. అయినా ఇప్పటికొచ్చి - 'టవున్లో కొత్త సినిమా రిలీజైంది సూసొత్తా - ఓ పదిప్పించండీ' - అని ఎప్పుడైనా తవర్ని అడిగానాండీ?... లేదు... అడగనండి... అదంతే!" చెప్పాడు నారాయణ.

"అఘోరించావులే!.. పొలానికి దయచేసి పనిచూసుకో.. సినీమా చూస్తాడట సినీమా!... హూఁ!" చిరాగ్గా చూసి - గబగబా డ్రస్ చేసుకుని గొడుగు చేతపట్టుకుని - బయటకు వెళ్ళబోతూ భార్యతో చెప్పాడు -

"పంచాయితీ కార్యాలయంలో మావల సంఘం మీటింగున్నది... పోయివచ్చెదను. మన రైతు ధాన్యము అమ్మగావచ్చిన సొమ్ము తెస్తాడు. తీసుకొని భద్రపరచు!"

బయటకొచ్చిన వీరభద్రం - గుమ్మంలో ఎదురుగా నిలబడివున్న గాడిదను చూసి ఠక్కున ఆగిపోయాడు.

"హుఁ! దుశ్శకునము!" - విసుక్కుంటూ మళ్లీ లోపలకు వచ్చేశాడు. కోటూ, కండువా తీసి కుర్చీపైన వేసి - అందులో కూలబడ్డాడు.

సరిగ్గా అదే సమయంలో - గుమ్మం ముందు కారాగింది. వీరభద్రం అటువైపు చూశాడు. అప్పటికి, కారుదిగి లోపలకు వస్తున్న చిదంబరం కనిపించాడు.

వీరభద్రానికి - చిదంబరం బాల్య స్నేహితుడు... అందుకే ఉత్సాహంగా ఎదురెళ్ళి అతనికి స్వాగతం చెప్పాడు-

"ఓ... చిదంబరమా!... రమ్ము... రమ్ము! తమరి రాక విజయవాడనించేనా?"

ఆ పలకరింపు విన్న చిదంబరం నీరుకారిపోయాడు.

"అబ్బా! నీ ఇంటికొస్తే ఇదే ప్రాబ్లంరా వీరభద్రుడూ!.. గుప్తుల కాలంలోకి వెళ్ళిపోయిన ఫీలింగు వచ్చేస్తుంది నాకు!" - అంటూనే కుర్చీలో కూర్చున్నాడు వీరభద్రం ముసిముసిగా నవ్వేశాడు.

"కాస్త ఆ గ్రాంధికం కట్టిపెట్టి - వ్యవహారికంలో వ్యవహరించరా.. నీకు పుణ్యం వుంటుంది" మళ్లీ అన్నాడు చిదంబరం.

"చూడు ఫ్రెండూ!... నాకూ అట్లే వ్యవహరించవలెనని అన్పిస్తుంది. కానీ బాల్యము నించీ వచ్చిన ధోరణి కదా?... పైగా మా పితృపాదులు రావ్‌బహద్దూర్ బలభద్రం గారునూ, వారి పితృదేవులు రామభద్రం గారున్నూ అలాగే మాటలాడేవారు. ఆ లక్షణమే మాకూ సంప్రాప్తించింది.!" నవ్వుతూ బదులిచ్చాడు వీరభద్రం.

ఈలోగా పార్వతమ్మ కాఫీ తెచ్చి ఇచ్చింది.

అందుకుంటూ అడిగాడు చిదంబరం -

-(ఇంకావుంది)





## 'పండిత' సంగీతాన్ని సర్వ జనరంజకం చేసిన

# స్వర సామ్రాట్ నౌషాద్

కె.ఎల్.సైగల్ నుంచి మహేంద్రకపూర్ వరకూ, నూర్జహాన్ నుంచి సుమన్ కళ్యాణ్‌పూర్ వరకు, ఎందరో నేపథ్య గాయకుల ప్రతిభ లోతులను వెలికి తీసిన వ్యక్తి.

మరే సంగీత దర్శకుడూ సాహసించలేని పని - బడే గులాం అలీఖాన్, పండిట్ డి.వి.పలుస్కార్, అమీర్‌ఖాన్ వంటి వారిచే సినిమాల్లో పాడించడం- అతి సమర్ధ వంతంగా చేసిన వ్యక్తి.

తను సంగీతం అందించిన సినిమాల్లో 9 గోల్డెన్ జూబిలీలు, 3 ప్లాటినం జూబిలీలు, 26 సిల్వర్ జూబిలీలు చేసుకోవడం తనివితీరా చూసిన వ్యక్తి.

అసాధారణమైన బాణీలు కట్టడంతో పాటు, అరుదైన చేపల్ని పట్టడంలోనూ ప్రవీణుడు.

ఇవన్నీ ఒకే మనిషి.

ఈయనెవరో అందరికీ తెలుసు. సమకాలీనులు సాధారణ స్రవంతిలో కొట్టుకుపోతే, తన స్రవంతిని తనే ఏర్పరచుకుని జీవితాంతం దానికి కట్టుబడి వున్న మహానుభావుడు, నౌషాద్ అలీ. 62 ఏళ్ల సినీ జీవితంలో 66 సినిమాలకు మాత్రమే సంగీతం అందించారంటేనే, ఆయన ప్రత్యేకత బోధపడుతుంది. 'ఈ రోజుల్లో రెండేళ్లలో 200 సినిమాలకు సంగీత దర్శకత్వం వహించే వారు కనబడుతున్నారు. మా రోజుల్లో ఒక్కొక్క బాణీ, ఒక్కొక్క పదం కుదరడానికి ఎన్నో నిద్రలేని రాత్రుళ్లు గడిపే వాళ్లం. అయినా ఈ నాటికీ నేను పరిపూర్ణత్వం కోసం వెతుకుతూనే ఉన్నాను.' అన్నారాయన తన సంగీత జీవితాన్ని వర్ణిస్తూ.

1919 డిసెంబర్ 25 న క్రీస్తు జన్మదినాన జన్మించిన నౌషాద్, ఆ కాలం నాటి చాలా మంది సినీ ప్రముఖుల్లాగే, తిండి, నిద్ర, వసతి లేని రాత్రుళ్లు బొంబాయిలో గడిపి, చివరకు ఖేమ్‌చంద్ ప్రకాశ్ దగ్గర అసిస్టెంట్‌గా చేరారు. 1940లో 'ప్రేమ్ నగర్'కు సంగీతం అందించినా, 1944లో 'రతన్' సినిమాతో, నౌషాద్‌కు విశేషమైన గుర్తింపు లభించింది. ఈ సినిమాలోని 'మిల్ కే బిఛడ్ గయీ అఖియా హాయ్ రామా (అమీర్‌బాయి)', 'సావన్ కే బాదలో'(జొహరా అంబాలా, కరన్ దివాన్), అలాగే 'అన్‌మోల్ ఘడీ'లోని 'ఆవాజ్ దే కహా హై'(నూర్జహాన్, శ్యామ్) ఈనాటికీ రేడియో సిలోన్‌లోను, వివిధ భారతిలోనూ చాలా తరచుగా వినిపిస్తూంటాయి. మనల్ని మురిపిస్తూంటాయి.

సంగీతదర్శకుడిగా నౌషాద్ అసాధారణ వ్యక్తిత్వం - ప్రతి గాయకుడిలోనూ, అతనికే లేదా ఆమెకే తెలీకుండా నిక్షిప్తమై ఉన్న ప్రతిభలోతులను గుర్తించడంలోనూ, వెలికి తీయడంలోనూ ఉంది. అలాగే శాస్త్రీయ సంగీతానికీ, సినిమా సంగీతానికీ మధ్య ఉన్న సరిహద్దు రేఖలను తుడిపేయడంలో ఉంది. హిందుస్తానీ సంగీత సంప్రదాయం ప్రకారం వేళలను బట్టి, ఋతువులను బట్టి రాగాలు పాడే పద్ధతిని, సినిమాల్లో సన్నివేశాన్ని బట్టి, మూడ్‌ని బట్టి ప్రయోగించిన సృజనాత్మకతలో ఉంది. తను మంచి సంగీతం అని భావించిన ప్రమాణాలకు జీవితాంతం కట్టుబడి ఉండి, ఏ పరిస్థితుల్లోనూ రాజీపడక పోవడంలోనూ, దాని కోసం సినీ జీవితం ఆనందంగా, హుందాగా నిష్క్రమించడం లోనూ ఉంది. అద్వితీయమైన కళాత్మక ప్రతిభ, అకళంకమైన వ్యక్తిత్వం కలిసి, నౌషాద్‌ను హిందీ చలన చిత్ర రంగంలో సాటిలేని కళాకారుడిగా నిలబెట్టాయి.

నౌషాద్ సినిమాల జాబితా చూస్తే, ఒక్కొక్క సినిమాలోనూ పాటల్ని గుర్తు తెచ్చుకుంటే, అతనికి శ్రోతలే కాదు, తోటి సంగీత దర్శకులు కూడ ఎంతో ఋణపడి వున్నారనీ, సినిమా పాటకు ఒక క్లాసిక్ స్థాయిని కల్పించడంలో అతని కృషి సమకాలీనులు చాలా మందికి ప్రేరణ ఇచ్చిందనీ అర్థమవుతుంది. 'బైజుబావరా' లో పాటల గురించి లతా మంగేష్కర్ ఆశ్చర్యపోతూ 'ఇంతకు పూర్వం ఎప్పుడూ నేను ఇలాంటి రాగ సంవిధానం వినలేదు. సినిమా సన్నివేశాలకు ఉచితమైనట్లుగా శాస్త్రీయ రాగాల్ని మారుస్తూనే, వాటి మూలాల్ని కాపాడ్డంలో నౌషాద్ కృతకృత్యుడయ్యారు' అంది. భైరవి రాగంలో సమకూర్చిన 'మొహె భూల్ గయే సావరియా' ఒక్కటి చాలు, లతా ఆశ్చర్యానందాలను అర్థం చేసుకోవడానికి. షాజహాన్, దర్ద్, దిల్లగీ, దులారీ, అన్‌మోల్‌ఘడీ, అనోఖీ అదా, అందాజ్, ఆన్, జాదూ, దీదార్, శబాబ్ సినిమాల్లో పాటలు ఎంత పాతవైనా, ఈ నాటికీ హృదయంగమంగా



ఉండటానికి నౌషాద్ కు బాణీలు కూర్చడంలో ఉన్న అధికారమే కారణం. ఇందాకే చెప్పినట్లు, గాయకులలోని సామర్థ్యాన్నంతా వెలికి తీయడం ఆయన ప్రత్యేకత.

'షాజహాన్'లోని 'హాయే హాయే యే జాలిమ్ జమానా' లో సైగల్ గాత్రంలోని విషాద మాధుర్యం, దులారీలోని 'సుహానీ రాత్ ఢల్ చుకీ' లో రఫీ కంఠస్వరంలో వియోగభారం, అందాజ్‌లోని 'తోడ్ దియా దిల్ మేరా', తూనే అరే బేవఫా' లో లతా దుర్భర వేదన ఈనాడు అర్ధ శతాబ్ది దాటిన తర్వాత కూడా అంతే తాజాగా ఉంటాయి.

అసలే క్లాసిక్ సంగీత కారుడైన నౌషాద్ సినీ జీవితంలో అత్యద్భుత మజలీలు మదర్ ఇండియా(1957), మొగల్-ఏ- అజమ్(1960), గంగా జమునా(1961), మేరే మహబూబ్(1963). ముఖ్యంగా మొగల్ -ఏ-అజమ్, మేరే మహబూబ్ సినిమాల సంగీతం గురించి ఎంత చెప్పినా తక్కువే. ఒక పీరియడ్ సినిమాకు సంగీతం ఎలా చేయాలో మొదటి సినిమా ద్వారానూ, క్రమంగా ఆధునికతను సంతరించుకుంటున్న సంప్రదాయ కుటుంబాల్లోని యువతీ యువకుల ప్రణయగాథకు ఎలాంటి సంగీత నేపథ్యం ఉండాలో రెండవ సినిమాలోనూ తెలుసుకోవచ్చు.

హిందీ చలన చిత్ర రంగంలో నేపథ్య సంగీతం ప్రాధాన్యాన్ని బహుశా అందరి కంటే ముందుగా గుర్తించింది నౌషాదే. మొగల్-ఎ-ఆజమ్ నుంచి టీ.వి. సీరియల్ టిప్పు సుల్తాన్ వరకు నౌషాద్ సినిమాలను చూసిన వారికి ఇది స్పష్టంగానే అర్థమవుతుంది. కాలానుగుణంగా పాశ్చాత్య సంగీతాన్ని వాడలేకపోయాడని ఆయన్ని నిందిస్తారు కానీ, నిజానికి సినిమా సంగీతంలో పాశ్చాత్యుల నొటేషన్ పద్ధతిని ప్రవేశ పెట్టింది ఆయనే. (ఆన్ సినిమా నొటేషన్ పుస్తకం కూడా ఉందిట.) అలాగే వంద వాయిద్యాల ఆర్కెస్ట్రాతో ఒక పాటను తయారు చేసింది కూడా మొదటిసారి నౌషాదే ('ఆన్' సినిమాలో). దాస్తాన్‌లో 'యే సావన్ రుత్ తుమ్ ఔర్ హమ్'(రఫి, సురయ్యా) వింటే, ఇది నౌషాద్ బాణీనా అని ఆ పాశ్చాత్య బీట్ విని ఆశ్చర్యపోతాం. అంటె, నౌషాద్ చాలా మంది అనుకునేట్టు, సంగీత విషయంలో కరుకుదేలిన భారతీయవాది కాదు. వాయిద్యాలలో కూడా నౌషాద్ చేసిన ప్రయోగాలు తర్వాత చాలా మంది అనుసరించారు. ఫ్లూట్‌ను, క్లారినెట్‌ని కలపడం, సితార్‌ని, మాండోలిన్‌ని జతపరచడం, హిందీ సంగీతానికి అకార్డియన్‌ని పరిచయం చేయడం నౌషాద్ ఘనతల్లో కొన్ని మాత్రమే.

బహుశా నౌషాద్ ఉపయోగించినన్ని నేపథ్య గాయకుల కంఠాలు మరెవ్వరూ వాడి ఉండరు. ఆయన పైకి తీసుకు వచ్చిన గాయకుల్లో సురయ్యా, ఉమాదేవి, మహేంద్రకపూర్ చెప్పుకోవాల్సినవారు. ఆయన సంగీతం పాడి, తమలోని వైవిధ్యాన్ని, సామర్థ్యాన్ని కొత్తగా కనుక్కున్న వారిలో ముఖ్యులు స్త్రీలలో జోహరాబాయి, నూర్జహాన్, షంషాద్‌బేగం, లతా మంగేష్కర్, పురుషుల్లో తలత్, రఫీ, ముఖేష్, కొందరి దృష్టిలో సైగల్ కూడా. ముఖ్యంగా కొన్ని దశాబ్దాలు హిందీ చలన చిత్ర సంగీతాన్ని ఏలిన రఫీ, లతాలలో ఆ పరిణతి తీసుకురావడంలో ఆయన పాత్ర ఎంతో కీలకమైంది.



రఫీ, జైకిషన్ లతో నౌషాద్,

స్వయంగా తనే రఫీ అభిమానినని గర్వంగా



ఈనాటికీ చెప్పుకునే నౌషాద్, బైజుబావరా తో రఫీ జీవితాన్నే మార్చేశారు. 'మన్ తడపత్ హరి దర్శన్ కో ఆజ్', 'ఓ దునియాకే రఖ్‌వాలే' ఈ రెండు పాటల్లోనూ, బాణిలోనే కాదు, పాడే విధానంలో రఫీ ప్రదర్శించిన వైవిధ్యం నౌషాద్ శిష్యరికం వల్లే సాధ్యమైంది. వీరిద్దరి కాంబినేషన్‌లో కొన్ని మాత్రమే చెప్పుకున్నా 'యే జిందగీకి మేలే (మేలా), 'మాన్ మేరా ఎహసాన్'(ఆన్), 'ఓ దూర్‌కే ముసాఫిర్ హమ్ కో భి సాథ్ లేలే రే'( ఉరన్ ఖటోలా), 'జిందాబాద్ ఐ ముహబ్బత్ జిందాబాద్'(మొగల్-ఏ-ఆజమ్), యహీ అర్‌మాన్ లేకర్ ఆజ్ అపనే ఘర్ సే హమ్ నికలే (దీదార్), నైన్ లడ్‌గయీ హైతో మన్ వామా కసక్ హోయ్ బేకరీ (గంగా జమున), మధుబన్ మే రాధికా నాచేరే(కోహినూర్), మెరే మెహబూబ్ తుఝే, ఐ హుస్న జరా జాగ్ తుఝే ఇశ్క్ జగాయే'(మేరా మెహబూబ్), 'జిందగీ ఆజ్ మేరే నామ్ సే శరమాతీ హై'(సన్ ఆఫ్ ఇండియా), 'అప్‌నీ ఆజాది కో హమ్ హరగిజ్ మిటా సక్తే నహీ'(లీడర్), కోయి సాగర్ దిల్ కో బహలాతా నహీ (దిల్ దియా దర్ద్ లియా), కల్ రాత్ జిందగీ సే ములాకత్ హోగయి(పాల్కి), ఆజ్ పురానీ రాహోమే(ఆద్మీ), ఆజ్ కీరాత్ మేరే దిల్ కీ సలామీ లేలే (రామ్ ఔర్ శ్యామ్) అలా వెళ్తూనే ఉంటుంది జాబితా.

అలాగే అందాజ్ లో 'ఉఠాయే జా ఉన్ కే సితమ్', మొగల్-ఏ-ఆజమ్ లో 'ప్యార్ కియాతో డర్ నా క్యా' దగ్గర్నుంచి అన్ని పాటలూ, లతా పరిణామ క్రమంలో నౌషాద్ పాత్ర ఎంత ముఖ్యమైందో మనకు స్పష్టం చేస్తాయి.

నౌషాద్‌ది గొప్ప కవి హృదయం. అందుకే సాహిత్యంలో వైవిధ్యం ఉన్న ప్రక్రియల్లో అతని సంగీతం గొప్పగా రాణించింది. ఖవాలీలు (మొగల్-ఏ-ఆజమ్ లోని షంషాద్-లత ల అత్యద్భుతమైన ఖవాలీలు), గజళ్లు, నగ్‌మాలు నౌషాద్ ప్రతిభకు అద్దం పడతాయి.

1960 దశకం చివరి నుంచి నౌషాద్ సంగీతానికి అనువైన కథలు, గీత రచన, నటులు

తగ్గారు. సాథీ, సంఘర్ష్ వరకు తన స్థాయిని కొంతయినా నిలుపుకున్నా ఆ తర్వాత నౌషాద్ పాటలు (గవార్, లవ్ అండ్ గాడ్, ఆవాజ్ దే కహా హై, గుడ్డు) ఆయన స్థాయికి తగ్గవిగా లేవని శ్రోతలే కాదు, స్వయంగా నౌషాదే గుర్తించారు. అందుకే మెల్లిగా తెర వెనక్కి తప్పుకున్నారు. ఈనాటికీ ఇంటర్వ్యూలలో, సినీ సంగీత కార్యక్రమాల్లో టీవీ ఛానెల్లపై కనిపించినప్పుడు, ఈవ్యక్తికి హిందీ సినీ సంగీతం ఎంత ఋణపడివుందా అనిపించకమానదు. దాదా సాహెబ్ ఫాల్కే, పద్మభూషణ్ వంటి గౌరవాలు ఆయనకి రావడం అత్యంత సహజం. వాటికంటే ఎక్కువగా ఈనాటికీ 'న మిల్ తా గమ్ తో బరబాదీ కే అఫసానే కహా జాయే(లతా-అమర్ చిత్రం), ప్యార్ కియాతో డర్నా క్యా, మొహబ్బత్ కీ ఝూఠీ కహానీ పే రోయే, సుహానీ రాత్ ఢల్ చుకీ(దులారీ), దుఃఖ్ భర్ దిన్ బిచడ్ భయ్యా(మదర్ ఇండియా) , ఢూండ్ ఢూండోరే సాజ్‌నా, దో హంసోంకా జోడా(గంగా జమునా) వంటి పాటలు వింటూ అవ్యక్తానందానికి గురయ్యే శ్రోతలు అన్ని తరాల్లోనూ, అసంఖ్యాకంగా ఉండటం నౌషాద్ గొప్పతనం. దుర్గమమైన శాస్త్రీయ సంగీతాన్ని సినిమా సంగీతంగా ఎంతో అందంగా మలిచిన సంగీతశిల్పి నౌషాద్.

నౌషాద్ సంగీతంలో ఒక వైభవం ఉంటుంది. బాణీల్లో ఎంత సంక్లిష్టత ఉంటుందో అంత మాధుర్యమూ ఉంటుంది. విశాలమైన భవన ప్రాంగణాలు, ధగధగలతో జిగేల్మనిపించే షాండిలియర్లూ, రత్నఖచిత ఆసనాలు, ఆకుపచ్చని దువ్వటి పరిచిన ఉద్యానవనాలు.....ఇంత సౌందర్య వైభవాన్ని .. వైభవంగాకాదు... దాన్ని ఆనందించి, మై మరచే ఒక రసహృదయుడి ఆలాపనగా మారిస్తే... అది నౌషాద్ 'పాట'. అందుకే ఆయన హిందీ చలన చిత్ర సంగీత సామ్రాజ్యానికి బాదుషా.

**- మృణాళిని**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1960

'దిల్ భి తేరా హమ్ భి తేరే' చిత్రం కోసం ముఖేష్ పాడిన 'ముఝ్‌కో ఇస్ రాత్ కీ తన్హాయీ మేఁ' ద్వారా కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు హిట్ కొట్టారు. ఇదే చిత్రంలో 'ఆద్మీ గరీబ్ హో...సంభాలో దిల్ జరా...' మహేంద్ర కపూర్‌తో గీతాదత్ కలిసి పాడారు. కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ ల కోసం గీతాదత్ పాడటం ఈ ఒక్క చిత్రానికే!


గీతాదత్

వీరే సంగీతం సమకూర్చిన 'ఢిల్లీ జంక్షన్' చిత్రం కోసం గుల్షన్ బావ్‌రా 'జాలిమ్ జమానే నే' గీతాన్ని రాశారు.

'కాలా బజార్' చిత్రం కోసం ఎస్.డి.బర్మన్ స్వర పరిచిన ' ఖోయా ఖోయా చాంద్', 'సచ్ హుయే సప్నే మేరే', 'రిమ్‌జిమ్ కే తరానే లేకే', 'న మైఁ ధన్ చాహూఁ', 'అప్నీ తో హర్ ఆహ్ ఇక్ తుఫాన్ హై', పాటలన్నీ హిట్సే! అలాగే దేవ్ ఆనంద్, సుచిత్రాసేన్ నటించిన 'బొంబై కా బాబు' చిత్రం కోసం స్వరపరిచిన 'చల్ రీ సజనీ', 'దేఖ్‌నే మేఁ భోలా హై', (ఏరువాక సాగాలోయ్ ట్యూన్) 'మంజిల్' కోసం స్వర పరిచిన 'యాద్ ఆ గయీ', 'చుప్కే చుప్కే', 'కుఛ్ హమ్ కుఛ్ తుమ్' పాటలు మంచి హిట్స్ అయ్యాయి.

'మేరా ఘర్ మేరే బచ్చే' చిత్రం కోసం సర్దార్ మాలిక్ స్వరపరిచిన 'చాంద్ కే దేస్', 'బహారోం సే పూఛో మేరే ప్యార్' పాటలు హిట్ అయ్యాయి. 'సారంగా' చిత్రం కోసం ముఖేష్ పాడిన 'సారంగా తేరీ యాద్ మేఁ' ను మాలిక్ కెరియర్‌లో అతి పెద్ద హిట్ గా పేర్కొనవచ్చు.

ఎస్. మొహిందర్ స్వర పరిచిన 'జమీన్ కే తారే' టైటిల్ ట్రాక్, ఎస్.ఎన్.త్రిపాఠీ రాజస్తానీ జానపద నేపథ్యంలో స్వరపరచగా లతా-ముఖేష్‌లు పాడిన 'తారే కాజలియాఁ బనా లూఁ' పాటలు ఈ సంవత్సరంలో హిట్ అయిన మరికొన్ని గీతాలు.

'కానూన్' చిత్రం కోసం సలిల్‌చౌధురీ అందించిన బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ పాటలు లేకపోయినప్పటికీ ఓ చిత్రం సూపర్ హిట్ కాగలదని నిరూపించింది.

## 1961

శంకర్-జైకిషన్, హస్రత్, శైలేంద్రల కాంబినేషన్ తమ హవాను కొనసాగిస్తూనే ఉన్నారు. ఈ సంవత్సరం వీరి కాంబినేషన్‌లో వచ్చిన 'జబ్ ప్యార్ కిసీ సే హోతా హై', 'జంగ్లీ', 'జిస్ దేశ్ మే గంగా బెహతీ హై', 'ససురాల్', కరోడ్‌పతీ, రూప్ కీ రాణి చోరోఁ కా రాజా, బాయ్ ఫ్రెండ్, ఆస్ కా పంఛీ' వీరి ముద్రను స్పష్టంగా


'జబ్ ప్యార్ కిసీ సే హోతా హై' లో ఓ సన్నివేశం

పేర్కొనటం జరిగింది.

'జబ్ ప్యార్ కిసీ సే హోతా హై' లో శంకర్-జైకిషన్ పాటలన్నీ హిట్సే! 'యే ఆంఖో ఉఫ్ ఉమ్మా', 'సౌ సాల్ పెహలే', (తెలుగులో 'అందాల బొమ్మలాగ ముందునిలిచి వుంటివి' అనేపాటకు ఇన్‌స్పిరేషన్) 'తేరీ జుల్ఫోఁ సే జుదాయీ' తో పాటు టైటిల్ సాంగ్( 'ఆరాధన' (1969) చిత్రంలోని 'మేరే సప్నోం కా రాణి' పాటకు విజువల్ ఇన్‌స్పిరేషన్ ఈ పాటే!) కూడా సూపర్‌హిట్సే! అయినా రెమ్యూనరేషన్ ఎక్కువ డిమాండ్ చేశారనే కారణంగా తన తదుపరి చిత్రానికి శం-జైలను రిపీట్ చేయటం లేదని నిర్మాత, దర్శకుడు నాసిర్ హుస్సేన్ ప్రకటించి సంచలనం సృష్టించారు.

'ససురాల్' చిత్రం కోసం శంకర్-జైకిషన్ స్వర పరిచిన 'తేరీ ప్యారీ ప్యారీ సూరత్', 'ఎక్ సవాల్ మైఁ కరూఁ', 'జానా తుమ్హారే ప్యార్ మేఁ', 'సతా లే ఏ జహాఁ', 'కరోడ్‌పతి' చిత్రంలోని 'పెహలే ముర్గీ హుయి కే అండా' , 'రూప్ కి రాణి చోరోఁ కా రాజా'సినిమాలో 'తుమ్ తో దిల్ కే తార్', 'బాయ్ ఫ్రెండ్' చిత్రంలో 'ధీరే ఛల్ ధీరే ఛల్ హే బీగీ హవా', 'ఆస్ కా పంఛీ' చిత్రంలో 'తుమ్ రూఠీ రహో మై మనాతా రహూఁ' పాటలు మ్యూజికల్‌గా హిట్ అయ్యాయి.

అయితే ఈ సంవత్సరం వారికి చక్కటి గుర్తింపు తెచ్చిన చిత్రం 'జంగ్లీ'. షమ్మీకపూర్ ఆల్‌టైమ్ హిట్స్‌లో ఒకటిగా చెప్పుకునే ఈ


'జంగ్లీ' చిత్రంలో షమ్మీ కపూర్, సైరాబానూ

చిత్రంలోని అన్ని పాటలూ హిట్ కావటమే కాదు 'యాహూఁ, చాహే కోయీ ముఝే జంగిలీ కహే' పాట ద్వారా ఇంటర్నెట్‌ల గురించి తెలియని రోజుల్లోనే యాహూ అనే పదాన్ని బాగా పాప్యులర్ చేసింది ఈ చిత్రమే. 'అయ్యాయ్యో కరూఁ మైఁ క్యా సూకూ సూకూ' గీతం ఇంకో హిట్. సైరాబానుకు టాప్‌స్టార్ స్థాయి గుర్తింపు వచ్చింది. రఫీ, లతా లు విడివిడిగా పాడిన 'ఎహసాన్ తేరా హోగా ముఝే' పాట కూడా హిట్ అయింది.

-(వచ్చే సంచికలో మరికొంత)

# నౌషాద్ హిట్స్



**చిత్రం: బైజు బవ్‌రా**

**గానం: లతా** **రచన: షకీల్ బదయూని**

మొహె భూల్ గయే సాంవరియా
భూల్ గయే సాంవరియా
భూల్ గయే సాంవరియా
ఆవన్ కహ్ గయే అజహూ న ఆయే
లేలీ న మేరి ఖబరియా
భూల్ గయే సాంవరియా
దిల్ కో దియే క్యోం దుఖ్ విరహ్ కే
తోడ్ దియే క్యోం మహల్ బనా కే
ఆస్ దిలాకే ఓ బేదర్దీ
ఫేర్ లీ కాహె నజరియా
మొహె భూల్ గయే సాంవరియా
భూల్ గయే సాంవరియా
నైన్ కహేఁ రో రో కే సజనా
దేఖ్ చుకే హమ్ ప్యార్ కా సపనా
ప్రీత్ హై ఝూటీ, ప్రీతమ్ ఝూటా ఝూటీ హై సారీ నగరియా
మొహె భూల్ గయే సాంవరియా
భూల్ గయే సావరియా

**చిత్రం: రామ్ ఔర్ శ్యామ్**

**గానం: రఫీ** **రచన: షకీల్ బదయూని**

యే రాత్ జైసే దుల్హన్ బన్ గయీ హై చిరాగోం సే
కరూంగా ఉజాలా మై దిల్ కే దాగోఁ సే
ఆజ్ కీ రాత్ మేరే, దిల్ కీ సలామీ లే లే
దిల్ కీ సలామీ లేలే
కల్ తేరీ బజ్మ్ సే దీవానా చలా జాయేగా
షమ్మా రహ్ జాయేగీ పర్వానా చలా జాయేగా ॥ఆజ్॥
తేరీ మెహఫిల్ తేరే జల్వే హో ముబారక్ తుఝ్‌కో
తేరీ ఉల్ఫత్ సే నహీఁ ఆజ్ భీ ఇన్‌కార్ ముఝే
తేరా మయ్-ఖానా సలామత్ రహే యే జాన్-ఎ-వఫా
ముస్కురాకర్ తూ జరా దేఖ్ లే ఇక్ బార్ ముఝే
ఫిర్ తేరే ప్యార్ కా మస్తానా చలా జాయేగా ॥కల్ తేరీ॥
మైనే చాహా కి బతా దూఁ మైఁ హకీకత్ అప్‌నీ
తూనే లేకిన్ న మేరా రాజ్-ఏ-ముహబ్బత్ సమ్‌ఝా
మేరీ ఉల్‌ఝన్ మేరే హాలాత్ యహాఁ తక్ పహుఁచే
తేరీ ఆంఖోఁ నే మేరే ప్యార్ కో నఫ్‌రత్ సమ్‌ఝా
అబ్ తేరీ రాహ్ సే బేగానా చలా జాయేగా ॥కల్ తేరీ॥
తూ మేరా సాథ్ న దే రాహ్-ఏ-ముహబ్బత్ మేఁ సనమ్
చల్‌తే చల్‌తే మై కిసీ రాహ్ పే ముడ్ జావూంగా
కహ్‌కశాఁ చాంద్ సితారే తేరే చూమేంగే కదమ్
తేరే రస్తే కీ మైఁ ఎక్ ధూల్ హూఁ ఉడ్ జావూంగా
సాథ్ మేరే మేరా అఫ్‌సానా చలా జాయేగా

**చిత్రం: మేరే మెహబూబ్**

**గానం: రఫీ** **రచన: షకీల్ బదయూని**

మేరే మెహబూబ్ తుఝే మేరి ముహబ్బత్ కీ కసమ్
ఫిర్ ముఝే నర్‌గిసీ ఆంఖోఁ కా సహారా దే దే
మేరా ఖోయా హువా రంగీన్ నజారా దే దే ॥మేరే మెహబూబ్॥
భూల్ సక్‌తీ నహీఁ ఆంఖేఁ వో సుహానా మంజర్
జబ్ తేరా హుస్న్ మేరే ఇష్క్ సే టక్‌రాయా థా
ఔర్ ఫిర్ రాహ్ మేఁ బిఖరే యే హజారోం నగ్‌మేఁ
మైఁ వో నగమేఁ తేరీ ఆవాజ్ కో దే ఆయా థా
సాజ్-ఏ-దిల్ కో ఉన్హీ గీతోం కా సహారా దే దే॥మేరా ఖోయా॥
యాద్ హై ముఝ్‌కో మేరి ఉమ్ర్ కీ పహలీ వో ఘడీ
తేరీ ఆంఖోఁ సే కోయీ జామ్ పియా థా మైఁనే
మేరే రగ్ రగ్ మేఁ కోయీ బర్ఫ్ సి లహరాయీ థీ
జబ్ తేరే మర్‌మరీ హాథోం కో ఛువా థా మైనే
ఆ ముఝే ఫిర్ ఉన్హీ హాథోం కా సహారా దే దే॥మేరా ఖోయా॥
మైనే ఇక్ బార్ తేరి ఎక్ ఝలక్ దేఖీ హై
మేరీ హస్‌రత్ హై కి మైఁ ఫిర్ తేరా దీదార్ కరూఁ
తేరే సాయే కో సమఝ్ కర్ మైఁ హసీఁ తాజ్‌మహల్
చాంద్‌నీ రాత్ మేఁ నజరోఁ సే తుఝే ప్యార్ కరూఁ
అప్‌నీ మహకీ హుయీ జుల్ఫోం కా సహారా దే దే ॥మేరా ఖోయా॥
ఢూండతా హూఁ తుఝే హర్ రాహ్ మేఁ హర్ మెహఫిల్ మేఁ
థక్ గయే హైఁ మేరీ మజ్‌బూర్ తమన్నా కే కదమ్
ఆజ్ కా దిన్ మేరీ ఉమ్మీద్ కా హై ఆఖరీ దిన్
కల్ న జానే మైఁ కహాఁ ఔర్ కహాఁ తూ హో సనమ్
దో ఘడీ అప్‌నీ నిగాహోం కా సహారా దే దే॥మేరా ఖోయా॥
సామనే ఆ కే జరా పర్దా ఉఠా దే రుఖ్ సే
ఇక్ యహీ మేరా ఇలాజ్-ఏ-గమ్-ఏ-తన్హాయీ హై
తేరీ ఫుర్‌కత్ నే పరేషాన్ కియా హై ముఝ్‌కో
అబ్ తో మిల్ జా కి మేరీ జాన్ పే బన్ ఆయీ హై
దిల్ కో భూలీ హుయీ యాదోఁ కా సహారా దే దే ॥మేరాఖోయా॥

**చిత్రం: దిల్ దియా దర్ద్ లియా**

**గానం: రఫీ** **రచన: షకీల్ బదయూని**

కోయీ సాగర్ దిల్ కో బెహలాతా నహీఁ ॥2॥
బేఖుదీ మేఁ భీ కరార్ ఆతా నహీఁ ॥కోయీ॥
మైఁ కోయీ పత్థర్ నహీఁ ఇన్‌సాన్ హూఁ ॥2॥
కైసే కహ్ దూఁ గమ్ సే ఘబ్‌రాతా నహీఁ ॥కోయీ॥
కల్ తో సబ్ థే కారవాఁ కే సాథ్ సాథ్ ॥2॥
ఆజ్ కోయీ రాహ్ దిఖ్‌లాతా నహీఁ ॥కోయీ॥
జిందగీ కే అయినే కో తోడ్ దో ॥2॥
ఇస్‌మేఁ అబ్ కుఛ్ భీ నజర్ ఆతా నహీఁ ॥కోయీ॥

# కరెంటు మీటర్



\- బచ్చు వీర్రాజు

ఉదయం ఏడుగంటలయ్యింది. అప్పుడే వచ్చిన పేపర్ అందుకుంటూ ఓసారి హాల్లోని కరెంటుమీటర్ వంక చూసాను. నిన్నటికీ, ఈ రోజుకీ ఆరు యూనిట్లు కాలినట్లుగా చూపిస్తోంది. గుండె గుభేలుమంది. యింట్లో కూలర్‌గాని, ఫ్రిజ్‌గాని, గీజర్‌గాని లేకపోయినా, కరెంటు అంత దారుణంగా ఎలా కాలిపోతోందో అర్థం గావడం లేదు. కోడలు పురిటికెళ్లింది. అబ్బాయి బిజినెస్‌రీత్యా సరిగ్గా యింట్లోనే వుండడు. యిక వుంటున్నది నేనూ, నా శ్రీమతి మాత్రమే. సుమారు నెలకు రెండువందల యూనిట్లు కాలుతూ, నా పెన్షన్ డబ్బులు అతి దారుణంగా మింగేస్తున్న మా కరెంటుమీటర్ వంక కసిగా చూశాను. యింతలో శ్రీమతి టీ తో వచ్చింది.

"ఇదిగో... నేనింట్లో లేనప్పుడు మన కరెంటు ఎవరికైనా అమ్మేస్తున్నావా?" కంఠం పెద్దది చేసి అడిగాను - టీ కప్పు అందుకుంటూ.

"ఛా! వూరుకోండీ. అవేం మాటలు? నేను కరెంటు అమ్ముకోవడమేంటీ?" శ్రీమతి కూడా గట్టిగానే సమాధానం చెప్పింది.

"కాకపోతే మన పెరటి వైపున్న మీ బాబాయ్ కొడుకు పెట్టిన సా మిల్లుకు గానీ, ఆ ప్రక్కనే వేలు విడిచిన నీ మేనత్త కొడుకు నడిపే సినిమా థియేటర్‌కు గానీ, వాళ్ళ కరెంటు పోయినప్పుడల్లా మన యింట్లోంచి కరెంటు లాక్కోమని లైసెన్స్ యిచ్చేశావా?" యింకాస్త గట్టిగా అడిగాను.

"అంత సీనేం లేదు. ఊరికే ఎందుకు కారాలూ మిరియాలూ నూర్తారూ" అంది శ్రీమతి కళ్ల నీళ్ళతో.

"లేకపోతే మనం యిద్దరమేవున్న యీ కొంపలో కరెంటు ఎందుకంత దారుణంగా కాలిపోతోంది మరి?" కాస్త నెమ్మదిగా అడిగాను ఈసారి.

"నా చేత్తో నేను, ఆ టీ.వీ కూడా పెట్టుకోను తెలుసా మీకు?" అంటూ ప్రకటించింది శ్రీమతి రుసరుసలాడుతూ.

"అయితే ఈ మీటర్ ఏదో 'బకాసుర్' కంపెనీకి చెందిందంటావా? ఊళ్లోవాళ్ళు కాల్చిన కరెంటునంతా లాగేసుకొని, రీడింగ్ పేరుతో నా కొంప ముంచేస్తోంది!?" నాలోనేనే గొణుక్కున్నాను.

"ఏమోమరి! కంప్లైంట్ యివ్వమంటే యివ్వరాయె! అందుకు అనుభవించక తప్పుతుందా?" అంది శ్రీమతి నా వంక గుచ్చి చూస్తూ.

"అవును. అదీ పాయింటే!" అంటూ వెంటనే ఓ తెల్లకాగితం, పెన్నూ అందుకున్నాను.

* * *

శ్రీ ఎలక్ట్రికల్ యింజనీర్ గార్కి

అయ్యా,

సర్వీస్ కనెక్షన్ నెంబరు 36710 తాలూకు కరెంటుమీటర్, అతి ఘోరంగా తిరిగిపోతూ, మమ్మల్ని రంపపు కోతకు గురిచేస్తున్నది. కేవలం యిద్దరమే వుంటున్న మా మధ్యతరగతి కుటుంబం, కరెంటు బిల్లుల దెబ్బకు తట్టుకోలేక అల్లల్లాడిపోతున్నాం. దయచేసి బకాసురుని అంశతో వెలసిన, యీ కరెంటు మీటర్‌ను మార్చి మమ్మల్ని ఆదుకోగలరు.

అంటూ కంప్లైంట్‌ను రాసి పోస్ట్ చేశాను.

* * *




వారం రోజులు గడిచాయి. ఏ విధమైన రెస్పాన్స్ రాలేదు. కరెంటు డిపార్ట్‌మెంట్ మీద విసుక్కుంటూ...

అయ్యా,

నేను, మా కరెంటు మీటర్ అతి దారుణంగా తిరిగిపోతూ, హెచ్చురీడింగ్‌లతో నా కొంప గుల్ల చేస్తున్నదనీ, దానిని మార్చి మరో కొత్త మీటర్ వెయ్యగలందులకు లోగడ మీకు విన్నవించడం జరిగింది. అయితే, మీరు యింతవరకూ ఏ చర్యా తీసుకోలేదు. దయచేసి నా యీ విన్నపమును మన్నించి, ఆ మీటర్ స్థానంలో మరో కొత్తమీటర్ వేయించి పుణ్యం కట్టుకోగలరు.

అంటూ తిరిగి మరో కంప్లైంట్ రాసి పోస్ట్ చేశాను.

* * *

మరో పదిరోజులు గడిచాయి. ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ నుంచి ఉలుకూలేదూ పలుకూ లేదు. నాకు పిచ్చెక్కడం మొదలుపెట్టింది.

ఓ రోజు నేను ఈజీ ఛైర్‌లో కూర్చుని పేపర్ చదువుతుంటుంటే ఎవరో వచ్చినట్లు అలికిడైతే తలఎత్తి గుమ్మం వైపు చూశాను.

కరెంటు రీడింగ్ వాళ్లు గేటు తీస్కుని వస్తున్నారు. నేను లేచి వీధి తలుపు తీశాను. యింతలో నా బుర్రలో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది. దానిని ఆచరణలో పెట్టాలను కున్నాను. ఆ వచ్చిన యిద్దరిలోనూ ఓ వ్యక్తి మధ్య వయస్సులో వుంటే, మరొకతను ఇరవై ఏళ్ళ కుర్రాడు. మధ్యవయస్సుగల వ్యక్తి రీడింగ్ చూడబోతుంటే, నేను నెమ్మదిగా అతని భుజం తట్టాను. ఆ వ్యక్తి నా వంక చూశాడు.

"బాబూ! పెన్షన్ మీద బ్రతుకున్న వాణ్ణి. వచ్చే నెల మా బంధువులు తాలూకు యిళ్లల్లో చాలా పెళ్ళిళ్లు వున్నాయి. ప్రయాణపు ఖర్చులూ, బహుమతుల ఖర్చులూ తట్టుకోవాలి. వాటినుంచి తప్పించుకోడానికి కాస్త యీ నెల ఓ యాభై యూనిట్లు ఎక్కువ వేసి పుణ్యం కట్టుకో నాయనా!" అన్నాను అతనిని బ్రతిమాలుతూ.

"సార్! రీడింగ్ ఎక్కువైతే ఫరవాలేదు. తక్కువ వెయ్యమంటేనే రిస్క్. అంచేత దానికి అంతగా బ్రతిమాలనవసరం లేదు. యాభై యూనిట్లు ఎక్కువ కాల్చినట్లు రీడింగ్ నోట్ చేస్తున్నాను." అన్నాడావ్యక్తి చిరునవ్వుతో.

నా జేబులోంచి ఓ పదిరూపాయల నోటు తీసి నెమ్మదిగా అతని షర్ట్ జేబులో కుక్కాను. దానికావ్యక్తి హుషారుగా ఆ నోటు వంక చూసి, బయటకు దారి తీశాడు. అతని వెంట వచ్చిన కుర్రాడు కూడా బయటకు నడిచాడు.

ఆ మధ్యవయస్సువ్యక్తి వెళ్లిపోయే ముందు తన చంకలో పెట్టుకొన్న, తాను నోట్ చేసిన రీడింగ్ పుస్తకాన్ని ఓసారి నాకు చూపించి మరీ వెళ్ళాడు. ఆ వ్యక్తి నా మాట మన్నించి యాభైయూనిట్లు ఎక్కువ వేసినట్లు, ఓసారి మీటర్ వంక చూసి నిర్ధారించుకున్నాను.

ఈ తతంగం ముగిసిన ఓ గంట తర్వాత, మా బావమరిది కొడుకు సతీష్ అమలాపురం నుంచి ఆదరాబాదరాగా మా యింట్లోకి ప్రవేశించాడు.

వస్తూనే "మావయ్యగారూ! మా చెల్లాయి ఉషకి అబ్బాయి పుట్టాడు. మిమ్మల్నీ, అత్తయ్యనీ వెంటనే తోడుపెట్టుకుని రమ్మని అమ్మా, నాన్నా పంపించారు" అన్నాడు ఒగురుస్తూ.

యింతలో శ్రీమతి వంటింట్లోంచి హాల్లోకి వస్తూ "సరేరా! అలాగే వస్తాం. ముందు భోజనానికి లే" అంటూ లోపలకు తీసుకు వెళ్ళింది.

యిలా యిల్లు వదిలి వెళ్ళడం కూడా నా పథకానికి ఒక విధంగా మంచిదే అని అనుకున్నాను మనసులో.

భోజనాలయ్యాక అంతా అమలాపురం బస్ ఎక్కాం.

* * *

మా బావమరిది పట్టుపట్టడం వల్ల అక్కడే ఓ వారం రోజులు వుండిపోక తప్పలేదు. ఎనిమిదో రోజున యింటికి రాగానే, ప్రక్కింటి వాళ్ళబ్బాయి కరెంటుబిల్లు తీసుకువచ్చి నాకందించాడు. స్పాట్ బిల్లింగ్ పద్ధతి యింకా మావూరు రానందున యిల్లు తాళం వేసి వుండటంతో మా కరెంటు బిల్లు ప్రక్కింటి వాళ్లకిచ్చినట్లు తెలిసింది. ఓసారి బిల్లువంక చూసాను. రీడింగ్



యాభై యూనిట్లు ఎక్కువ పడి దానికి తగ్గట్టుగానే చార్జీలమొత్తం చూపించారు. యింక నా పథకం ఆచరణలో పెట్టాలనుకొని, ఓ కాగితం పెన్నూ తీస్కున్నాను.

* * *

ఎలక్ట్రికల్ యింజనీర్ గార్కి

అయ్యా,

లోగడ నా కరెంటు మీటర్ చాలా స్పీడుగా తిరుగుతూ నన్ను బిల్లుల మోతతో యిల్లు అమ్ముకునే పరిస్థితికి లోనయ్యేటట్లు చేస్తుందనీ దానిని మార్చి కొత్త మీటర్ వేయించమనీ, రెండు కంప్లైంట్లు యిచ్చి వున్నాను. తమరు వాటిని లెక్కచెయ్యలేదు. ప్రస్తుతానికి మీరు కొత్తమీటర్ వెయ్యనవసరం లేదు. ఎందుకంటే ఈ మధ్య మా మీటర్ నా పాలిటి "బంగారపు గని"గా మారినది. క్రిందటి వారం తీసిన రీడింగ్‌తో, ఈ రోజు రీడింగ్ పోల్చి చూస్తే, ఓ యాభై యూనిట్లు వెనక్కి తిరుగుతున్నట్లుగా రీడింగ్ చూపిస్తోంది. గనుక దయ వుంచి నా యిదివరకటి కంప్లైంట్స్ రద్దుపరుస్తూ యీ మీటర్‌నే వుంచ ప్రార్థన.

* * *

ఆ మర్నాడు మధ్యాహ్నం మూడు గంటలయ్యింది. మా యింటిముందు ఓ జీపు, వ్యాను ఆగినట్లు శబ్దం అయ్యింది. అందులోంచి ఓ పదిమంది మనుషులు దిగి, మా యింట్లోకి రావడం మొదలుపెట్టారు.




నేను గబగబాలేచి, వీధి తలుపు తీశాను. నన్ను త్రోసుకుంటూ అంతా మీటర్ వైపు నడిచారు. ఒకాయన తన చేతిలోని ఫైలు తిరగేస్తూ ఓసారి మీటర్ వంక చూసి "వాట్ రెండువేల నూట యాభై రెండు యూనిట్లు రికార్డ్ అయితే యిప్పుడు రెండువేల నూట నాలుగు యూనిట్లు చూపిస్తోంది. నలభై ఎనిమిది యూనిట్లు బ్యాక్ రన్నింగ్. కమాన్! చేంజ్ దిస్ బ్లడీ మీటర్!" అంటూ మీటర్ సీళ్లు చెక్ చేస్తూ, తన సిబ్బందికి హుకుం జారీ చేశాడు.

అంతే పదినిముషాల్లో పాత మీటర్ లాగి పారేసి ఓ అట్టపెట్టెలో ప్యాక్ చేసివున్న కొత్త మీటర్‌ను తీసి ఆ స్థానంలో బిగించేశారు. ఓ వ్యక్తి ఓ పుస్తకం తెరచి అందులోనన్ను సంతకం పెట్టమన్నాడు. నేను ఏమీ మాట్లాడకుండగా సంతకం పెట్టాను. నన్ను ఏ ఒక్కరూ ఏమీ అడగలేదు.

మరి కొన్ని క్షణాల్లో ఎలా వచ్చినవాళ్ళు అలాగే వెళ్లిపోయారు.

"ఏఁ వోయ్... సాయంత్రం ఫస్ట్ షోకి ఓ రెండు టిక్కెట్లుంచమని మీ మేనత్త కొడుకుకు చెప్పు.... సిన్మాకెళ్దాం" అంటూ మా ఆవిడకు వినబడేలా కేకేశాను - విజయగర్వంతో హుషారుగా. ■



**ఘంటసాల క్విజ్ - 14 విజేతలు**

మొదటి బహుమతి
శ్రీమతి ఆర్. ప్రియంవద, మార్కాపూర్.

రెండవ బహుమతి
శ్రీ నేమాని సీతారాం, విజయవాడ.

మూడవ బహుమతి
శ్రీ డి.వెంకట్రావ్, సాలూరు.

**సరి అయిన సమాధానాలు**

1. షావుకారు
2. నలదమయంతి
3. టింగురంగ
4. మెరుపువీరుడు
5. ప్రేమించిచూడు

**బహుమతులు**

మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.

రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.

మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.


క్యాలెండర్లు మారినా క్యారెక్టర్లు మారవు
ఇదే డిసెంబర్-31 రాత్రి మందుకు డబ్బుల్లేవని ఆత్మహత్య చేసుకున్నా! మరి నువ్వు?
మందెక్కువై యాక్సిడెంట్లో చచ్చా!!
స్వామి
డిసెంబర్ 31 WED
ఈ ఏడాది నుండీ... నేను క్లబ్బుకెళ్ళడం, పేకాడ్డం, గుర్రప్పందాలకెళ్ళడం... అన్నీ మానేస్తాను... నువ్వు 'టీవీ' చూడ్డం మానేస్తావా?
స్వామి
ఈ ఇయర్ అంతా వర్క్ లేకుండా జాలీగా గడిచిపోయింది వచ్చే న్యూ ఇయర్ ఎలాగుంటుందో!
మేనేజర్
S.A.
J.A.
స్వామి
లవర్స్ పార్కు
ఈ ఇయర్తో పాటు నీకూడా వీడ్కోలు చెప్తున్నా! డార్లింగ్... బై....
స్వామి
ఈ ఏళ్ళే ఫస్ట్ ఫస్ట్... దిసీజ్ లాస్ట్ రేపట్నుంచి... మందు ఆగనే... నన్ను నమ్మ!
పోయిన సంవత్సరం కూడా ఇలాగే చెప్పారు గుర్తుందా?
XXX
స్వామి
ఈ ఏళ్ళ -31 తో చిల్లర దొంగతనాలు మానేస్తున్నావా... ఎందుకు?
రేపట్నుంచీ... బస్సు టాపేలు రైలు దోపిడీలు మాత్రమే చేయాలనుకుంటున్నా!
స్వామి
కంగారు పడకండి సురూ నేను గంగులుని... మీకు న్యూ ఇయర్ శుభాకాంక్షలు చెబుదామని ...
డిసె 31
స్వామి
సెంట్రల్ జైల్
అబ్బే.... పారిపోవడానికి కాదు సార్ కొత్త సంవత్సరానికి ఆహ్వానం పలుకుతూ.... దారి చేస్తున్నాం... అంతే... !!
స్వామి

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



ప్ర॥ ఏ,బీ, సీ, డీ లలో చల్లగా ఉండేవి, వెచ్చదనాన్నిచ్చేవి ఏవి?
జ॥ ఏసీలు, బీడీలు
ప్ర॥ నలుసు?
జ॥ కడుపులో పడితే పంట, కంట్లో పడితే మంట.
ప్ర॥ బిల్లు నేను కడతా, నేను కడతా అని రెచ్చిపోతూ చేతిని మాత్రం జేబులోకి పోనివ్వని వాళ్లని ఏమనాలి?
జ॥ మాటల్లో కంటే చేతల్లో ఎక్కువ నిగ్రహం చూపేవాళ్లనాలి.
ప్ర॥ చావగొట్టి చెవులు మూయడమంటే?
జ॥ ముందు బాంబులు వేసి, తర్వాత ఆహారపొట్లాలు జార విడవడం.

**-రమణ శాస్త్రి, సంగారెడ్డి**

## చిలిపి లిపి



पानी M = పానీయం
Jaw రు do Bun డ = జారుడు బండ
Flue 2 = ఫ్లూటు

**-పి.వి.పవన్‌కుమార్, హైదరాబాద్**

## ఈ రూటేవేరు




Head of Zoology = పశుపతి
Head of Maths = గణపతి

**-మామిడి మహేంద్ర, పూణే**

కనిగిరి = See Hill
తిమ్మసముద్రం = Monkey Sea

**-మాధవి, రవి, దైవలరావూరు**



## పేరు - రిపేరు



ఆమె - రాంబాబు గాడి పెళ్లాం
దొంగోడు - సత్తా - చూడాలనివుంది
బ్యాక్‌పాకెట్ - మనీ - నీ కోసం

**-వై.ధీరజ్‌కుమార్, నందిగామ**

## చిలిపి కవిత



మా పని మనిషి పేరు రత్తి
ఆమె చూపు ఓ చురకత్తి
ఆమె పై వలపు మొలకెత్తి....
రోజూ కొట్టడం మొదలెట్టా ప్రేమ సుత్తి
దాంతో దాని మామ తీశాడు నా తిత్తి
అప్పట్నించీ ఆడదాన్ని చూస్తే చాలు స్టార్టవుతుంది నాకు నత్తి
ఏంచేస్తాం...దేవుడికిదో రకం తుత్తి!!

**-బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం**

## డబుల్ రోల్



మా వూరి **కామందు** ఏ వ్యాధికా **మందు** ఇస్తూ ఉంటాడు.

**-పి.యస్.యస్.పవన్ గణేష్, తాడేపల్లిగూడెం**

ఆ **గని** లో జరిగినది నీవు ఎరగని వాడివా?
ఈ **వడి** యాలను ఆ చా**వడి** లో ఆరబెట్టు
ఇది ఆ కా**వడి** లో **వడి వడి** గా పెట్టు

**-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి**

## షార్ట్‌కట్స్



పుల్లెల లింగమూర్తి = పులి

- డి.బెనర్జీ, శ్రీకాకుళం

ఈరంకి గంగమ్మ = ఈగ
దోసూరు మంజుల = దోమ
గార డిప్పల దశరథ్ = గాడిద
కోరుకొండ తిమ్మరాజు = కోతి
పాటిబండ్ల మురళీధర్ = పాము

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**

## పేరడీ పెరేడ్



మనసున ముల్లై - బ్రతుకున బండై
మొగుడొకడుండిన
అదే ఖర్మమూ - అదే నరకమూ ॥మనసున॥
కట్నము చాలని ఆవేశములో
రంకెలు వేసే ఆక్రోశముతో
జుట్టునుపట్టి బయటకు ఈడ్చే
మొగుడొకడుండిన
అదే ఖర్మమూ - అదే నరకమూ ॥మనసున॥
నిన్ను నిన్నుగా - హింసించుటకు
తిట్టికొట్టి, బాధించి చంపుటకూ
నేనున్నానని మొండిగ నిలిచే
మొగుడొకడుండిన
అదే ఖర్మమూ - అదే నరకమూ ॥మనసున॥
వంటల రుచికీ - వంకలుపెట్టీ
కంచం విసిరీ - కేకలు వేసీ
తోలు బెల్టుతో నిను బాదుటకూ
మొగుడొకడుండిన
అదే ఖర్మమూ - అదే నరకమూ ॥మనసున॥
('డాక్టర్ చక్రవర్తి' సినిమాలో 'మనసున మనసై' పాటకు పేరడీగా)

**-బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్ రాసిన బి.చంద్రశేఖరయ్య(రామసముద్రం) గారికి బ్లిస్ ఆడియో వారు 'గెలుపు', కాశి ఆడియో క్యాసెట్స్‌ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**





# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

లతా మదన్‌మోహన్‌లు సమర్పించిన గీతాసుమాలు అమ్లాన పారిజాతాలు. నేనెప్పుడూ నాలో నేనే నెమరువేసుకునే గీతాలలో కొన్ని ముఖ్యమైనవి ఇక్కడ చర్చించగోరుతున్నాను. కారణం వాటి విశిష్ట వైశిష్ట్యం. పదే పదే స్మరించి పాడుకోదగిన తేనె ఊటలూరే పాటలు.

"సప్‌నేమెఀ సజన్ సే దోబాతేఀ! ఇక్ యాద్ రహీ ఇక్ భూల్‌గయే" అనే గీతం మదన్‌మోహన్ స్వరపఱచిన వైనం అనన్యసాధ్యం. రిషభంలో ప్రారంభించి, రిషభంలోకి దించిన మొదటి వాక్యం అద్భుత మేధాసంపత్తికీ కల్పనాశక్తికీ నిదర్శనం. లతా చేకూర్చిన మోడ్యులేషన్, ఎడోరేషన్‌కి తగిన ప్రత్యేకత. ఆలాపనలో సంతులనం ఆమెకే సాధ్యమైన సాధన. చరణంలో, మొదటి వాక్యాన్ని ధైవతంలో ప్రారంభించి మధ్యమంలో నిలిపి మళ్లీ ధైవతంలో ఆపి "దదదాదదదదనిదవ, వదమగమదవనిదననినరిననీద" అనే ప్రయోగం, ఏ మనసునైనా ఉఱ్ఱూతలూగించక మానదు. ఈ పాట ఎన్నిసార్లు విన్నా, మళ్లీ మళ్లీ వినాలని అనిపించక మానదు. బ్యూటీ ఏమిటంటే, ఇదివరలో నేను సూచించిన "సప్‌నా" అనే చిత్రానికై జయదేవ్ స్వరరచన, "జానేకిత్‌నీ బార్ హృదయ్ సే మైఀనే ఉసే పుకారా"లో కూడా లతా మోడ్యులేషన్ బేలెన్స్ ఎండ్ పెర్‌ఫెక్షన్, విస్మయం కలిగిస్తాయి. నౌషాద్ 'తోడ్‌దియా దిల్‌మేరా', సజ్జాద్ అజ్‌మేరే నసీబ్‌నే' వంటి గీతాలన్నీ లతాకి లభించిన మోడ్యులేటింగ్ టెక్నిక్‌కి నిలువుటద్దాలు. ఉత్తమ సంగీత రచనలకి సముచిత ఉదాహరణాలు.

మదన్‌మోహన మధుర స్వరరచనలలో నన్ను అలౌకికానందంలో తేలించేవి ముఖ్యంగా రెండు "ఆప్‌కీ నజ్‌రోఀనే సంఝూ ప్యార్‌కే కాబిల్ ముఝే, "న తుం బేవఫావో, న హం బేవఫాహైఀ' అనే రెండు గీతాలు, స్వరరచనలోనూ, ఆలాపనలోనూ పరాకాష్ఠనందుకున్న సృజనలు, స్వప్నంలో కూడా మన మనసుని వదలని మధురస్మృతులు. అర్థభావాలతో పరిపుష్టి పొంది, సంతుష్టి కలగజేయగల డ్రీమీ కంపోజింగ్స్ & రెండరింగ్స్. ఈ రెండు సాంగ్సు గుఱించే వాల్యూమ్స్ రాసెయ్యవచ్చు - ఆత్మని అలరించి, ఆవేదనానందాన్ని పంచి యిచ్చే భావస్తోత్రాలు. కమర్షియల్ వేల్యూన్ గుఱించి పట్టించుకోకుండా రసాత్మకంగా ఈస్థటిక్ ఆర్టిస్టిక్ బ్యూటీని దివ్యశిల్పంగా చెక్కగలిగే మదన్‌మోహన్ ట్యూన్లకి, లత గానం గోల్డ్‌కి అబ్బిన ఫ్రాగ్రెన్సు.

జీవన మాధుర్య పూర్ణ మకరందం, "వో కౌన్‌థీ" అనే చిత్రంలో పాటలు హాంటింగ్ ఎలిమెంట్ నిండినవే. "నైనా బర్‌సే రిం ఝిం రిం ఝిం", "లగ్‌జా గలే" అనే రెండు గీతాలూ

## రజతోత్సవ తార లతా 'ఇష్టపది'

**1967**లో సిల్వర్ జూబిలీ సందర్భంగా టెన్ బెస్ట్ సాంగ్స్ పేర్కొనమని అడుగగా లతా ఉదహరించిన పాటలు ఇవి -

1. ఓ సజనా బర్‌ఖా బహార్ (పరఖ్-1960) సలిల్ చౌధురీ
2. కహీ దీప్ జలే కహీ దిల్ (బీస్ సాల్‌బాద్ - 1962) హేమంత్‌కుమార్
3. లగ్ జా గలే కీ ఫిర్ యే హసీ రాత్ హో న హో (వో కౌన్ థీ - 1964) మదన్‌మోహన్
4. బేకస్ పే కరమ్ కీజియే సర్‌కార్-ఎ-మదీనా (మొఘలే ఆజమ్ - 1960)
5. అల్లా తేరో నామ్ ఈశ్వర్ తేరో నామ్ (హమ్ దోనో - 1961) జయదేవ్
6. ఐరీ మై తో ప్రేమ్ దీవానీ మేరా దర్ద్ న జానే కోయీ (నౌబహార్- 1952) రోషన్
7. జీవన్ డోర్ తుమ్హీ సంగ్ బాంధీ (సతీసావిత్రి-1964)
8. మవలాత్యా దినకరా (మరాఠీ భజన్) - హృదయ్‌నాథ్ మంగేష్కర్
9. బైరన్ నీంద్ నా ఆయే మోహే (చాచా జిందాబాద్ - 1959) మదన్ మోహన్
10. బహారే ఫిర్ భీ ఆయేంగీ మగర్ హమ్ తుమ్ జుదా హోంగే (లాహోర్-1949)

వీటిలో గమనించవలసిన అంశాలేమిటంటే మదన్‌మోహన్‌వి రెండు వున్నాయి. తమ్ముడు హృదయనాథ్‌ది ఒకటి, అప్పటికింకా పేరు తెచ్చుకోని లక్ష్మీ-ప్యారేవి ఒకటి ఉండగా సి.రామచంద్ర, శంకర్-జైకిషన్, ఎస్.డి.బర్మన్‌లు ఎక్కడా కానరారు. వారే కాదు, గులాం హైదర్, ఖేమ్‌చంద్ ప్రకాశ్, హుస్నలాల్-భగత్‌రామ్, అనిల్‌బిశ్వాస్ కూడా! ఆ సమయానికి తనకు నచ్చని మనుష్యులకు ఆ సందేశం ఎలా అందజేయాలో లతాకు తెలిసున్నంత బాగా వేరెవరికీ తెలియదు! - కమ్యూనికేటర్ ఫీచర్స్

మన మస్తిష్కాన్ని సదా వెంటాడుతూనే వుంటాయి. "దేఖ్ కబీరా రోయే అనే చిత్రంలో "మేరీ బీనాతుఝ్ బిన్‌రోయే, సజ్‌నా సజ్‌నా సజ్‌నా" అని సాగే మీనింగ్‌ఫుల్ లిరిక్కుకి మదన్‌మోహన్ ట్యూన్ చక్కగా కుదిరింది. ఏ మాత్రం మార్పు చేసినా ఈ అందం కుంటుపడక తప్పదనిపిస్తుంది. అహీర్ భైరవ్ రాగంలో ఆత్మనే దొలిచేలాగ మట్టు కట్టారు మదన్‌మోహన్. ఆ స్వరరచనకి అత్యోధిక జీవం పోశారు. లతా అనుభవించి, ఆలాపించి 'సజ్‌నా' అని మూడు పర్యాయాలు, మూడు విభిన్న రీతులలో మూడు పర్యాయాలు, మూడు విభిన్న రీతులలో లత కురిపించిన భావం, రసజ్ఞతకి పులకింత పుట్టిస్తుంది. చక్రవాకానికి దగ్గఱగా వుండే ఈ రాగాన్ని ఎన్నుకోవడంలోనే మదన్‌మోహన్ అభిరుచి గోచరిస్తుంది. మదన్‌మోహన్‌లో తొణికిసలాడే భావుకతే ఈ ప్రాశస్త్యానికి మూల కారణం. ఆ భావుకతకి లత ప్రతిభా, రసజ్ఞతా తోడైనప్పుడు, రంజకత్వానికి కవిత్వమే ప్రశంసాశైలి. ఊహించుకుంటేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది. ఆనందాతిరేకంతో ఆత్మవేదన ఆక్రోశిస్తుంది. ఆ అనుభూతిని వర్ణించాలంటే మహాకవులకైనా సాధ్యం కాని పని -

లతా పాడిన పాటల సంఖ్య గుఱించి, సదా చర్చలు జరుగుతూనే వున్నాయి. తలొకరూ తలొక విధంగా రిమార్కులు పాస్ చేస్తూ వుంటారు. ఏమైనా ఆమె చాలా వేల పాటలు పాడారు అన్న నిజాన్ని అందఱూ ఒప్పుకు తీరతారు. నా ఆలోచన ఎప్పుడూ, ఆమె ఎన్ని పాటలు పాడారు అని ఆలోచించదు. కారణం, ఎవరెన్ని పాటలు పాడారు అనేది గొప్ప చర్చనీయాంశం కాదని నా అభిప్రాయం. ఎలా పాడారు అనే విషయమే అతి ముఖ్యం. ఆ విషయానికొస్తే లతా పాడిన ఏ పాటలైనా ఎలాంటి పాటలైనా ప్రాముఖ్యం పొందినవే. సాధారణ గీతాలు కూడా అసాధారణ గీతాలుగా రూపొంది, అందర్నీ రంజింపజేస్తాయి. అది ఆమె గొంతులోని ప్రత్యేకత. శంఖంలో పోస్తే సాధారణ జలం తీర్థంగా రూపొందినట్లే. లతా గళంలో పలికే ఏ గీతమైనా సుధారసధారగా ప్రవహిస్తుంది అనడం అతిశయోక్తి అనిపించుకోదు. ఆమె గళ ప్రభావం వలన, జీవహీన స్వరరచనకి కూడా జీవం లభించింది. ఆ గీతానికి దివ్యత్వం సిద్ధిస్తుంది. కనుకనే తను పాడిన పాటలలో ఏవి గొప్పవి అనే ప్రశ్నకి ప్రత్యుత్తరం ఆమెకే తటాలున స్ఫురించదు. త్రాసులో పదే పదే తూచి, కాచి, వడబోసిన పిమ్మట, అప్పుడప్పుడు ఆమె కొన్ని పాటలు తనకి ప్రత్యేకంగా నచ్చినవి అని పేర్కొనడం కద్దు. విచిత్రమేమిటంటే ఆ లిస్టులో అందఱూ అనుకునే కొన్ని గీతాలు చోటు చేసుకోవు.



మచ్చుకి కొన్ని పాటల్ని లతకి నచ్చినవీ, ఆమె ప్రత్యేకంగా మెచ్చినవీ. ఈ సందర్భంలో ఉటంకించడం సమంజసం కాదని నా వ్యక్తిగతాభిప్రాయం -

సంగీత మహామేధావి అనదగిన సజ్జాద్ హుసేన్ గుఱించి ఎవరైనా అడిగితే ఆమె ప్రత్యుత్తరం, ఆయన పట్ల ఆమెకు గల గౌరవభావం విశదమౌతుంది. సజ్జాద్ స్వరరచనని ఆలపించడం, అనిపించేటంత సులభం కాదు. ఎలాటి గొప్ప గాయకులకైనా ఒక ఛాలెంజిగా పరిణమిస్తుందని ఆమె నొక్కి వొక్కాణిస్తారు. 1951వ సంవత్సరంలోనే నర్గీస్ దిలీప్‌కుమార్లు నాయికా నాయకులుగా నటించిన ఆనాటి 'హల్‌చల్' చిత్రంలో నర్గీస్‌కై తను పాడిన పాట, "ఆజ్ మేరే నసీబ్‌నే" నిరుపమాన స్వరరచన అని ఆమె అభిప్రాయం. తనకి కావలసిన సూక్ష్మ వివరాలన్నీ రాబట్టుకోగల పెర్‌ఫెక్షనిస్టు సజ్జాద్

## లతా - అనిల్ బిశ్వాస్



లతా 25 సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా హెచ్.ఎమ్.వి. వారు విడుదల చేసిన స్పెషల్ సిల్వర్ రికార్డులో అనిల్ బిశ్వాస్ పాట ఒక్కటీ లేదు !

నిజానికి వారి కాంబినేషన్‌లో ఎన్నో మంచి పాటలు వెలువడ్డాయి - 'ఏక్ దిల్ కా లగానా బాకీ' (అనోఖా ప్యార్), బరస్ బరస్ బద్‌లీ భీ బిఖర్ గయీ (గజ్రే), జానా నా దిల్ దూర్ అంఖోం సే దూర్ జా కే (ఆర్‌జూ) తుమ్హీ కహో మేరా మన్ క్యూం నా రహే ఉదాస్ (గర్ల్స్ స్కూల్) ఇలా ఎన్నో. ఇవేకాదు బేకసూర్, ఆరామ్ బడీబాహూ, తరానా, హమ్‌దర్ద్, మెహమాన్, రాహీ, నాజ్, జల్తీ నిశానీ వంటి అనేక సినిమాలలో ఎన్నో గొప్ప పాటలు లతాచే పాడించాడు అనిల్ బిశ్వాస్.

1958లో లతా ఓ వ్యాసం రాస్తూ అనిల్ బిశ్వాస్‌ను ఇలా ప్రశంసించింది - 'అనిల్ బిశ్వాస్ బెంగాలీయే అయినా ఉర్దూ కూడా బాగా వచ్చు. సినిమాలో సన్నివేశం బట్టి రాగాలు నిర్ణయించి గాయకుల చేత తననుకున్న రీతిగా పాడించగల నేర్పరి ఆయన. పాడేవాళ్ల పరిమితులను మనసులో పెట్టుకుని కాంప్రమైజ్ అయ్యే రకం కాదు. మహారాష్ట్రలో పాటలో మాటల కంటె తానం మీద ఎక్కువ దృష్టి పెడతారు. నేను అలాగే పాడే దశలో అనిల్ పరిచయమయ్యి పదాన్ని ఎలా పలకాలో నేర్పారు. వాయిస్ మాడ్యులేషన్ నేను అనిల్ వద్దనే నేర్చుకున్నాను.

నిజానికి లతాకు శ్వాసపై కంట్రోలు నేర్పినది అనిల్ బిశ్వాసే! పాట పాడుతూ మాధుర్యం చెడకుండా ఊపిరి పీల్చుకోగలగడం లతాకు ఆయనే నేర్పాడు. అంతేకాదు, లతాను నూర్జహాన్ మూసలోంచి బయటకు లాక్కొచ్చి ఒక ఇండివిడ్యువాలిటీ ఇచ్చినది ఆయనే! అయినా లతా టెన్ బెస్ట్ సాంగ్స్‌లో అనిల్ పాట చోటుచేసుకోలేదు. ఈ విషయమై పత్రికల వాళ్లు లతాను అడుగగా ఆమె కూల్‌గా "ఆ పాటలు సెలక్ట్ చేసినది నేను కాదు కదా!" అంది, ఆవిడని అడక్కుండానే హెచ్.ఎమ్.వి. వారు అంతకు సాహసించేటట్టు! అంతటితో ఆగకుండా "అయినా నేను అనిల్ బిశ్వాస్ వద్ద పెద్దగా పాడలేదులెండి" అంది. అనిల్ సంగీత దర్శకత్వంలో లతా 30 సినిమాలకై 123 పాటలు పాడిందనీ, వాటిలో 90 సోలోలు ఉన్నాయని తెలిసిన పాత్రికేయులు తెల్లబోయారు. అనిల్ బిశ్వాస్ భార్య మీనాకపూర్ కూడా గాయనే. 'ఒక్కోప్పుడు మీనాను ప్రోత్సహించడానికి కొన్ని మంచి పాటలు ఆవిడకి ఇచ్చాడని లతా కోపం' అని కొంతమంది వ్యాఖ్యానించారు. నిజానిజాలు లతాకే ఎఱుక!

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

# రాజవంశీకుడితో మెలడీ

సచిన్‌దేవ్ బర్మన్ లతాచే ఆరేళ్లపాటు పాడించలేదు. ఆ పేచీకి మూలం వ్యక్తిపరమైన కారణం కాదు, వృత్తిపరంగా లతా శ్రద్ధ వహించలేదని బర్మన్ ఫీలవడం వల్ల అలా జరిగింది.

వృత్తిపరమైన నిష్ఠకూ, క్రమశిక్షణకు, అంకితభావానికి బర్మన్ పెట్టింది పేరు. తన ఆర్కెస్ట్రా సభ్యులందరూ పొద్దునే లేచి ఒక గంట ఫుట్‌బాల్ ప్రాక్టీసు చేయాలని సలహా ఇచ్చేవాడు. అలా అయితేనే 'ఫామ్'లో ఉంటారని ఆయన అభిప్రాయం. తూర్పు బెంగాల్‌లో పుట్టి, త్రిపుర రాజవంశంలో పెరిగినా తను ఉదయాన్నే 3.30 కల్లా లేచి గంటసేపు మార్నింగ్ వాక్ చేసేవాడు.




అంతేకాదు, తన వృత్తిలో వ్యక్తిగత సమస్యలను చొరబడనిచ్చేవాడు కాదు. నిజానికి భార్యకు, ఆయనకు పడేది కాదు. ఇంట్లో భార్యతో పోట్లాడి వచ్చినా స్టూడియోలో మాత్రం ఆ ఛాయలేవీ కనబడనిచ్చేవాడు కాడు. అదే విధంగా సింగర్‌తో అనవసరంగా వ్యక్తిగత సంబంధం పెంచుకునేవాడు కాడు. ఏ పాటకు ఎవరు 'సూట్' అవుతారనుకుంటే వారినే పిలిచేవాడు. నా ఫేవరేట్ సింగర్ అనో, ఆశ్రితుడనో అన్ని పాటలూ వారికే ఇవ్వడం జరిగేది కాదు.

సి.రామచంద్ర, ఓ పి నయ్యర్‌ల పద్ధతి ఇది కాదు. నచ్చినవారిచేతనే అన్ని పాటలూ పాడించడం వల్ల వ్యక్తిగత జీవితంలో వచ్చిన ఒడిదుడుకులు వారి కెరియర్‌పై ప్రభావం చూపించాయి. బర్మన్ మాత్రం తన ప్రొఫెషనలిజమ్ కారణంగా, మరణించే దాకా అంటే నాలుగు దశాబ్దాలపాటు డిమాండ్‌లో ఉన్నాడు. లతాతో ఆయన పోట్లాట కూడా ఒక పాట గురించే జరిగింది.

'సితారోం సే ఆగే' అనే సినిమాకై 'పగ్ ఘుమక్ చలత్ బల్ ఖాయే హాయే సయ్యా కైసే ధరూ ధీర్' అనే పాటను బర్మన్ లతాచే పాడించాడు. పాట రికార్డింగు సమయంలో 'ఈ పాటను ఎక్స్‌ట్రా సాఫ్ట్ వాయిస్‌లో పాడు' అని లతాకు ఆదేశించాడు. పాట ఓకే అయింది. రికార్డింగు తర్వాత వింటే బర్మన్‌కు అంత సాఫ్ట్ వాయిస్ నచ్చలేదు. మామూలుగానే పాడిస్తే మంచిదనుకున్నాడు.

అనుకుని తన అసిస్టెంటుగా ఉన్న జయదేవ్ చేత లతాకు ఫోన్ చేయించాడు 'ప్రస్తుతం నేను విదేశాలకు వెళ్లే సన్నాహాలలో ఉన్నాను. రీరికార్డింగుకు ఇప్పుడు సమయం చాలదు' అంది లతా. జయదేవ్ ఆ విషయం పక్కనే ఉన్న బర్మన్‌కి చెప్పాడు. 'అలా అయితే ఫారిన్ నుండి తిరిగిరాగానే మనకే ఫస్ట్ ప్రిఫరెన్స్ ఇచ్చి పాడమను' అన్నాడు బర్మన్. జయదేవ్ లతాకు అదే చెప్పాడు. 'అలాటి కమిట్‌మెంట్స్ నేను ఫోన్ మీద ఇవ్వను. వచ్చాక చూడాల్సిందే!' అంది లతా. జయదేవ్ కాస్త లౌక్యం ప్రదర్శించి వుంటే ఏమయేదో కానీ ఉన్నదున్నట్టు, అన్నదన్నట్టు చెప్పేశాడు. దాంతో బర్మన్‌కు ఒళ్లు మండింది. 'మనకు ఫస్ట్ ప్రిఫరెన్స్ ఇవ్వలేని పక్షంలో అసలు పాడనే అక్కర్లేదని చెప్పు!" అన్నాడు.

లతా విదేశాలకు వెళ్లిపోయింది. బర్మన్ ఆశాచే ఆ పాటను మళ్లీ పాడించాడు. కానీ అదీ తృప్తికరంగా రాకపోవడంతో సినిమాలో లతా పాటనే పెట్టాడు. లతామీద కోపాన్ని పాట మీద చూపించలేదు. అదీ బర్మన్ వృత్తి నిబద్ధత అంటే!

ఆ తర్వాత ఆరేళ్లపాటు బర్మన్ లతాను పిలువలేదు. ఆశా చేతనే పాడించేవాడు. ఈ మధ్యలో పార్టీల్లో ఒకరి కొకరు ఎదురుకావడం నమస్కార ప్రతినమస్కారాలు చేసుకోవడం జరిగేది. ఇలా ఎంతకాలం సాగేదో కానీ 'బందిని' చిత్రనిర్మాణం సందర్భంగా బర్మన్‌కు ఓ పాటను లతాచేతనే పాడించాలని అనిపించింది. అదే సినిమాలో ఆశాచేత 'అబ్ కే బరస్', 'ఓ పంఛీ ప్యారే' వంటి అద్భుతమైన పాటలు పాడించినా 'జోగీ జబ్ సే తూ ఆయా మేరే ద్వార్' పాట పాడడానికి లతాచేత పాడిస్తేనే న్యాయం జరుగుతుందని అనిపించింది బర్మన్‌కు.

ఇంతలో రాహుల్‌కి 'ఛోటే నవాబ్' సినిమా ఛాన్సు వచ్చింది. 'మీ ఆశీర్వాదం కావాలి. నా సినిమాలో పాట పాడాలి' అంటూ రాహుల్ లతాను ఇంటికి ఆహ్వానించాడు. అక్కడ సీనియర్ బర్మన్ ఉన్నాడు. 'ఇలా రా, నీతో మాట్లాడాలి' అంటూ పక్కగదిలోకి తీసుకెళ్లి తీవ్రమైన స్వరంలో 'ఏం లతా, నా మీద నీకెందుకు కోపం?' అంటూ ప్రశ్నించాడు. 'బాగుంది, పాట పాడమని మీరు పిలవలేదు. ఫిర్యాదు చేయవలసినది నేను. తీరా చూస్తే మీరు నా మీద కోప్పడతున్నారు' అంది లతా.

'సర్లే, సర్లే. అవన్నీ ఒదిలేయ్. నువ్వో మంచిపాట పాడాలి. డేట్ ఎప్పుడిస్తావ్ చెప్పు' అన్నాడు బర్మన్ రాచఠీవితో. ఇక లతా ఏం మాట్లాడగలుగుతుంది?

మంచి గాయకులు కూడా. మెండొలిన్ వాదనలో సరేసరి. ఆ వాద్యానికి కన్సర్ట్ స్టేటస్ అందజేసిన ఘన వ్యక్తి ఆయనే. ఆలాప్ పాడేటప్పుడు కంఠ స్వరాన్ని అదుపులో ఎలా పెట్టుకోవాలో లతకి ఆయన స్పష్టంగా వివరించి చెప్పేవారట - "మధుమతి"లో వైజయంతీమాలకి లత పాడిన "ఆజారే పర్‌దేశీ" మాత్రమే కాక అందులోని అన్ని పాటలూ ఆమెకి ఎంతగానో నచ్చిన గీతాలట. "ఆజారే పర్‌దేశీ" పాట రికార్డవ్వగానే కవి శైలేంద్ర లతకి సుమగుచ్ఛం సమర్పించారట. దర్శకులు బిమల్‌రాయ్ ప్రశంసా పుష్పవర్షం కురిపించారట - సౌందర్యానికి మాధుర్యం జత చేసిన 'లత' పాడిన ఆ పాట ఆత్మకి ఆత్మ అందించిన పిలుపు. సహజంగానే లత వాయిస్‌లో హాంటింగ్ ఎలిమెంట్ నిండివుంది. దానికి తగ్గట్టు, హాంటింగు ట్యూనూ, హాంటింగ్ సీక్వెన్సూ కుదిరితే ఇహ చెప్పాలా దాని ఎఫెక్టు! ఈనాటికీ రసజ్ఞుల మనస్సుని రంజింపచేస్తూ,

# క్వీన్ పేజీ

ఆ విధంగా 'బందినీ'లో 'జోగి జబ్ సే తూ ఆయా మేరే ద్వార్' పాటే కాదు దానితో పాటు మరో చిరస్మరణీయమైన 'మోరే గోరా అంగ్ లెయ్ లే' పాట కూడా పాడింది లతా. ఆ తరువాత 'గైడ్'లో 'పియా తోసే'..ఇలా ఎన్నో గొప్ప పాటలు వారి కాంబినేషన్‌లో వెలువడ్డాయి. వాటిలో కొన్ని

తుమ్ న జానే కిస్ జహా మే ఖో గయే (సజా)
జిసే తూ కబూల్ కర్ లే (దేవ్‌దాస్)
చాంద్ ఫిర్ నిక్‌లా (పేయింగ్ గెస్ట్)
ఖన్‌కే కంగ్‌నా బిందియా హసే (డా.విద్యా)
తేరే ఖయాలోం మే తేరే హీ ఖ్వాబోం మే (మేరీ సూరత్ తేరీ ఆంఖే)
అయే తన్హాయీ హాయ్ రే హాయ్ (తేరే ఘర్ కే సామ్నే)
తుమ్ హమే ప్యార్ కరో యా న కరో (క్రైసే కహూ)
రాత్ కా సమా ఝూమే చంద్రమా(జిద్దీ)
రులాకే గయా సప్నా మేరా (జ్యూయల్ థీఫ్)
కిత్‌నీ అకేలీ కిత్‌నీ తన్హా సీ లగీ ఉన్‌సే (తలాశ్)
తుమ్ ముఝ్ సే దూర్ చలే జానా న (ఇశ్క్ పర్ జోర్ నహీ)
రంగీలా రే తేరే రంగ్ మే (ప్రేమ్ పూజారి)
కిత్నే దిన్ ఆంఖే తరసేంగీ (నయా జమానా)
మేఘా ఛాయే ఆధీ రాత్ (శర్మీలీ)
నీంద్ చురాయే చైన్ చురాయే (అనురాగ్)
పియా బినా పియా బినా (అభిమాన్)

**- ఎమ్బీయస్ ప్రసాద్**

## లతా గానలహరి

చిత్రం : అనార్కలి (1953)
సంగీతం : సి.రామచంద్ర
రచన : రాజేంద్రకిషన్

యె జిందగీ ఉసీ కీ హై
జో కిసీకా హోగయా
ప్యార్ హీ మై ఖోగయా ॥యె॥
యే బహార్ మే సమా
కెహ రహా మై ప్యార్ కర్
కిసీ కి ఆర్‌జూ మై అప్‌నే
దిల్ కో బేకరార్ కర్
జిందగీ హై బేవఫా
లూట్ ప్యార్ కా మజా ॥యె॥
ధడక్ రహా హై దిల్ తో క్యా
దిల్ కీ ధడ్‌కనే న గిన్
ఫిర్ కహా యే ఫుర్‌సతే
ఫిర్ కహా యే రాత్ దిన్
ఆ రహీ హై యే సదా ఆ...
ఆ రహీ హై యే సదా
మస్తి మోఁ మె డూబ్ జా ॥యె॥



ప్రదీప్‌కుమార్, బీనారాజ్

హాంట్ చేస్తూనే వుంది. లతకి మొదటి ఫిలింఫేర్ ఎవార్డు తెచ్చి యిచ్చిన పాట ఇదే! సుందర గాత్రానికి (శరీరం), మధురగాత్రం (శారీరం) తోడై ప్రజల మన్ననలకి "పాత్రం" అయి నేత్రాలకీ, కర్ణాలకీ సాక్షాత్కరించింది -

సలీల్ చౌదరి స్వరపఱచిన మరొక గీత పారిజాతం పరఖ్ చిత్రంలో ప్రతిధ్వనించిన "ఓ సజ్‌నా! బర్‌ఖాబహార్‌ఆయీ' కూడా ఎవర్ లాస్టింగ్ హాంటింగ్ సాంగ్. దసరా పూజ సమయాన సలీల్ ఈ పాటని మొదట బెంగాలీ భాషలో రాసి తరువాత దానికి హిందీ రూపాంతరంగా, ఈ పాటని సమర్పించారట. పల్లవి పరిమళాలు వెదజల్లే వల్లరి(లత)యై దిగ్దిగాంతాల వ్యాపించింది.

ప్రముఖ అంతర్జాతీయ సితార్ విద్వాంసులు శ్రీ పండిట్ రవిశంకర్, హృషికేశ్ ముఖర్జీ చిత్రం 'అనురాధ'కై స్వరపఱచిన 'కైసేదిన్‌బీతే' గీతంలోని శాస్త్రీయత (Classicism) అద్వితీయం. ఆయన లతకి, పాటలోని మెలకువలన్నీ పూసగుచ్చినట్లుగా తెలియజేసిన మీదట, లతకి మొదట్లో కలిగిన శంక ఇట్టే మాయమైందట.

'రుస్తుం సొహ్రాబ్' చిత్రానికై సజ్జాద్ చేసిన ట్యూన్ "ఐ దిల్‌రుబా" అనే గీతం, లతకి అతిగా నచ్చిన పాటల్లో అగ్రశ్రేణి గీతమట. "అరబ్బీ" శైలిలో సాగే ఆ పాట 'లత' గొంతులో ఒక నూతనత్వం సృజించింది - ఏ స్వరాన్నీ అతిగా నొక్కకుండా తేలికగా, గాలిలో తేలేలాగ పాడాలని సజ్జాద్ సూచించారట - తనకి నచ్చిన పాటలతో ఎన్ని లిస్టులు తయారు చేసినా, ఈ బెస్టు ట్యూనుని ఆ లిస్టులలో చేర్చకపోతే, నిండుతనం వుండదని 'లత' అభిప్రాయం. అంతగా అభిమానంతో పాడడం వలన ఆ గీతం అందరికీ "దిల్‌రుబా"(ప్రియురాలు)గా తోచి, సంగీతవాద్యంలా అలరించింది. ఈ పాటలో కూడా లత కావించిన ఆలాపనని, తనకి అత్యంత ప్రియమైన "రిషభ" స్వరంలో నిలిపి కంపోజ్ చెయ్యడం, సజ్జాద్ ముద్రని సంతకంలా స్ఫురింపజేస్తుంది. నో డౌట్!!

లింకు బిట్సులో మేండొలిన్ ఆది విశిష్ట వాద్య ప్రయోగం. దూరాన నినదించే స్వరజలపాతం లాగ వీనులకి విందు చేస్తుంది.

లతా పాటని ఏ మాత్రం డిస్టర్బ్ చేయకుండానే "ఆకాశ్‌దీప్" అనే చిత్రానికి, చిత్రగుప్త సంగీతం అందించారు. అందులో "దిల్‌కాదియా జలా" అనే గీతం ఒక గొప్ప వ్యక్తి ట్యూన్ చేసిన గొప్పమట్టు. గొప్ప హిట్టు అని వ్యాఖ్యానించిన లతకి, చిత్రగుప్త కుటుంబ సభ్యులందఱూ మిత్రులే. అప్పట్లో,పిచ్చాపాటీ మాట్లాడుకునేందుకు చిత్రగుప్త పరివారాన్ని తఱచూ కలుసుకునేవారట. ఆ పరివార మిత్ర బృందంలో, మీనా, ఉషా, చిత్రగుప్త, ఆయన సహాయకుడు దిలీప్ ధోలక్‌యా, ఆల్‌రౌండ్ ఆర్టిస్ట్ లిరిక్ రైటర్ ప్రేంధవన్ మున్నగువారందరూ సభ్యులు. కాని కొంత కాలం తరువాత ఎక్కువగా కలుసుకునేందుకు అవకాశం వుండేది కాదట. చిత్రగుప్త ఎప్పుడు రికార్డింగుకి రావాలని ఫోన్ చేసినా లత నిరాకరించేవారే కారట.

ఓసారి చిత్రగుప్త తన చిరిగిపోయిన చెప్పుల గురించి చెబుతూ 'ఈ పరిస్థితిలో కూడా, ఈ చెప్పులని వదిలేందుకు నాకు మనస్కరించదు, చాలా లక్కీ చెప్పులని నా నమ్మకం' అనేసరికి, సహజ చతురోక్తులకి అలవాటు పడిన లత చటుక్కున 'మీకు ఈ చెప్పుల పట్ల ఉన్నంత విశ్వాసం బహుశా మా గాయనీ గాయకుల గానం పట్ల కూడా లేదనిపిస్తోందని' చమత్కరించేసరికి, మిత్రబృంద సభ్యులందఱూ విరగబడి నవ్వారట! **(ఇంకావుంది)**




తెలుగు సినీ చరిత్రలో శాశ్వత కీర్తిని సంపాదించుకున్న

## శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం

(బాలాజి)

చిత్రంలోని పాటలలో గత సంచికలో నాలుగిటిని గురించి వివరించగా మరో ఆరు పాటల గురించి ఈ సంచికలో...

యశోద: చిరు చిరు నగవుల చిలికే తండ్రీ మురిసితినయ్యా పున్నెముపండీ ॥చిరు॥
నవ్వులే యింత తీయనైనవే పలుకులెంతగా మధురములౌనో
విని సంబరపడ మది తొందరపడె మక్కువతీరా మాటలాడరా ॥చిరు॥
యదుబాలా! గోపాలా! అందెలు ఘల్లన ఇటురారా ॥యదు॥
చక్కని నాన్నా టక్కులుమానీ అక్కున చేరి అమ్మా అనరా ॥చక్క॥
అల్లిబిల్లి జాబిల్లి ఆటలా నినుచూచి పొంగి తరింతునురా ॥యదు॥
కొంటెవాడ నీ తుంటరిపనులకు గోకులమంతా గోలపెట్టెరా
కృష్ణ: అల్లరిచేయని పిల్లలింటికి అలంకారము కారు కదమ్మా?
యశోద: అలాగా! పెండ్లిచేసి నీ కాళ్లకు బంధము వేయాలయ్యా వెన్నదొంగా!
కృష్ణ: అత్తరికము చేయ్యాలని నీకు ఆశగవుందని అనవమ్మా
యశోద : అవునయ్యా... అదే నా కోరిక... ఎప్పుడు తీరుస్తావు నాయనా






ఆత్రేయ రాసిన ఈ పాటలో శాంతకుమారి ముఖ్య గాయని కాగా బాల, స్వర్ణలత అక్కడక్కడ గాత్ర సహకారాన్ని అందించారు. 'పూర్వజన్మలో నీవు యశోదవు' అంటూ వకుళకు నారదుడు తెలుపగా ఆ పూర్వ జన్మ జ్ఞాపకాలకు సంబంధించిన సన్నివేశంలో ఈ పాట వస్తుంది. స్వరకల్పనా పరంగా అధ్యయనం చేయవలసిన కొన్ని అంశాలున్నాయి ఈ గీతంలో. అందులో మొదటిది మహరాష్ట్ర సంగీత ప్రభావం. శాంతకుమారి, పి.సూరిబాబు, ఈలపాట రఘురామయ్య మొదలైన వారు నాటక రంగం నుంచి వచ్చిన 'గానతారలు'. మన నాటక రంగంపై మహరాష్ట్రకు సంబంధించిన మరాఠీ సంగీతపు పోకడలు, వాటి ప్రభావం ఆ రోజుల్లో ఎక్కువగా వుండేది. సంగీత దర్శకుడు పెండ్యాల కూడా నాటక రంగం నుంచి వచ్చిన వ్యక్తే కావటం వల్ల ఆ ధోరణులు పూర్తిగా తెలుసాయనకి. ఆ సంప్రదాయాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ పాటని ఆయన ట్యూన్ చేశారా అని అనిపిస్తుంది. అందుకే పాట మొదట్లోనూ తొలి చరణంలోనూ తొంగి చూచే 'యమన్' రాగం సినీ సంగీత దర్శకులు అలవాటు చేసిన యమన్‌లా ఉండదు. మరాఠీ సంప్రదాయపు 'నాట్యగీత్'లా వుంటుంది. మధ్యలో పీలూ రాగచ్ఛాయలు కూడా కనిపిస్తూ వుంటాయి.

చిన్నారి ఓ చిలుక విన్నావా ॥2॥
యిన్నాళ్ల కోరిక యీడేరే వేడుక ॥చిన్నారి॥
ఏమని నా స్వామికి మనవిచేసినావో ॥2॥
నా మనసు తెలిపినావో
ఫలియించే నీ మాట పల్లవించె నా పాట ॥చిన్నారి॥
పెళ్లి పీటలపైనున్న వేళ ఒళ్లు మరిచి పిలిచేవు
నే ననుకుని తాను వులికిపడేను
నలుగురూ ననుజూచి నవ్వుకునేరు ॥చిన్నారి॥
అత్తవారి ఇల్లు మనకు కొత్తచోటు అయినా
తొలి వలపు ముచ్చటలో పాలయలుకలు వచ్చెనా
బెట్టుచేసి వారినే కవ్వించవే
ప్రేమతో నను చేరి నవ్వించవే ॥చిన్నారి॥







ఆత్రేయ రాసిన ఈ పాటను పి.సుశీల పాడగా సావిత్రి అభినయించింది. ఈ పాటకు తిలంగ్ ఆధార రాగం. ఇవాళ లభ్యం కాని పాటల్లో ఇదొకటి. ఎందుకంటే నిడివి కారణంగా చిత్రం నుండి తొలగించారు. తరువాత విడుదలయిన ఎల్పీ రికార్డులలో గాని, కాంబినేషన్ క్యాసెట్స్‌లో గాని ఈ పాటని చేర్చలేదు. ఆ రోజుల్లో విడుదలయ్యే 78 ఆర్.పి.యమ్. రికార్డులను సేకరించి భద్రపరచుకునే వారి వద్ద మాత్రమే ఈ పాట దొరికే అవకాశముంది. పెండ్యాల - సుశీల కాంబినేషన్‌లో వచ్చిన పాటల్లో చెప్పుకోదగ్గ పాట యిది. ఈ పాటను ఈ తరం వారికి అందించవలసిన ఆవశ్యకత ఆడియో రంగానికి వున్నది. సాహిత్యపరంగా ఆత్రేయ వాడిన 'పాలయలుకలు' అనే పదం గమనించదగ్గది.

కళ్యాణ వైభవమీనాడే చెలి కళ్యాణవైభవ మీనాడే
మన పద్మావతీ శ్రీనివాసుల ॥కళ్యాణ॥
చూతము రారే సుదతులందరు ॥2॥
చేతము రారే సింగారాలు ॥కళ్యాణ॥
పసుపుకుంకుమా అలదండీ
పచ్చని తోరణాల్ కట్టండీ ॥పసుపు॥
రంగురంగులా రత్నాలు కలిపి
ముత్యాల ముగ్గులు వేయరండి ॥కళ్యాణ॥
అతివ కోరిన వరుడు అతి లోక సుందరుడోయమ్మా
అతగానికన్నింట జతయౌను మా కొమ్మా - ఆహూం
అల్లారు ముద్దుగ పెరిగింది మా పిల్ల ఓయమ్మా
పువ్వుల్లో పుట్టాడు మా పిల్లవాడమ్మా - ఆహూం
చిలకలకొలికీ పద్మావతికీ కులుకే సింగారం -చెలి
గుణమే బంగారం
నవలామణికి నగవులగనికి మనసే లావణ్యం
లే వయసే వయ్యారం
చక్కని చెక్కిలి చుక్కెందులకే - ఎందుకే
చందమామలో నలుపున్నందుకే - ఆహా
చినదానికి ఆ సిగ్గెందులకే - అవును ఎందుకే?
మనసులోన మరులున్నందులకే
చల్లనైన తల్లివి శంకరుని రాణివి ॥చల్ల॥
దీవెనలే యివ్వవమ్మ దేవేరీ జయగౌరీ ॥చల్ల॥
పసిడికలల బాల తన పరిణయ శుభవేళ ॥పసిడి॥
ప్రణమిల్లెను బ్రతుకెల్లను పచ్చనైన పంటగా
దీవెనలే ఇవ్వవమ్మా దేవేరీ జయగౌరీ













ఆత్రేయ రాసిన ఈ పాటలో లీల, జిక్కి ప్రధాన గాయనీమణులు. ప్రధాన, ముఖ్య, సహ, ఉపపాత్ర ధారులెంతో మంది మీద చిత్రీకరించిన పాట యిదని సాహిత్యం చూడగానే అర్థమయిపోతుంది. పాట పల్లవి నుంచి తొలి చరణం (చూతము రారే సుదతులందరూ) చివరివరకూ సామ రాగాన్ని, రెండవ చరణం (అతివ కోరిన వరుడు అతిలోక సుందరుడోయమ్మా)కి మోహనరాగాన్ని ఉపయోగించారు. మూడవ చరణం (చిలుకలకొలికి పద్మావతికి కులుకే సింగారం)కి అంతర్గాంధారాన్ని కలుపుకుంటూ ఖరహరప్రియ స్కేల్‌లోని స్వరాలని, అక్కడక్కడ పీలూరాగం అనిపించేలా కూడా స్వరపరిచారు. ఇక ఆఖరి చరణం (చల్లనైన తల్లివి శంకరుని రాణివి)కి పక్కా సంప్రదాయ రీతిలో శంకరాభరణం రాగాన్ని ఉపయోగించారు. ఈ చరణాన్ని, సీతారామ కళ్యాణంలోని కానరార కైలాస నివాసా పాటని, భూకైలాస్‌లోని దేవమహాదేవ మముబ్రోవుము శివ పాటని, సాకల్యంగా సాధన చేస్తే శంకరాభరణ రాగంపై అవగాహన చాలావరకు వచ్చేస్తుంది.

ఆమె : కలగా కమ్మని కలగా
మన జీవితాలు మనవలెగా ॥కలగా॥
అనురాగమే జీవన జీవముగా
ఆనందమే మన కందముగా ॥కలగా॥
ఆమె : రాగవశమున మేఘమాలిక
మలయపవనుని కలిసి తేలగా
అతడు : కొండను తగిలి గుండియ కరిగి
నీరై ఏదై పారునుగా
కలగా కమ్మని కలగా
మన జీవితాలే ఒక కలగా
అతడు : వెలుగు చీకటలు కలబోసిన
ఈ కాలము చేతిలో కీలు బొమ్మలము
ఆమె : భావనలోనే జీవనమున్నది
మమతే జగతిని నడుపునది
మమతే జగతిని నడుపునది
కలగా కమ్మని కలగా
ఆమె : తేటికోసమై తేనియ దోచే
విరి కన్నియకా సంబరమేమో
అతడు : వేరొక విరిని చేరిన ప్రియుని
కాంచినప్పుడా కలత ఏమిటో
ప్రేమకు శోకమే ఫలమేమో
రాగము త్యాగము జతలేమో ॥కలగా॥







ఈ పాటను ఘంటసాల, సుశీల ఆలపించారు. ఎన్టీఆర్, సావిత్రి అభినయించారు. లక్ష్మీదేవి, పద్మావతిదేవి మధ్య జరగబోయే సంవాద ఫలితంగా తాను శిలను కానున్నానన్న అర్థంతో శ్రీనివాసుడు - అవేవీ ఎరుగని తన లౌకిక ధోరణిలో పద్మావతి - పాడుతున్నట్టుగా పాత్రోచిత ఉన్మీలనంతో రాసిన ఆత్రేయ ముద్ర - రెండవ మూడవ చరణాలలో బలంగా కనిపిస్తుంది. అయితే పాట సాహిత్యాన్ని కాస్త లోతుగా పరిశీలిస్తేగాని ఈ 'కథార్థ సూచన ప్రక్రియ' అవగతమవదు. ట్యూన్‌పరంగా చూసుకుంటే ఈ పాట బొత్తిగా, పూర్తిగా పెండ్యాల మార్కు గీతం అని ఒకటో ఎక్కం అప్పజెప్పినంత సులువుగా చెప్పెయ్యొచ్చు. మొదటి చరణం 'రాగవశమున మేఘమాలిక' అనే వాక్యం వినగానే 'రాగమయీ రావే' (జయభేరి) పాటలో 'చివురులు మేసిన చిన్నారి కోయిల' అనే లైను దగ్గరి ట్యూన్ గుర్తుకొచ్చేస్తుంది. అలాగే చివర్న ఉన్న 'ప్రేమకు శోకమె ఫలమేమో' అనే వాక్యాల వరస 'చిగురాకులలో చిలకమ్మ' (దొంగరాముడు) పాటలోని 'కలవా విలువలు సెలవీయ' అనే లైనుని యధాతథంగా జ్ఞప్తికి తీసుకొస్తుంది. తర్వాతి రోజుల్లో వచ్చిన 'శ్రీకృష్ణార్జునయుద్ధం' చిత్రంలోని 'స్వాముల సేవకు వేళాయే' పాట చరణాల ఇంటర్‌లూడ్‌లో ఫ్లూట్ బిట్‌ని స్మృతి పథంలో నిలుపుకొని మళ్లీ వెనక్కి వచ్చి 'కలగా కమ్మనికలగా' పాటలోని 'తేటికోసమై తేనీయ దోచే' అనే చరణానికి ముందు వచ్చే ఫ్లూట్ ఇంటర్‌లూడ్‌తో పోల్చుకుంటే రెండూ ఒక్కలాగే ఉన్నట్టనిపిస్తుంది. ఈ చిత్రాలన్నిటికి సంగీత దర్శకుడు పెండ్యాల కావడం, ఉదహరించిన ఈ పాటలన్నీ భీంప్లాస్ రాగంలోనే ఉండడం - ఇవన్నీ ఆ రాగాన్ని పెండ్యాల మలచుకునే పద్ధతిని స్పష్టంగా తెలియజేస్తాయి.

కళ్లు తెరువరా నరుడా నీ ఖర్మ తెలియరా ....
కళ్లు తెరువరా నరుడా
కలిమిలేములకు కష్ట సుఖాలకు ॥2॥
కారణమొకటే రా... కారణమొకటేరా.....
నీ ఖర్మే మూలమురా కళ్లు తెరువరా నరుడా
వేపను విత్తి దాతకోసమై వేడుక పడుట వెర్రి కదా ॥2॥
కాలికి రాయి తగులుట కల్ల... కాలికి రాయి తగులుట కల్ల...
రాయికి కాలే తగులునా రా కళ్లు తెరువరా నరుడా
కమలనాభుని పదకమలములే కలుష జలధికి చేతుమురా ॥2॥
కలిమాయలలో కలత చెందిన ఆ... ॥2॥
ధరణికి అదియే తారకమగురా ॥2॥
కళ్లు తెరువరా నరుడా నీ ఖర్మ తెలియరా ....కళ్లు తెరువరా.... నరుడా




ఈ పాటను పి.సూరిబాబు గానం చేసి అభినయించారు. అద్భుతమైన స్వరధాటి కలిగిన పి.సూరిబాబు గురించి ఈ తరం వారికి బొత్తిగా తెలియదు. విచిత్రం ఏమిటంటే సినీ సంగీత రంగంలోనున్న వారిలో కూడా చాలా మందికి తెలియదు. వారికన్నా శ్రోతలలోనే ఎక్కువమంది తెలిసినవాళ్ళున్నారనిపిస్తుంది. ఈ పాటకు రచన ఆత్రేయ. భక్తిగీతాలు ఆత్రేయ రాయడని చాలామంది అనుకుంటారు గానీ ఆయన రాసినవెన్నో ఉన్నాయి. సింధుభైరవి రాగంలో సాగిన ఈ పాటని కూడా నిడివి కారణంగా చిత్రం నుండి తొలగించారు. శ్రీ వేంకటేశ్వర వైభవం సినిమాతో పాటు వేసిన శ్రీ వేంకటేశ్వర మహత్మ్యం కాంబినేషన్ క్యాసెట్‌లో కూడా లేదు. హెచ్.ఎం.వి.లో పనిచేసిన శివప్రసాద్ మాత్రం 78 ఆర్.పి.యమ్. రికార్డుల్లో దొరికిన ఈ పాటని టేపుల్లోకి ట్రాన్స్‌ఫర్ చేసి 'సింగింగ్ స్టార్స్' అనే కాన్సెప్ట్‌తో ఓ ఆడియో క్యాసెట్‌గా విడుదల చేస్తే అదృష్టవశాత్తు మళ్లీ బైటికొచ్చింది.

శేషశైలా వాస శ్రీ వెంకటేశా
శయనించు మా అయ్య శ్రీ చిద్విలాసా ॥శేష॥
శ్రీదేవి వంకకు చిలిపిగా చూడకు
అలమేలు మంగకు అలుకరానీయకు ॥శ్రీదేవి॥
ముద్దు సతులిద్దరిని ఇరువైపులా చేర్చి ॥ముద్దు॥
మురిపించి లాలించి ముచ్చటల దేల్చి ॥శేష॥
పట్టు పానుపుపైన పవ్వళించర స్వామి ॥పట్టు॥
భక్తులందరు నిన్ను ప్రస్తుతించి పాడ
చిరునగవులొలుకుచూ నిదురించు నీమోము ॥చిరు॥
కరువుతీరా కాంచి తరియింతుము మేము ॥శేష॥



తెలుగు సినిమా పాటలలో ఈ యుగాంతం వరకు నిలిచిపోయే పాట ఏది అనే సందేహం ఎవరికైనా వస్తే అందుకు సమాధానంలా నిలిచిపోయే గీతంగా - 'శేషశైలవాస శ్రీవేంకటేశా' పాటను ఉదహరించవచ్చు. తెలుగువారు తను సుస్థిరాస్తిగా చెప్పుకొనే ప్రతిష్టాత్మక గాయకుడు ఘంటసాల - తన అణువణువూ భక్తితత్వాన్ని నింపుకున్న స్వరార్చకుడు కాబట్టే - శాశ్వతత్వం కలిగిన ఈ గీతాన్ని పాడి, తెరపై అభినయించే అదృష్టం ఆ గానమయ్యకు దక్కిందని చెప్పాలి. పూర్వజన్మ సుకృతమో లేక ప్రస్తుత జన్మలో అబ్బిన సంస్కారమో ఉంటేనే గాని ఇటువంటి మహద్భాగ్యాలు లభించవు. ఒక కృతికి చెందవలసిన గౌరవాన్ని స్వంతం చేసుకున్న ఈ గీతాన్ని రచించిన ఆత్రేయ కూడా ఆ కృపకు సమపాత్రుడు. ఈ పాటను 'రీతిగౌళ' రాగంలో స్వరపరిచారు పెండ్యాల. ఈ రాగంలో వచ్చిన పూర్తి సినిమా పాట తరువాత రోజుల్లో ఇంచుమించుగా ఇంకేదీ లేదనే చెప్పాలి. 'రహస్యం' చిత్రంలో ఘంటసాల స్వరపరిచిన 'గిరిజా కళ్యాణం' యక్షగానంలో 'ఈశుని దాసుని చేతువా' అంటూ సుశీల పాడిన చరణం మాత్రం మరో ఉదాహరణగా నిలుస్తుంది.

'వేంకటేశ్వర మహాత్మ్యం' చిత్రం సినిమా ప్రదర్శన జరిగినంతకాలం ఆంధ్రదేశంలోని అన్ని థియేటర్ల ఆవరణలోనూ వెంకటేశుని విగ్రహాలు ఉంచి నిత్యపూజలు జరిపేవారు. టిక్కెట్లతోపాటు వెంకటేశ్వరస్వామి, పద్మావతి క్యాలండర్లను ఇచ్చేవారు. పూజలు జరిగేచోట హుండీలలో భక్తులు వేసే ధనం ఒక్కోసారి థియేటర్‌లోని కలెక్షన్లను కూడా మించిపోయేది. సంగీత సాహిత్య నటనా చిత్రీకరణపరంగా మొత్తం చిత్రాన్ని భక్తి పారవశ్యంతో ప్రతివారూ చూసి మెచ్చుకున్న చిత్రంగా చరిత్రలో నిలిచిపోయిందీ 'వేంకటేశ్వర మహాత్మ్యం'. ■

# సరిగపదమని ఫలితాలు 5

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : జి.శ్రీదేవి, విశాఖపట్నం. |
| ఒక తప్పుతో | : మల్యాల హరిశ్రీకృష్ణ, హైదరాబాద్. |
| రెండు తప్పులతో | : బెల్లంకొండ రాంబాబు, పమిడిపాడు. |
| మూడు తప్పులతో | : బొజ్జ హరికృష్ణ, మద్రాసు. |

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన గాయని కౌసల్య గారికి, విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.







సరిగపదమని విజేతలైన
గురిజాల శ్రీదేవి, మల్యాల హరిశ్రీకృష్ణ,
బెల్లంకొండ రాంబాబు బొజ్జ హరికృష్ణ లకు
హార్దిక పూర్వక శుభాభినందనలు.

Kousalya



'హాసం' మా అందరి అభిమాన పత్రిక. నేను ఇంటర్మీడియట్-I వ సంవత్సరం చదువుతున్నాను. నాకు హాస్యం అంటే ప్రాణం. సంగీతం అంటే ఇంకా ఇష్టం. 'సరిగపదమని' పోటీలో నేను విజేతగా ఎంపికైనట్టు ఫోన్ కాల్ రాగానే ఆనందంతో ఉబ్బితబ్బిబ్బు అయ్యాను. కౌసల్యగారి చేతుల మీదుగా తీసిన "డ్రా"లో నాకు ఫస్ట్ ప్రైజ్ వచ్చినందుకు చాలా అనందంగా ఉంది. 'హాసం' సంపాదక వర్గానికి హాస్య, సంగీత, సాహిత్య, సౌరభాభివందనాలు.

**-జి.శ్రీదేవి, విశాఖపట్నం.**



"సరిగపదమని'- 3,4&5లకు నేను పంపిన జవాబులు, ఫలితాలు వరసగా నా పేరు చూసిన మురిపానికి తోడుగా, నేనూహించని 5వడ్రాలో గాయని కౌసల్యగారి చేతులు మీదుగా 2వబహుమతి విజేతనైనానని ఫోను ద్వారా తెలుపగానే, పట్టరాని అమితానందాన్ని మాకుటుంబ బంధుమిత్రులందరం పంచుకొన్నాము. కౌసల్యగారికి మరియు 'హాసం' కుటుంబీకులందరికి కృతజ్ఞభివందనాలు.

"హాసం- హాస్య, సంగీత, సాహిత్యాలతో చేసిన పాయసం.

**- మల్యాల హరిశ్రీకృష్ణ, అర్చకులు, రామలయం, రామచంద్రపురం, హైదరాబాద్.**



'హాసం'లో 'సరిగపదమని' శీర్షికకి మొదటి నుండి నేను అభిమానిని. అందుకే ప్రతి సంచికలో వచ్చే పోటీలో పాల్గొంటున్నాను. సరిగపదమని-5లో మూడో విజేతగా నన్ను ఎంపిక చేసినట్టు 'హాసం' పంపిన టెలిగ్రామ్ అందుకొని చాలా సంతోషించాను. నా అభిమాన గాయని కౌసల్య నన్ను ఎంపిక చేయటం నా ఆనందానికి హద్దులు లేకుండా కాసేపు ఏం చేస్తున్నానో తెలియలేదు. ఇది నాలాంటి వారికి మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

**- బెల్లంకొండ రాంబాబు, పమిడిపాడు.**



మా మనసుదోచిన మా అభిమాన 'హాసం' పత్రికలో సరిగపదమని పజిల్లో నాకు బహుమతి వచ్చిందని గౌరవనీయులు శ్రీరాజాగారు ఫోన్ చేసినప్పుడు చాలా ఆనందపడ్డాను.

మరుగునపడుతున్న పాతపాటలకు ప్రాణం పోసి మరల వెలుగులోకి తీసుకువచ్చి, నాలాంటి సంగీతభిమానులకు 'హాసం' పత్రికొక వరంలాంటింది. డ్రా తీసిన గాయని కౌసల్యగారికి, నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

**-బొజ్జ హరికృష్ణ, మద్రాసు.**

# తెరవెనుక కథ

అన్నపూర్ణ పిక్చర్స్ ప్రైవేటు లిమిటెడ్ వారి విజయ పరంపరలో అత్యంత ప్రతిష్ఠాకరమైన చిత్రం డా.చక్రవర్తి. ఇది తొలి తెలుగు నవలా చిత్రం. "చదువుకున్న అమ్మాయిలు" చిత్రానికి డైలాగ్స్ రాస్తున్న తరుణంలోనే రచయిత త్రిపురనేని గోపీచంద్ ఆంధ్రప్రభ నిర్వహించిన నవలల పోటీల్లో న్యాయ నిర్ణేతల కమిటి మెంబరుగా ఉన్నారు. "పోటీకి వచ్చిన నవలల్లో కోడూరి కౌసల్యాదేవి రచించిన "చక్రభ్రమణం" నవల చాలా అద్భుతంగా ఉంది. ఆ నవల రైట్స్ మీరు తీసుకోండి, ఆ నవల బయటకు వచ్చిందంటే ఎవరో ఒకళ్లు తీసుకుంటారు త్వరపడండి" అని హెచ్చరించారు. ఇదిగో వెళ్దాం- అదిగో వెళ్దాం అనుకుంటుండగానే ఆ నవల మార్కెట్లో విడుదలైంది. అది చదివిన పాఠకులు అన్నపూర్ణ సంస్థ ఈ నవలను సినిమాగా తీస్తే బాగుంటుంది అని వ్రాస్తూ, ఏఏ పాత్రలకు ఎవరెవరు బాగుంటారో కూడా సూచిస్తూ, వందల సంఖ్యలో ఉత్తరాలు వ్రాశారు.

వెంటనే ఆ నవల రైట్స్ కొనటానికి కోడూరి కౌసల్యాదేవి స్వస్థలమైన రాజమండ్రి బయలుదేరారు నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు. అంతకుముందే దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు ఆ నవల రైట్స్ కొనుగోలు నిమిత్తం, రాజమండ్రి వెళ్లారట. అయితే మేము అన్నపూర్ణ సంస్థకైతేనే ఇస్తామండీ అని చెప్పారట. "అన్నపూర్ణ సంస్థకి డైరెక్టరును నేనే కదమ్మా! సరే! వారికే ఇవ్వండి" అని చెప్పి ఆదుర్తి వెనుతిరిగారు. ఈ విషయం మధుసూదనరావు వెళ్లినపుడు చెప్పారు కోడూరి కౌసల్యాదేవి, ఆమె తండ్రిగారు, సరే! నవల రైట్స్ కొనుగోలు చేయటం జరిగింది. డైలాగ్స్ కూడా ఆమెనే వ్రాయమని ఆఫర్ చేశారు మధుసూదనరావు.

"పెళ్లి కావలసిన పిల్ల, సినిమాలకు వ్రాయటం కోసం హోటల్స్‌లో దిగటం. ఊర్లు తిరగటం మంచిది కాదు. వద్దులెండి" అని అవకాశాన్ని సున్నితంగా తిరస్కరించారు ఆమె తండ్రి.

ఇవన్నీ 'చదువుకున్న అమ్మాయిలు' చివరి రోజుల్లో జరిగిన సంగతులు. ఆ చిత్రం విడుదలై విజయవంతంగా ఆడుతున్న రోజుల్లో 'డాక్టరు చక్రవర్తి' స్క్రిప్ట్ వర్క్‌కు శ్రీకారం జరిగింది.

ఈ చిత్రానికి కె.విశ్వనాథ్ దర్శకత్వం వహించవలసి ఉంది. కె.విశ్వనాథ్ వాహినీ స్టూడియోలో సౌండ్ రికార్డింగ్ ఇంజనీరుగా చేస్తుండేవారు. మూడు చిత్రాలకు అసోసియేట్‌గా పనిచేసిన తర్వాత డైరెక్టర్‌గా అవకాశం ఇచ్చే అవగాహనపై అన్నపూర్ణ సంస్థలో చేరారు కె.విశ్వనాథ్. వెలుగునీడలు, ఇద్దరుమిత్రులు, చదువుకున్న అమ్మాయిలుతో మూడు చిత్రాలు పూర్తయ్యాయి. ఒప్పందం ప్రకారం డాక్టర్ చక్రవర్తికి దర్శకత్వం వహించమని కోరారు మధుసూదనరావు.

అయితే డాక్టరు చక్రవర్తి కథ విపరీతమైన ప్రజాదరణ పొందిన నవల కావటంతో దాన్ని హేండిల్ చేయటానికి విశ్వనాథ్ కొంచెం సంకోచించారు. ఈ చిత్రం వరకు గురువు గారైన ఆదుర్తి గారు చేస్తే తరువాత చిత్రం చేస్తానులెండి - అన్నారాయన. ఆ కారణంగా డాక్టర్ చక్రవర్తి చిత్రానికి కూడా ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం వహించక తప్పలేదు. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే రచయితగా గొల్లపూడి మారుతీరావును నియమించారు. దాశరథి సూచన మేరకు గొల్లపూడి మారుతీరావుకు కథా చర్చల్లో పాల్గొనే అవకాశాన్ని కల్పించారు. పరిచయం జరిగిన కొద్ది రోజుల్లోనే ఆయనలో గల ప్రతిభను గుర్తించి అన్ని విధాల ఎంకరేజ్ చేయాలనుకున్నారు మధుసూదనరావు. అందుకే తనతో పాటు దర్శకుడు ఆదుర్తి, కె.విశ్వనాథ్ కూడా స్క్రీన్‌ప్లే రచనలో పాల్గొన్నప్పటికి టైటిల్స్‌లో స్క్రీన్‌ప్లే రచయితగా ఎంకరేజ్ చేయాలని ఒక్క మారుతీరావు పేరు మాత్రమే వేయించారు మధుసూదనరావు. ఆవిధంగా తెలుగు చిత్ర పరిశ్రమకు మరొక గొప్ప రచయితను అందించింది అన్నపూర్ణ సంస్థ. ఇద్దరు మిత్రులు, చదువుకున్న అమ్మాయిలు చిత్రాలకు దూరంగా వున్న ఆత్రేయ ఈ చిత్రానికి సంభాషణల రచయితగా మరలా అన్నపూర్ణలో ప్రవేశించారు ఆత్రేయ.

ఈ చిత్రంలోని పాత్రలకు నటీనటుల ఎంపిక చేసిందిమాత్రం పాఠకులే! చక్రభ్రమణం నవల చదివి ఏ పాత్రకు ఎవరు సరిపోతారో సూచిస్తూ పాఠకులు వ్రాసిన అభిప్రాయాల ప్రకారమే నటీనట వర్గం ఎంపిక జరిగింది.

ప్రేక్షకుల అభిప్రాయాలు అన్నపూర్ణ సంస్థ నిర్ణయాలు ఒకటి కావటం యాదృచ్ఛికం కాదు. అన్నపూర్ణ సంస్థ ప్రేక్షకుల అభిరుచిని తమ చిత్రాల్లో ప్రతిబింబింప చేస్తుందని చెప్పటానికి ఇదొక గొప్ప నిదర్శనం!

మహానటి సావిత్రి అన్నపూర్ణ సంస్థలో చేసిన చివరి చిత్రం డా.చక్రవర్తి. షావుకారు జానకి తొలిసారి అన్నపూర్ణ సంస్థలో నటించింది కూడా ఈ చిత్రంలోనే.

"చదువుకున్న అమ్మాయిలు"తో హైద్రాబాద్‌లో కాలుమోపిన అన్నపూర్ణ సంస్థ తదుపరి చిత్రాలన్నీ ఇక్కడే నిర్మించింది. ఈ సంస్థ తీసే చిత్రాల కోసమే నవయుగ డిస్ట్రిబ్యూటర్స్ సారథి స్టూడియోస్‌లో మేజర్ షేర్స్ తీసుకున్నారు. ఇక్కడ చిత్ర నిర్మాణం చేస్తున్నాం కాబట్టి ఇక్కడ ఉన్న నటీనట సాంకేతిక వర్గాన్ని సాధ్యమైనంత వరకు వినియోగించుకోవటాన్ని నైతిక బాధ్యతగా భావించింది అన్నపూర్ణా సంస్థ. "చదువుకున్న అమ్మాయిలు" చిత్రం రీ-రికార్డింగ్, మిక్సింగ్ ఇక్కడే జరపగా... డా.చక్రవర్తి చిత్రానికి బ్యాక్ ప్రొజెక్షన్ కూడా హైదరాబాద్‌లోనేజరిపారు. చిత్రంలోని మొదటి పాట "ఈ మౌనం ఈ బిడియం" మొత్తం ట్రైన్‌లోనే చిత్రీకరించవలసి ఉంది. అందుకోసం పెరంబూర్ ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ నుండి ప్రత్యేకంగా వర్కర్స్‌ను పిలిపించి ఒక ఫస్ట్ క్లాస్ రైలు పెట్టె నిర్మింపచేశారు. ప్లాట్‌ఫారంను సారథి స్టూడియోలో వేశారు. ఈ పాట చిత్రీకరణలోని బ్యాక్ ప్రొజెక్షన్ మొత్తం ఇక్కడే జరిపారు. ఈ విధంగా హైదరాబాద్‌లో చిత్ర నిర్మాణానికి అనువైన సౌకర్యాలు అన్నీ ఉన్నాయని ఆనాటి నుండి నిరూపిస్తూ వచ్చింది అన్నపూర్ణ సంస్థ!

చిత్ర నిర్మాణం పూర్తయింది. 1964 జూలై 10న విడుదలై అఖండ విజయాన్ని సాధించాడు డా.చక్రవర్తి. ఈ చిత్ర విజయంలో చెప్పుకోదగ్గ విషయం ఏమంటే మాస్ ప్రేక్షకుల కన్నా క్లాస్ ప్రేక్షకులే చిత్రాన్ని విపరీతంగా ఆదరించారు. దీనికి కారణం ఇది తొలి నవలా చిత్రం కావటమే. అయితే క్లాస్ ప్రేక్షకుల ఆదరణతో పాటు వారి విమర్శలను కూడా చవి చూసాడు డా.చక్రవర్తి.

ముఖ్యంగా కామెడీ విషయంలో ఈ చిత్రం కొన్ని విమర్శలను ఎదుర్కొంది. అద్భుతమైన కథా సంవిధానంతో రూపొందించిన ఈ చిత్రంలోని హాస్యం మూలకథ నుండి కొంత డీవియేట్ అయింది. హాస్యానికి ప్రేక్షకుల నుండి మంచి ప్రతిస్పందన లభించినప్పటికి ముఖ్య కథా గమనానికి హాస్య సన్నివేశాలు స్పీడ్ బ్రేకర్స్‌లా అడ్డుపడ్డాయని కొన్ని పత్రికలు విమర్శించాయి. రచయిత్రి కోడూరి కౌసల్యాదేవి కూడా ఈ విషయంలో కొంత అసంతృప్తి చెందారు. అయితే ఈ విమర్శల్లో వాస్తవం లేకపోలేదంటారు మధుసూదనరావు. హాస్యం అనేది చిత్రకథలో అంతర్భాగమై ఉండాలే గానీ హాస్యం కోసమే కొన్ని పాత్రలను సృష్టించకూడదు అని కె.వి.రెడ్డిగారి దగ్గర నేర్చుకున్న పాఠాన్ని ఈ చిత్రంలో ఆచరణలో పెట్టలేకపోయాము అంటారు మధుసూదనరావు.

కారణం - ఇది ఎంతో ప్రజాదరణ పొందిన నవల కావటం!

వచ్చిన విమర్శలను నిజాయితీగా అంగీకరించే తత్వాన్ని అలవరచుకోవటమే రాబోయే విజయాలకు హేతువు అవుతుంది. విమర్శలను ఆహ్వానించే ధైర్యం అన్నపూర్ణ అధినేతలైన మధుసూదనరావుకు, నాగేశ్వరరావుకు ఇతర పార్టనర్స్‌కు ఆది నుండి అబ్బిన సుగుణాలు!

ఇక సంగీతం విషయంలో డాక్టర్ చక్రవర్తి గత చిత్రాల ప్రమాణాలను పదిలంగా కపాడింది. ఆరుద్ర, ఆత్రేయ, శ్రీశ్రీ, దాశరథి, కొసరాజు వ్రాసిన పాటలకు ఎస్.రాజేశ్వరరావు సమకూర్చిన సంగీతం చిత్ర విజయంలో సమభాగస్వామి అయింది. ముఖ్యంగా శ్రీశ్రీ రచించిన 'మనసున మనసై బ్రతుకున బ్రతుకై' పాటకు పండిత పామర వర్గాల నుండి సమస్థాయిలో ప్రశంసలు లభించాయి.

ఇక అవార్డుల విషయంలో కూడా డాక్టర్ చక్రవర్తి అగ్రస్థానాన్ని ఆక్రమించింది. ఈ చిత్రానికి నేషనల్ అవార్డ్స్‌లో ఉత్తమ ప్రాంతీయ చిత్రం అవార్డు (రజిత పతకం) లభించింది. అదే సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం నెలకొల్పిన నంది అవార్డులలో ఉత్తమ చిత్రంగా తొలి స్వర్ణ నందిని అందుకున్న చిత్రం డా.చక్రవర్తి. ఏ.పి. ఫిలిం ఫ్యాన్స్ వారి బెస్ట్ పిక్చర్ అవార్డ్, మద్రాసు ఫిలిం ఫ్యాన్స్ వారి బెస్ట్ పిక్చర్ అవార్డ్‌తో పాటు ఇంకా ఎన్నో సాంస్కృతిక అవార్డులందుకుని సంస్థ కీర్తిని దేశ వ్యాపితం చేసిన ప్రతిష్ఠాత్మక చిత్రం డా.చక్రవర్తి!

డాక్టర్ చక్రవర్తి శత దినోత్సవ వేడుకలల్ని ఐదు కేంద్రాల్లో ఘనంగా నిర్వహించాలని నిర్ణయించారు. అదే సమయంలో మాచెర్లలో వరదలు వచ్చి, ఎంతో ఆస్తి నష్టం, ప్రాణ నష్టం సంభవించింది. ఆ పరిస్థితుల్లో శతదినోత్సవాలు జరపటం సమంజసం కాదని భావించి, వేడుకలను రద్దుచేసి, అన్నపూర్ణా, నవయుగ సంస్థల తరఫున వరద బాధితుల సహాయ నిధికి 50 వేల రూపాయలు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారికి అందజేశారు.

ఆర్థికంగాను, అవార్డుల పరంగానూ డాక్టర్ చక్రవర్తి చిత్రం సాధించిన ఘనవిజయం మరొక చిత్ర నిర్మాణ సంస్థ ఆవిర్భావానికి ప్రేరణ అయింది అదెలాగంటే...

డాక్టర్ చక్రవర్తి చిత్రానికి బంగారు నందితో పాటు చిత్ర నిర్మాత మధుసూదనరావుకు పదివేల రూపాయలు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావుకు అయిదు వేల రూపాయలు నగదు బహుమతులు కూడా లభించాయి. తొలి నంది అవార్డుల ప్రదానోత్సవ సభలో ఉపన్యసించిన మంత్రులందరూ ఉత్తమ, ప్రయోజనాత్మక చిత్రాలను నిర్మించే సంస్థలకు ప్రభుత్వం అన్ని విధాల ప్రోత్సాహాలు కల్పిస్తుంది అని హామీలు ఇచ్చేశారు. అలాంటి చిత్రాలు నిర్మించినప్పుడు ఒకవేళ నష్టం వస్తే ఏదో ఒక రూపంలో ప్రభుత్వం ఆ నష్టాన్ని 'కాంపన్సేట్' చేస్తుంది అని కూడా హామీలు గుప్పించారు. ఈ హామీల ప్రభావం దర్శకుడు ఆదుర్తి మీద బాగా పనిచేసింది. ఆయన మనసులో ఒక ఆలోచన రూపుదిద్దుకుంది.

వెంటనే బయల్దేరి మధుసూదనరావు ఇంటికి వెళ్లారు ఆదుర్తి. అప్పటిదాక అవార్డుల సభలోను, ఆ తరువాత రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన విందులోనూ తనతో పాటే ఉన్న ఆదుర్తి అంతలోకే మిట్ట మధ్యాహ్నం వేళ ప్రత్యక్షమవటం చూసి ఆశ్చర్యపోతూనే ఆదుర్తిని ఆహ్వానించారు మధుసూదనరావు.

తన మనసులోని ఆలోచనను మధుసూదనరావు ముందుంచారు ఆదుర్తి.

"ఉత్తమ కథాంశాలతో నిర్మించే ప్రయోగాత్మక చిత్రాలకు ప్రోత్సాహం కల్పిస్తామని మంత్రులందరూ హామీలు ఇచ్చారు కాబట్టి మనకు వచ్చిన నగదు బహుమతులను మూలధనంగా పెట్టి ఒక కొత్త సంస్థను ప్రారంభించి 'ఎక్స్‌పెరిమెంటల్' చిత్రాలను నిర్మిద్దాం. పిక్చర్స్ ఫినిషింగ్‌కి కావలసిన డబ్బు నవయుగావారు యిస్తారు".

ఇదీ అత్యుత్సాహంతో ఆదుర్తి చేసిన ప్రతిపాదన.

ఈ ప్రతిపాదన విన్న మధుసూదనరావు ఒక్క క్షణం ఆలోచించి నవ్వుతూ "నేను ఇద్దరు ఆడపిల్లల పెళ్లిళ్లు చేయాలి. ఈ పరిస్థితుల్లో నేను ప్రయోగాలు చేయలేను" అని చెప్పడమే కాకుండా ఆదుర్తిని కూడా కొంత నిరుత్సాహపరిచారు.

తన ఆలోచనకు మధుసూదనరావు మద్దతు లభించకపోవటంతో నిరుత్సాహంగా వెనుతిరిగారు ఆదుర్తి.

ఆ తరువాత ఎలాగో ఈ విషయం అక్కినేని నాగేశ్వరరావు దృష్టికి వెళ్లింది. ఆయన ఆదుర్తి సుబ్బారావు ఆలోచనలకు మద్దతు పలికి 'చక్రవర్తి చిత్ర' సంస్థ ఆవిర్భావానికి కారకులయ్యారు.

అక్కినేని, ఆదుర్తిల ఆశయాలకు, అభిరుచికి అద్దం పట్టేలాగా సమాజానికి చక్కని సందేశాన్ని అందించే కథాంశంతో, ప్రయోజనాత్మక పంథాలో తొలుత 'సుడిగుండాలు' చిత్రాన్ని నిర్మించారు. ఆ చిత్రం ప్రజాదరణకు నోచుకోలేదు. బాగా నష్టపోయారు. అయితే ఆ చిత్రానికి జాతీయ అవార్డులలో ఉత్తమ ప్రాంతీయ చిత్రంగా రజత పతకం రాగా, నంది అవార్డులలో ఉత్త చిత్రంగా బంగారు నంది లభించింది. ఆర్థికంగా బాగా నష్టపోయినప్పటికి అవార్డులు ఇచ్చిన హార్దికోత్సాహంతో, ఆదర్శాల బలంతో 'మరోప్రపంచం' చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రం కూడా ఫెయిల్ అయింది. నష్టం రెండింతలు అయింది. ఇలాంటి చిత్రాలు నిర్మిస్తే అన్ని విధాల ప్రోత్సహిస్తామని ప్రభుత్వం వారు ఇచ్చిన హామీలు, హామీలుగానే మిగిలిపోయాయి. కనీసం ఆ చిత్రాలను 16 యం.యం. ప్రొజెక్టర్లతో స్కూళ్లలో ప్రదర్శించటానికి అవసరమయ్యే సహకారాన్ని కూడా ప్రభుత్వం అందించలేదు.

ప్రభుత్వం హామీలను నమ్మి ఆదర్శాలకు పోయినందుకు ఆర్థికంగానూ, హార్దికంగానూ చాలా నష్టపోయారు అక్కినేని, ఆదుర్తి!

లక్షల్లో నష్టం వచ్చినా నంది అవార్డు లభించిందన్న తృప్తి మాత్రమే మిగిలింది. ఆ రోజున ఆ చిత్రాల వల్ల కలిగిన ఆర్థిక నష్టాన్ని పూర్తిగా కాంపన్సేట్ చేయలేకపోయినా కొంత ఊరడింపుగానైనా రాష్ట్ర ప్రభుత్వం స్పందించి ఉంటే అదే బాటలో కొన్ని ప్రయోజనాత్మక చిత్రాలు వచ్చి ఉండేవి.

## కథా సంగ్రహం

వైద్యశాస్త్రంలో ప్రత్యేక శిక్షణ కొరకు విదేశాలకు వెళ్ళి వచ్చిన డాక్టర్ చక్రవర్తికి విమానాశ్రయంలో మిత్రులు అతనిని ప్రేమించిన డాక్టర్ శ్రీ దేవి ఘనస్వాగతమిచ్చారు. డాక్టర్ చక్రవర్తి, శ్రీదేవి త్వరలోనే వివాహం చేసుకోబోతున్నారని తెలిసిన మిత్రులందరూ వారిని పరిహాసాలతో ముంచెత్తివేశారు.

డా॥చక్రవర్తిని విదేశాలకు పంపటానికి ప్రధాన కారకులైన చక్రవర్తి చెల్లెలు సుధ, ఆమె భర్త శేఖర్ చక్రవర్తి పునరాగమనానికి ఎంతో సంతోషించారు. సుధ కథారచనా వ్యాసంగంలోను, సంగీతంలోను పేరు ప్రఖ్యాతులు గడించిందన్న విషయం తెలుసుకొన్న చక్రవర్తి మరింత ఆనందపడ్డాడు.

కాని ఈ సంతోషం ఎంతోకాలం నిలువలేదు. తన ప్రాణసమంగా చూసుకొంటున్న సుధకు క్యాన్సర్ వ్యాధి సోకిందని తెలిసిన చక్రవర్తి వ్యాధి నివారణకు తన శక్తినంతా ధారపోశాడు. అయినప్పటికి ఫలితం లేకపోయిందది.

మరణశయ్యపైనున్న సుధ తన మరణానంతరం తన భర్తతో గల సంబంధ బాంధవ్యాలను మరింత దృఢం చేయాలనే ఉద్దేశంతో శేఖర్ సోదరియైన నిర్మలను వివాహమాడవలసిందిగా చక్రవర్తిని కోరి శాశ్వతంగా కన్నుమూసింది. చక్రవర్తి శ్రీదేవిని ప్రేమిస్తున్న సంగతి ఆమెకు తెలియదు.

పరిస్థితులను అర్థం చేసుకొని నిర్మలా చక్రవర్తుల వివాహానికి తోడ్పడింది శ్రీదేవి.

సుధ స్మృతి చిహ్నంగా శేఖర్ నిర్మించిన నర్సింగ్‌హోంలో డాక్టరు చక్రవర్తి పని ప్రారంభించాడు.

రవీంద్ర ఇంజనీరు. చక్రవర్తి మిత్రుడు. రవీంద్ర ఇల్లాలు మాధవి. వారు అన్యోన్యత గల ఆదర్శ దంపతులు.

నూతన దంపతులైన నిర్మలా, చక్రవర్తులను రవీంద్ర తన యింటికి విందుకు ఆహ్వానించాడు. మాధవి ఉన్నత విద్యావంతురాలు, రచయిత్రి, సంగీత కళానిధి. అన్నిటికంటె మించి ఆదర్శ గృహిణి. ఈ విషయాలను తెలుసుకొన్న చక్రవర్తికి ఆమెలో తన సోదరి సుధ ఛాయలు గోచరించాయి. సుధపై గల వాత్సల్యాన్ని మాధవి వైపు మరల్చాడు. ఆ విధంగా కొంత ఊరట లభించింది.

మాధవీ చక్రవర్తుల సాన్నిహిత్యాన్ని అపార్థం చేసుకొన్న నిర్మల హృదయంలో అసూయ మొలకెత్తింది. దానికి వంటమనిషి సూర్యకాంతం దుర్బోధలు మరింత దోహదమిచ్చాయి. ఇదే సమయంలో గర్భవతియైన మాధవి రక్షణ భారాన్ని చక్రవర్తికి వప్పగించి రవీంద్ర క్యాంపుకు వెళ్ళాడు.

వంట మనిషి దుర్బోదలకు లొంగి నిర్మల రవీంద్రకు ఒక ఆకాశరామన్న ఉత్తరం వ్రాసింది.

మాధవీ, చక్రవర్తుల ప్రవర్తనకు నీచత్వాన్ని ఆపాదిస్తూ తనకు వచ్చిన లేఖను చూచి రవీంద్ర చకితుడైనాడు. అతనిలో అనుమానం పొడసూపింది. గతంలో జరిగిన కొనన్ని కొన్ని ఘటనలు ఈ అనుమానాన్ని బలపరచేవిగా తోచాయి. వెంటనే క్యాంపు నుండి బయలుదేరి వచ్చాడు.

శంకిత హృదయంతో చూచేవాడికి అన్నీ అలానే గోచరిస్తాయనేది రవీంద్ర విషయంలో అక్షరాల నిజం. మాధవి తాను నిర్దోషినని ఎంత చెప్పినా వినక మూర్ఖత్వంతో ఆమెను పుట్టింటికి పంపివేశాడు.

నిర్మలకు సూర్యకాంతం దుర్బోధలు చేస్తున్నదని గ్రహించిన చక్రవర్తి ఆమెను పనినుండి తొలగించివేశాడు. సూర్యకాంతం రవీంద్రవద్ద వంటమనిషిగా చేరింది.

మనోవైకల్యం పొందిన రవీంద్ర త్రాగుడుకు అలవాటుపడి క్లబ్బుల వెంట

తిరగటం ప్రారంభించాడు. ఆకస్మికంగా పతనావస్థకు చేరుకొన్న మిత్రునికి హితవు చెప్పాలని వచ్చిన చక్రవర్తిని అవమానించాడు.

ఎల్లప్పుడూ ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా ఉంటున్న మాధవి పరిస్థితి ఆమె సోదరుడైన శ్రీధర్‌కు ఆందోళన కలిగించింది. కారణం చెప్పమని మాధవిని వొత్తిడి చేశాడు. మాధవి జరిగిన విషయాన్ని తెలియజేసే సరికి శ్రీధర్ నిశ్చేష్టుడయ్యాడు.

సూర్యకాంతం కూతురు పద్మవైపుకు ఆకర్షింపబడ్డాడు రవీంద్ర. గ్రుడ్డి మోహంలో ఆమెను పెళ్ళి చేసుకొంటానని వాగ్దానం చేసి ఇంటి తాళాలు వప్పగించాడు.

అవకాశం దొరకగానే రవీంద్ర ఇంటిలోగల నగలు ధరించి తన ప్రియుడైన స్వామితో పరారైంది పద్మ. చోరీ విషయం పోలీసులకు ఫిర్యాదు చేశాడు రవీంద్ర. స్వామి, పద్మలను నగలతో సహా పోలీసులు పట్టుకొన్నారు. నగలను గుర్తుపట్టడానికి మాధవి నిరాకరించింది. రవీంద్ర పతనావస్థను గురించి శ్రీధర్ మాధవికి తెలియజేశాడు. ఏవిధంగానైనా తన భర్తను రక్షించమని మాధవి సోదరుని వేడుకొంది. శ్రీధర్ బయలుదేరాడు.

అతని మాటలను వినకపోగా, మాధవిని తను అనుమానించడానికి సాక్ష్యాలుగా నిర్మల రాసిన ఆకాశ రామన్న ఉత్తరాన్ని చూపించాడు. నువ్వెన్ని సాక్ష్యాలు చూపినా నేను నమ్మను. నా చెల్లెలు దేవత. ఏదో ఒకరోజు ఆమె కాళ్ళు పట్టుకుని క్షమించమని అడిగే రోజు నీ కొస్తుందని చెప్పి అక్కణ్ణుంచి వెళ్లిపోతాడు శ్రీధర్.

వెళుతూ వెళుతూ చక్రవర్తికే విషయం చెప్పి వెళతాడు శ్రీధర్. ఉత్తరంలోని నిర్మల చేతివ్రాతను గుర్తుపట్టి రవీంద్రకీ విషయం చెప్పి క్షమాపణ కోరమని అడుగుతాడు చక్రవర్తి. ఆమె అందుకు అంగీకరించదు. ఆమెను వదిలిపెట్టి విదేశాలకు వెళ్లిపోవడానికి నిశ్చయించుకుంటాడు చక్రవర్తి.

వెళ్లే ముందు రవీంద్ర దగ్గరకు వెళ్లి అతడికి హితవు చెప్పి ఇంకా నమ్మకం కలగకపోతే తనను చంపెయ్యమని తుపాకీ కూడా ఇస్తాడు. రవీంద్ర పశ్చాత్తాపంతో కుమిలిపోయి మాధవి దగ్గరకు పరుగెత్తుతాడు.

బిడ్డనుకని మృత్యువును తానుగా ఆహ్వానిస్తున్న మాధవిని కాపాడుతాడు చక్రవర్తి. విదేశాలనుంచి తిరిగివచ్చిన శేఖర్ తన చెల్లెలు నిర్మల చేసిన పనికి క్రుంగిపోయి ఆమెకు బాగా చివాట్లు వేసి బుద్ధి చెప్తాడు. ఆమెకూడా పశ్చాత్తప్త హృదయురాలవుతుంది.

మాధవి ప్రాణాల్ని కాపాడి తమ కాపురం నిలబెట్టిన చక్రవర్తిపై గల గౌరవభావాలకు కృతజ్ఞతగా తమ బిడ్డకు 'చక్రవర్తి' అని పేరు పెడతాడు రవీంద్ర.

అందరూ కలిసిపోయి ఆనందంగా వుంటారు.

రచన : ఆరుద్ర　　గానం : సుశీల, ఘంటసాల

చక్రవర్తి : ఈ మౌనం ఈ బిడియం -
ఇదేనా ఇదేనా చెలియకానుక
శ్రీదేవి : ఈ మౌనం ఈ బిడియం
ఇదేలే ఇదేలే మగువ కానుక
చక్రవర్తి : ఇన్నినాళ్ళ మన వలపులు
వికసించుట ఇందుకా
శ్రీదేవి : మమతలన్ని తమకుతామె
అల్లుకొనెడి మాలిక ॥ఈ మౌనం॥
శ్రీదేవి : మాటలలో తెలుపలేదు
మనసు మూగకోరిక
చక్రవర్తి : కనులు కలిసి అనువదించు
ప్రణయ భావగీతిక ॥ఈ మౌనం॥
చక్రవర్తి : ఏకాంతము దొరికినంత
ఎడమోమా నీ వేడుక
శ్రీదేవి : ఎంత ఎంత ఎడమైతే
అంత తీపి కలయిక ॥ఈ మౌనం॥

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : పి.సుశీల,

సుధ : పాడమని నన్నడగవలెనా - పరవశించి పాడనా
నేనే పరవశించి పాడనా - ॥పాడ॥
నీవు పెంచిన హృదయమే
ఇది - నీవు నేర్పిన గానమే... ॥నీవు॥
నీకు గాక ఎవరికొరకు
నీవు వింటే చాలు నాకు ॥పాడ॥
చిన్ననాటి ఆశలే
యీనాడు పూచెను పూవులై ॥చిన్న॥
ఆ పూవులన్నీ మాటలై
వినుపించు నీకు పాటలై ॥పాడ॥
ఈ వీణ మ్రోగక ఆగినా,
నే పాడజాలకపోయినా...
ఈ వీణ మ్రోగక ఆగినా,
నే పాడజాలకపోయినా...
నీ మనసులో యీనాడు నిండిన రాగమటులే వుండనీ
అనురాగమటులే వుండనీ - ॥పాడ॥

రచన : దాశరథి　　గానం: పి.సుశీల, వసంత

నిర్మల : నిజం చెప్పవే పిల్లా, ఎలాగుంది యీ వేళా -
నీ కెలాగుంది యీ వేళా
ఏది చూచినా ఏమి చేసినా ఏదోగా వుంది.
ఏమి చెప్పనే పిల్లా భలేగుంది యీవేళా...
స్నేహితురాలు : చిలిపివయసు కవ్వించె మనసు చిలికి మురిపించె
నిర్మల : నీలికన్నుల పాలులో పరదాలు పొంగే జోరులో
సంబరాలతో సరాగాలతో సాగిపోదమా... ॥నిజం॥
మాధవి : నాలో వెలిగే దీపం - నీ చిరునవ్వు చిందే రూపం
నీ కాంతిలో యీ శాంతిలో యీ లోకమే స్వర్గము
స్నేహితురాలు : నిన్నలేని పులకింత కన్నెపిల్ల కో వింత
నిర్మల : పాలబుగ్గలు మీటితే తొలిప్రేమ మొగ్గలువేసెనే
ఏల సిగ్గులే ఏమినిగ్గులే - మాకు తెలుసులేవే ॥నిజం॥
మాధవి : రాగం భావం నీవే - నా అనురాగ గీతం నీవే
నీ ప్రేమలో నే లీనమై - జీవించుటే స్వర్గము ॥రా॥

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : పి.సుశీల,

పాడమని నన్నడుగతగునా - పదుగురెదుట పాడనా
కృష్ణా ! పదుగురెదుటా పాడనా !
పొదలమాటున పొంచిపొంచి
ఎదను దోచిన వేణుగానము
పొదలమాటున పొంచిపొంచి
ఎదను దోచిన వేణుగానము
ఒలకబోసిన రాగసుధకు మొలకెత్తిన లలితగీతి... ॥పాడ॥
చిలిపి అల్లరి తెలిసినంతగ
వలపు తెలియని గోపకాంతలు
చిలిపి అల్లరి తెలిసినంతగ
వలపు తెలియని గోపకాంతలు
మెచ్చలేరే వెచ్చనీ హృదయాల పొంగిన - మధురగీతి... ॥పాడ॥
ఎవరులేనీ యమునాతటినీ
ఎక్కడో ఏకాంతమందున
ఎవరులేనీ యమునాతటినీ
ఎక్కడో ఏకాంతమందున
నీవు నేనై నేను నీవై... పరవశించే - ప్రణయగీతి... ॥పాడ॥

రచన : దాశరథి గానం: మాధవపెద్ది, సుశీల

ఆమె : ఓ వుంగరాల ముంగురుల రాజా !
నీ హంగు జూసి పొంగిపోను లేరా !
నా సామిరంగ దణ్ణవోయీ !
నా జోలికింక రాకోయీ !
ఓ సిన్నోడా ! ఓ సిన్నోడా ! సిన్నోడా!
అతడు : ఓ బొంగరాల బుగ్గలున్నదానా !
నీ కొంగు తాకి పొంగిపోతి జాణా!
నువ్ కస్సుమంటె తాళలేనే !
నీ పొందుగోరి వచ్చినానే !
ఓ చెలియ ! ఓ చెలియ ! ఓ చెలియ !
ఆమె : నీ కైపు కళ్లతో - నీకొంటె నవ్వుతో
గారడీ చేశావు
నీ తీపి మాటలు - నీళ్ళల్లో మూటలు
నిన్నింక నమ్మనోయీ !
అతడు : నా సిలకా... ఓయ్ - నీ అలకా.... ఓయ్
తెచ్చిందిలే అందం - నా కళ్లు చూడవే
నీ బొమ్మ ఆడెనే - మనసంత నీవేనే
ఆమె : పో పోవోయ్ -
అతడు : ఓ పిల్లోయ్ -
ఆమె : కిల్లాడీ చాలులే ॥వుంగరాల॥
ఆమె : ముచ్చట్లు గాలితో..... మురిపాలు పూలతో
నటనలు నాతోనా?
సరసాలు సుక్కతో.... సరదాలు మబ్బుతో
సయ్యాట నాతోనా?
అతడు : ఇటు సూడవే - ఓయ్ - నీ తోడులే - ఓయ్
దాసుడు నీవాడే - ఓయ్ - నువ్వుంటే పక్కన
మనసెంతో చల్లన - నా రాణి నీవేనే
ఆమె : ఓ రాజా
అతడు : నా రోజా
ఇద్దరు : ఈరోజే హాయ్ - హాయ్ - హాయ్ ॥బొంగ॥

రచన : శ్రీశ్రీ గానం : ఘంటసాల

మనసున మనసై... బ్రతుకున బ్రతుకై...
మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము ॥మన॥
ఆశలు తీరని ఆవేశములో ఆశయాలలో ఆవేదనలో
చీకటి మూసిన ఏకాంతములో -
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము...
నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీ కోసమె కన్నీరునించుటకు
నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీ కోసమె కన్నీరునించుటకు
నే నున్నానని నిండుగ పలికే -
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము ॥మన॥
చెలిమియె కరువై వలపే అరుదై
చెదరిన హృదయమె శిలయైపోగా
నీ వ్యధ తెలిసి నీడగ నిలిచే -
తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గము
మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము

రచన : ఆచార్య ఆత్రేయ గానం : పి.సుశీల

నీవు లేక వీణ పలుకలేనన్నది
నీవు రాక రాధ నిలువలేనన్నది ॥నీవు॥
జాజిపూలు నీకై రోజు రోజు పూచె
చూచిచూచి పాపం సొమ్మసిల్లిపోయె
చందమామ నీకై తొంగితొంగి చూచి
సరసన లేవని అలుకలు బోయె ॥నీవు॥
కలలనైన నిన్ను కనుల చూతమన్న
నిదురరాని నాకు కలలుకూడ రావె
కదలలేని కాలం విరహగీతి రీతి
పరువము వృధగా బరువుగ సాగె ॥నీవు॥
తలుపులన్నీ నీకై తెరచివుంచినాను
తలపులెన్నొ మదిలో దాచి వేచినాను
తాపమింక నేను ఓపలేను స్వామి
తరుణిని కరుణను ఏలగరావా ॥నీవు॥

రచన : కొసరాజు గానం : పి.బి.శ్రీనివాస్, యస్. జానకి

స్వామి : ఒంటిగ సమయం చిక్కిందీ ! కంటికి నిద్దుర రానంది !
మనకూ మనకూ ఇనుపగోడవలె ! తడిక అడ్డమై కూచుంది !
పద్మ : ఒంటిగ సమయం చిక్కిందా ! కంటికి నిద్దుర రాకుందా !
మనకూ మనకూ మనసులు కలిసిన !తడిక అడ్డమై కూచుందా !
స్వామి : ఇంటింటా ఒక ముసలి ఘటం ప్రేమికులకు అది పెనుభూతం
కదిలితే భయం మెదిలితే భయం
ఎన్నాళ్ళో యీ ఇరకాటం ॥ఒంటిగ॥
పద్మ : పెద్ద తలొక్కటి వుంటేనే హద్దు పద్దులో వుంటాము
ప్రేమ ముదిరితే పిచ్చి రేగితే
పార్కులో మళ్ళీ సరిగమలే ॥ఒంటిగ॥
స్వామి : ఎటుల భరింతును యీ విరహం ఒట్టి చూపులతో ఏమి ఫలం !
అమ్మ వచ్చినా అరచి చచ్చినా
విడువలేను యీ అవకాశం ॥ఒంటిగ॥
పద్మ : గుట్టుగసాగే సరసాన్ని రట్టు చేయకోయి నాసామీ
తడిక దాటినా దుడుకు చేసినా, తప్పదు మనకు తదిగిణతోం
అమ్మచేతిలో తదిగిణతోం ॥ఒంటిగ॥

రచన : ఆచార్య ఆత్రేయ గానం : ఘంటసాల

ఎవరో జ్వాలను రగిలించారు !
వేరెవరో దానికి బలియైనారు
వేరెవరో దానికి బలియైనారు ॥ఎవరో॥
అడుగు అడుగునా అపజయములతో,
అలసి సొలసిన నా హృదయానికి
సుధవై జీవనసుధవై
ఉపశాంతి నివ్వగా ఓర్వని వారలు ॥ఎవరో॥
అనురాగానికి ప్రతిరూపాలై
ఆది దంపతులవలె మీరుంటే
ఆనందంతో మురిశానే
ఆత్మీయులుగా తలచానే
అందుకు ఫలితం అపనిందేనా ॥ఎవరో॥
మనిషికి మనిషికి మమత కూడదా ?
మనసు తెలుసుకొను మమతే లేదా ?
ఇది తీరని శాపం ! ఇది మారని లోకం
మానవుడే దానవుడై మసలే చీకటి నరకం ॥ఎవరో॥

## తారాగణం

| | | |
|---|---|---|
| చక్రవర్తి | : | ఏ.నాగేశ్వరరావు |
| మాధవి | : | సావిత్రి |
| రవీంద్ర | : | కె.జగ్గయ్య |
| నిర్మల | : | జానకి |
| శ్రీధర్ | : | గుమ్మడి |
| శ్రీదేవి | : | కుమారి కృష్ణకుమారి |
| సుధ | : | కుమారి గీతాంజలి |
| సూర్యకాంతం | : | సూర్యకాంతం |
| పద్మ | : | జయంతి |
| వెంకటస్వామి | : | పద్మనాభం |
| రమణ | : | చలం |
| జగన్నాధరావు | : | సంగమేశ్వరరావు |
| శేఖర్ | : | మురళీకృష్ణ |

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| నిర్మాత | : | డి.మధుసూదనరావు, బి.ఏ. |
| దర్శకుడు | : | ఆదుర్తి సుబ్బారావు |
| అసోసియేట్ దర్శకుడు | : | కె.విశ్వనాథ్, బి.ఎస్.సి. |
| కథ | : | కుమారి కోడూరి కౌసల్యాదేవి (ఆంధ్రప్రభ వారపత్రిక పోటీలో ప్రథమ బహుమతి పొందిన "చక్రభ్రమణం" - నవల) |
| సంభాషణలు | : | ఆచార్య ఆత్రేయ |
| పాటలు | : | ఆత్రేయ, శ్రీశ్రీ, దాశరథి, ఆరుద్ర, కొసరాజు |
| ఛాయాగ్రహణం | : | పి.యస్.సెల్వరాజ్ |
| సంగీతం | : | యస్.రాజేశ్వరరావు |
| కళా దర్శకుడు | : | జి.వి.సుబ్బారావు |
| నృత్యం | : | హీరాలాల్, పసుమర్తి కృష్ణమూర్తి |
| కూర్పు | : | టి.కృష్ణ |
| అలంకరణ | : | చౌదరి, నాగేశ్వరరావు, వీర్రాజు |
| శబ్దగ్రహణం | : | కృష్ణంరాజు |
| ప్రాసెసింగ్ | : | యస్.రాజన్న |
| స్టిల్సు | : | సత్యం (జైహింద్ స్టూడియో) |
| స్టూడియో | : | సారథి (హైదరాబాద్) |


డి.మధుసూదనరావు


ఆదుర్తి సుబ్బారావు


ఆత్రేయ


శ్రీశ్రీ


దాశరథి


ఆరుద్ర


కొసరాజు


యస్.రాజేశ్వరరరావు


ఘంటసాల


పి.సుశీల


జానకి


పి.బి.శ్రీనివాస్






చార్లీ చాప్లిన్ నటించిన "ది ఐడిల్ క్లాస్" అనే సినిమా 1921లో విడుదలైంది. వాషింగ్టన్‌లోని బెల్లింగామ్ అనే వూళ్లో విడుదలైన రోజున ఆ సినిమా డిస్ట్రిబ్యూటరు ఓ తమాషా చేశాడు. అంతకుముందు విడుదలై పెద్ద హిట్ అయిన "ట్రాంప్" సినిమాలోని చాప్లిన్ గెటప్ వేసుకుని పిల్లలు థియేటర్‌కు వస్తే, వాళ్లందరికీ "ది ఐడిల్ క్లాస్" మొదటి ఆటకి ఉచితంగా టిక్కట్లు ఇస్తామని ప్రకటించాడు. అది చూసి పిల్లలు, పెద్దలూ అందరూ చాప్లిన్ వేషాలు వేసుకుని థియేటర్‌కి వచ్చారు. వాళ్లందర్నీ ముచ్చటగా నిలబెట్టి - తీసిన ఈ గొప్ప ఫోటోను డిసెంబరు 25 చాప్లిన్ వర్ధంతి సందర్భంగా... అందిస్తోంది....

## హాసం



